

"గుండమ్మ కథ"లో
పెద్ద జోడు.



# ప్రార్థన



రామ స్సీతా సమేతో నివసతు హృదయే
సానుజం రామమీడే
రామేణ క్షీణపాప స్త్రివిధమపి కృతం కర్మ
రామాయ దద్యామ్।
రామాదన్యం న జానే నహి కిమపి మహో
రామనామ్నస్సమానం
రామే పశ్యామి విశ్వం భువనమనుదినం
పాహిమాం రామచంద్ర॥

సీతాసమేతుడగు రాముడు నా హృదయమున నివసించుగాక! సోదర సహితుడగు రాముని నేను నుతించుచున్నాను. రామునిచే నేను పాపరహితుడనైతిని. మనో వాక్కాయములచే నేను చేసిన కర్మను రామునకే అర్పించెదను. రామునికంటె అన్యమైనదానిని నే నెఱుఁగను. మహత్తరమైన రామనామముతో సమానమైనది ఏదియును లేదు. ఈ ప్రపంచమునంతను ఎల్లప్పుడు రాముని యందే చూచుచున్నాను. ఓ రామచంద్రా! నన్ను రక్షింపుడు! ○○

Be generous, Be bold. Be tolerant. Be charitable. Be sincere. Be patient.

దయ, ధైర్యము, సహనము, దానధర్మములు, నిజాయితీ, ఓర్పు కలిగి వర్తింపుము.

All except the Lord perishes.

భగవంతుడు తప్ప ఈ ప్రపంచములో తక్కినవన్నియును నశించును.

# ఈ సంచికలో

ప్రతిమాదేవి, పోలవరపు శ్రీహరిరావు,

నందగిరి ఇందిరాదేవి, కె హరీష్, రామకృష్ణ

'యువతీ లోకం'

వసుమతీ రామారావు, మనోరమ, పద్మావతీ గంగాధర్



'ఉగాది ప్రత్యేక సంచికలో

| | | |
|---|---|---|
| దోషి ఎవరు ? | ... | పద్మావతీ గంగాధర్ |
| మజిలీ | ... | 'ఆదివిష్ణు' |
| బృహదారణ్యకం | ... | అరిపిరాల విశ్వం |
| అంపశయ్య | .. | పెద్దిభొట్ల సుబ్బరామయ్య |
| తెలివితక్కువవాడు | .. | ఇసుకపల్లి దక్షిణామూర్తి |

మొదలైనవి



ముఖచిత్రం : బావపంపిన చీర

చిత్రకారుడు వడ్డాది పాపయ్య




# దీర్ఘదృష్టి



హ్రస్వదృష్టి ఏ రంగమందును పనికిరాదు. ఇక పరమార్థ రంగమున దానికి అసలు తావే లేదు. సంకుచిత భావము కలవారికి, హృదయ వైశాల్యములేనివారికి ఆధ్యాత్మిక లక్ష్యము ఎన్నడును చేకూరదు. భగవంతుడు ఒకరి ప్రత్యేక సొత్తుకాదు. వారు అందఱి వారు. వారిని పొందుటకు, అనుభవించుటకు ప్రతి ప్రాణికిని పరిపూర్ణమైన స్వేచ్ఛ కలదు. ఆ స్వేచ్ఛను త్రోసివేయుటకు విశ్వమందెవనికిని హక్కు లేదు.

## శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు

అట్టి పరమాత్మను పొందుటకై ఒకానొకడు విశ్వాసముతో ఒకానొక మార్గమునుజేపట్టి పయనమై పోవుచుండ, మఱియొకడు అందులకేల అభ్యంతరము తెలుపవలయునో బోధపడుట లేదు, పరమత సహనము ముముక్షువునకు అత్యంతావశ్యకమైయున్నది తన మతమును అభివృద్ధి పఱచుకొనుచు, ఇతర మతములలో తనకు మంచిదని తోచినదానిని స్వీకరించుచు మనుజుడు తన అభ్యున్నతిని సాధించుకొనుచు పోవలెను దూషణచేతను, నిందచేతను ఏ కార్యమున్ను సాధింపబడదు పైపెచ్చు తన లక్ష్యమునకుకూడ దానిచే అవరోధము కలుగగలదు

'జోషయేత్సర్వ కర్మాణి విద్వాన్యుక్త సమాచరన్' అని గీతాచార్యులు తెలిపిన చందమున విజ్ఞుడగువాడు తాను చక్కగ ఆచరించుచుండినచో, ఆ




ఫిబ్రవరి సంచిక గత సంచిక కన్నా ఆకర్షణీయంగా వుంది. "శుభవార్త" 'కన్పించడం లేదు' కథలు చాలా బాగున్నవి.

క్రిష్ణాచారి,
హోసూరు

ఫిబ్రవరి యువ బాగుందనటానికి "సరళాక్ష హోమ్" "రాధికాస్వామి" లాంటి మరపురాని కథలేనిదర్శనం. "నా కాలేజీ అనుభవాలు",

'నీ లోకి చూడు' అనే నూతన శీర్షికలు ప్రారంభించినందుకు నా ధన్యవాదాలు

రాజేంద్రబాబు,
అలహాబాదు,

'పనిలేని మంగలి' ఎవరోగాని మమ్ము చక్కగా ఆకర్షించు చున్నాడు. అనిబిసెంటు వ్యాసంలో ప్రతివారు చదివి ఆచరించ వలసిన విషయాలు చాలా వున్నవి.

అప్పాజీ,
రాజమండ్రి.

యువ ఫిబ్రవరి సంచికలోని 'సౌదామిని' అనే స్ఫూర్తిశ్రీ గారి గేయం చాలా బాగుంది. అసలు నిజానికి చాలా బాగుందనటంకన్నా ఆ గేయంలోని మాటలలోనే "సౌదామిని ఠసోన్మాదినిగాను మధురహోవారినానికిగా సాక్ష

తృ-రించిందనటం సత్యానికి సన్నిహితంగా ఉంటుంది.

వి రంగరావు,
వరంగల్.

"వలపు కలిపిన ముల్లు'' అత్యంతాద్భుతముగా వుంది

టి. మల్లేశ్వరరావు,
తాటికొండ.

నేను చదివే పత్రికల్లో 'యువ' కు ఒక ముఖ్యస్థానం వుంది.

స్వరూప్. సి,
పూనా.

'సృష్టిస్థితి లయాలు' అన్న చిత్రం యువ మొత్తానికి మెరుగులు దిద్దింది.

వి శేఖర్,
హైదరాబాద్

మీ 'యువ' పాఠకులను రంజింప జేస్తూ వుంది. రచనలు సులభ శైలిలో వుండి చదువరులకు ఉల్లాసం కలిగించు చున్నవి.

కాళీభట్ల శ్రీనివాసమూర్తి,
కోటపాతూరు.

అబద్ధమెందుకు చెప్పాలి? కొనే స్థితిలో లేకపోయినా ప్రతినెలా యువ చదివి ఆనందిస్తున్నాను

మ హేశ్వర్,
మచిలీపట్టణం.

మీపత్రిక మూల్యం రూపాయి పెట్టి అయినా లేఖల శీర్షికను ఇంకా రెండుపేజీలు పొడిగించండి బాబూ.

భానుశ్రీ,
తాడేపల్లిగూడెం

వరకు ఎగుమతి దిగుమతి వ్యాపారం మా కోస్తాలోనే జరగాలి, కాకినాడనో, బందరునో అభివృద్ధి పరచండి అని కేంద్ర ప్రభుత్వాన్ని గట్టిగా అడిగిన ఆంధ్ర నాయకుడులేడు ఎవరేనా అడిగినా, కేంద్ర ప్రభుత్వం ఖాతరు చెయ్యలేదు.

గత రెండు నెలల్లోనూ, మదరాసు రాష్ట్రంలో రైల్వే సదుపాయాల విషయంలో మూడు ముఖ్యసంఘటనలు జరిగినవి. ఒకటి, తాంబరం నుంచి విల్లుపురం వరకు ఎలక్ట్రిక్–ట్రెయినులను నడపడానికి ఏర్పాటు, రెండు, సేలంనుంచి బెంగుళూరుకు రైల్వేలేను ప్రత్యేకంగా వెయ్యడానికి శంఖుస్థాపన, మూడు, విరుధునగర్ నుంచి మనమదురైకు రైల్వేలైను వెయ్యడానికి శంఖుస్థాపన

ఈ ప్రదేశాలు ఎక్కడున్నాయో, వీటి ప్రాముఖ్యత ఏమిటో ఆంధ్రులలో లక్ష మందిలో ఒకరికి కూడా తెలుసునో, తెలియదో' కాని, వీటి ప్రాముఖ్యత ఇది. 1952 నుంచి 57 వరకు వున్న కేంద్ర మంత్రిమండలిలో డిప్యూటి రైల్వేమంత్రిగా వుండి, 1957 ఎన్నికలలో ఓడిపోయిన ఓ. వి అలగేశన్‌గారు కంచీపురం నియోజకవర్గం నుంచి యీ సారి పార్లమెంటుకు ఎన్నికలలో పోటీ చేస్తున్నారు. తాంబరం–విల్లుపురం ఎలక్ట్రిక్ ట్రెయిను సదుపాయం యీ నియోజకవర్గం వారికి పనికి వస్తుంది. శ్రీ అలగేశన్, తమిళనాడు కాంగ్రెసు అధ్యక్షుడు అంచేత, ఆయన ఎన్నికకు యీ సదుపాయం పనికివస్తుంది.

ప్రస్తుతం రైల్వేశాఖ డిప్యూటి మంత్రిగావున్న శ్రీ ఎస్. వి. రామస్వామి, సేలం నుంచి పార్లమెంటు ఎన్నికలలో అభ్యర్థిగా పోటీ చేస్తున్నారు అంచేత తన నియోజకవర్గ ప్రజలకు తాను ఏదైనా ఘనమైన సేవ చెయ్యాలి అదే, సేలం–బెంగుళూరు రైల్వేలైను

ఇక, విరుధునగర్–మనమదురై రైల్వేలైను ఇది, మదరాసు ముఖ్యమంత్రి శ్రీ కామరాజ నాడార్ ఎన్నికకు నిలబడ్డ సాత్తూర్ నియోజకవర్గానికి అవసరమైనది దానిని కాదనడానికి కేంద్ర ప్రభుత్వంలో ఎవరికి గుండెలు వున్నాయి'

ఇలా, పనులు జరిపించుకోడానికి ఆంధ్ర దేశంలో గుండెలు వున్న నాయకుడు ఏడీ ?

మనరాష్ట్ర శాసనసభకూ, పార్లమెంటుకూ ఎన్నికలు అయిపోయినవి గెలిచిన వారు గెలిచారు, ఓడినవారు పోయారు గెలిచినవారి కర్తవ్యం ఏమిటి?

కోస్తా వ్యాపారంలో ఆంధ్ర దేశపువంతు ఆంధ్రదేశానికి రావాలంటే, కాకినాడను గాని బందరును గాని పెద్దరేవుగా చెయ్యాలి రాష్ట్రపు దక్షిణాగ్రానవున్న నెల్లూరు, కర్నూలు, కడప, చిత్తూరు ప్రజలకు రాజధాని నగరంతో సంబంధం ఎక్కువగా ఏర్పడాలంటేనూ, యీ ప్రాంతాలు బాగా అభివృద్ధి చెందాలంటేనూ ఒంగోలు నుంచి నేరుగా హైదరాబాదుకు, చిత్తూరు, కడపల నుంచి ఒంగోలుకు రైలు మార్గాలు పడాలి. ఆదిలాబాద్ నుంచి కరీంనగర్ మీదుగా హైదరాబాద్‌కు నేరుగా రైలుమార్గం పడాలి ఇవి, మనరాష్ట్రానికి చాలా అవసరంగా కావలసిన సదుపాయాలు

ఈ సదుపాయాలను కలిగించడానికి వెంటనే ఏర్పాట్లు ప్రారంభించ వలసిందని కేంద్ర ప్రభుత్వాన్ని వత్తిడి పెట్టవలసిన బాధ్యత, కొత్తగా ఎన్నిక అయిన శాసన సభ్యులమీదా, పార్లమెంటు సభ్యులమీదా వున్నది. అయిదేళ్ళ కాలం ఇట్టే గడిచి పోతుంది కాని, యీ అయిదేళ్ళలోనూ, కొత్త మెంబర్లు రాష్ట్రానికి ఏదైనా సదుపాయాన్ని సాధించినట్లయితే వారిని ప్రజలు మరచిపోరు

ఈ అయిదేళ్ళలోనూ ప్రజల అవసరాలను మరిచిపోయిన మెంబర్లను, మళ్ళీ ఎన్నికలలో ప్రజలు మరిచి పోయినట్లయితే ప్రజలను నిందించ వలసిన అవసరం లేదు






రాజగోపాలాచారి కాంగ్రెస్ పరిపాలనను పర్మిట్ల, లైసెన్సుల రాజ్యం అన్నారు అందుకు ప్రధాని నెహ్రూ "నా దగ్గరకు వచ్చి ఎవ్వరూ వొక్క పర్మిట్ అయినా అడగలేదు." అని సమాధానం చెప్పారు దానికి రాజగోపాలాచారి, "నీ దగ్గరకు రావటం ఎందుకు? ఆ పనులుచేసి పంపటానికి నిన్ను పరివేష్టించివున్న మంత్రులూ, కాంగ్రెస్ నాయకులూ చాలరా?" అని ప్రశ్నించారు, అందుకు ప్రధాని నెహ్రూ, "పర్మిట్లూ, లైసెన్సులూ లేకుండా ఏ ప్రభుత్వం అయితేమాత్రం ఎలా నడుస్తుంది?" అన్నారు

కాని రాజగోపాలాచారి మాత్రం తన ప్రచారం మానుకోలేదు 'పర్మిట్ల లైసెన్సుల రాజ్యం నశించాలి' అని అంటూనే వున్నారు ప్రజలు వింటూనే వున్నారు.

రాజగోపాలాచారి వాదంలో కొంత సత్యం లేకపోలేదు అవుసరం అయినప్పుడు ప్రభుత్వం పర్మిట్లూ, లైసెన్సులూ ఇవ్వగూడదని కాదు ఆయన ఉద్దేశం, అలా ఇవ్వవలసిందే కాని పర్మిట్లనూ లైసెన్సులనూ తమ అధికారాన్ని బలపరచుకోటానికి వాడగూడదని ఆయన ఉద్దేశం

అధికారంలోవున్న కాంగ్రెస్ వాదులు అలా వాడటం లేదని నెహ్రూ అనగలరా? అలా అనటానికి, నెహ్రూకి సైతం చాలా సాహసం కావాలి

ఒక్కొక్క లైసెన్సూ, వొక్కొక్క పర్మిట్టూ ఇవ్వటానికి అధికారంలోవున్న వారు ఎన్ని విషయాలను దృష్టిలో వుంచుకొని ప్రవర్తిస్తున్నారో ప్రధాని నెహ్రూకి తెలియదా? తెలియదు అనుకోవటం ఆయనను అగౌరవపరచటం ఆయనకు తెలుసు తెలియబట్టే అసలు విషయం దాటవేసి, తన దగ్గరకు ఎవ్వరూ లైసెన్సులకోసం గానీ, పర్మిట్లకోసం గానీ రాలేదనీ, ప్రభుత్వానికి లైసెన్సులూ పర్మిట్లూ ఇవ్వక తప్పేది ఏముందనీ అనేసి వూరుకున్నారు

కాని రాజగోపాలాచారిమాత్రం ఆ మాట అంటూనే వున్నారు ప్రజలు వింటూనే వున్నారు ఆ మాట తమ మనస్సులోని ఏ అస్పష్ట భావాన్నో కదప గలిగినంత కాలం, ప్రజలు వింటూనే వుంటారు రాజగోపాలాచారి కాకపోతే మరొకరైనా ఆ మాట అంటూనే వుంటారు

ఈ మాటేకాదు, రాజగోపాలాచారి మరొక మంచిమాట కూడా అన్నారు – రాజగోపాలాచారి ప్రచారానికి కోపం వచ్చి, నెహ్రూ మద్రాసులో జరిగిన సభలో, "రాజగోపాలాచారి తనకు కావలసిందేమిటో స్పష్టంగా చెపితే బాగుండును," అన్నారు అందుకు ఆయన తనకు కావలసిన కొన్ని విషయాలు చెప్పారు చెప్పటంలో అతి స్పష్టంగా చెప్పారు అందులో ముఖ్యమైన విషయం, నేటి కాంగ్రెస్ రాజకీయాలకు దగ్గర్లోవున్న విషయం, ప్రజా జీవితానికి ఏ కాస్త సంబంధం వున్నవాళ్ళకయినా తెలిసిన విషయం, వొకటి చెప్పారు

"కాంగ్రెస్ ప్రజల మనస్సులలో భయోత్పాదాన్ని కలిగించింది ఆ భయాన్నుంచి ప్రజలకు విముక్తిని కలిగించటం నా ఆదర్శం," అన్నారు

ఇదికూడా ప్రజలకు మంచి మాటగానే వినిపించ గలదు ఎందుకంటే తెలిసో తెలియకో తమను అనుసరించని వాళ్ళ మనస్సులలో అధికారంలో వున్న కాంగ్రెస్‌వారు భయాన్ని సృష్టించిన మాటమాత్రం వాస్తవం

"వారితో ఏకీభవించకపోతే, వారు చెప్పినట్లు చెయ్యకపోతే, వూరుకుంటారా? బ్రతుకనిస్తారా?" అనేభయంతో కలతచెందని మనస్సులు ఇటీవల చాలా కొద్దిగానే వుంటున్నయి

అయినా అధికారులను తూచా తప్పకుండా అనుసరిస్తూ, తత్ఫలితాలను అనుభవిస్తున్న వారి శిష్యకోటివి

తమతో ఏకీభవించని పార్టీలమాటా, వ్యక్తులమాటా అటుంచి, తమలో తాము మురాలుగా చీలి వొకరినొకరు ఏవిధంగా సాధించు కుంటున్నారో, ఈనాడు ప్రతి వ్యక్తికీ తెలుసు. ఈ రంగం ఈ నాడుప్రతి గ్రామంలోనూ స్థాపించబడి,దానిమీద ఆడే విషాదాంత నాటకంలో పెద్దలు పాల్గొంటూనే వున్నారు ప్రజలు ప్రేక్షకులుగా వుండి గుసగుసలాడుతూనే వున్నారు వీలున్నప్పుడు ముసిముసి నవ్వులు నవ్వు కుంటూనే వున్నారు

కాంగ్రెస్ ప్రభుత్వం ప్రజల మనస్సుల్లో భయంసృష్టించినమాట వాస్తవం అది వాస్తవం అయినంత కాలం రాజగోపాలాచారి ఆ మాట అంటూనే వుంటారు ఆ మాట ప్రజలను ఆకర్షిస్తూనే వుంటుంది రాజగోపాలాచారి కాకపోతే మరొకరు ఈ మాట అంటారు ఉలిక్కిపడి ఏం ప్రయోజనం లేదు




పిల్లల సినిమా ఇది - ఒద్దు మొర్రో అంటే విన్నావా - అసలు శాల్తీతే పూర్తిగా కనబడి చావటంలేదే....

ఇవి కాంగ్రెస్‌మీద అభిమానంలేక వ్రాసిన మాటలు కావు కాంగ్రెస్‌మీద అభిమానం ఎక్కువగా వుండటమే కాక, అద్ది చిరకాలం వుండాలనే వుద్దేశంతో వ్రాసిన మాటలు

ప్రధాని నెహ్రూ మన దేశానికి అంత ర్జాతీయ రంగంలో ఎనలేని ప్రఖ్యాతిని తెచ్చిపెట్టారు అనేక అభ్యుదయ కార్య క్రమాలద్వారా దేశాభ్యున్నతికి నిరంతర కృషి చేస్తున్నారు అందరూ సుఖపడే ఆర్థిక విధానంకోసం ప్రజలను ఉత్తేజ పరచి ముందుకు నడుపుతున్నారు

అందువల్ల ఈ ఎలెక్షన్లలో కాంగ్రెసు గెలవాలని అందరం కోరుకోవలసిందే తిరిగి మన ప్రియతమ నాయకుడైన నెహ్రూ ప్రధాని కావలసిందే అయితే కాంగ్రెస్ సంస్థకూ, అధికారంలోవున్న వ్యక్తులకూ సంబంధించిన అనేక విష యాలు, ఈసారి ఆయన జ్ఞాపకం వుంచు కోవలసివుంది అధికారంలోకి వచ్చిన ప్రతి కాంగ్రెస్‌వాదీ తనవంటివాడు కాదు అధికారం మానవుల మనః ప్రవృత్తిని ఇట్లే మార్చివేస్తుంది.

ఈసారికూడా ప్రధాని నెహ్రూయే ప్రధాని కావాలి ఎవరు కోరుకున్నా కోరుకోకపోయినా ఈసారికి ఆయనే ప్రధాని అవుతారు కూడాను అయితే నేను పైన ఉదహరించిన విషయాలు నెహ్రూకు జ్ఞాపకం చేస్తూ వుండ గలం దులకు ప్రతిభా వంతుడైన రాజాజీ తగిన బలంతో ప్రత్యర్థిగా వుండాలి అలా వున్న ప్పుడే కాంగ్రెస్‌సంస్థ మనుష్యుల్లో ప్రబ లిన మలినాన్ని ప్రక్షాళనచేసి ఆరోగ్య వంతంగా నడిచి తన విధ్యుక్త ధర్మాన్ని నెరవేర్చుకో గలుగుతుంది

★

# వేమన పద్యాలు



పలుచ పలుచ పట్టుబట్ట కట్టెను రాజు
మరియు సన్నబట్ట మంత్రి కట్టె
బట్ట తీసివైచె బంట్రోతు తోచక
విశ్వదాభిరామ వినుర వేమ !

పద్యం : కృష్ణశాస్త్రి చిత్రం : బుజ్జాయి



చూపులో చూపు



# రాధికాస్వామి

(గతసంచిక తరువాయి)

'లేదు, లేదు అలా అనుకోకండి నాకీ ప్రపంచంలో ఎక్కడైనా బాగుంటుందంటే అది ఇక్కడే అని నిశ్చయంగా చెప్పగలను' మీరు నాకు పరమమిత్రులు. కాని..' అతి ఆప్యాయంగా మాట్లాడబోయాడు అయితే అంతకంతకూ కంఠం ఎవరో అదిమి పట్టుకున్నట్లుగా పూడుకుపోతోంది

'నాన్నా! టీ తీసుకో!' అంది రాధ గంభీరంగా

ప్రతిమాదేవి

తనకూ టీ కలిపి చాలా మెల్లగా' తీసుకోండి' అంది కప్పు ముందుపెడుతూ

ఆమె ఈ నిర్హేతుక గాంభీర్యాని కర్ధమేమిటో ఊహించలేని రావు రాధవేపు చూచి మాట్లాడకుండా టీ తాగటం మొదలుపెట్టాడు.

కప్పు కిందపెడుతూ 'నువ్వు వెళ్ళటం నా కిష్టంలేదు గోపాల్ ! రాధకీ అంతే నీ యిష్టం తర్వాత !' అన్నాడు రావు

టీ తాగి రాధ వెళ్ళిపోతోంది దుఃఖం తీగెలు సాగుతోంది తన కంఠంలో కాని రావు ధోరణి మామూలే !

'చూడు' నువ్వు వెళ్తానంటే రాధ కెంత కోపం వచ్చిందో !' అంటున్నాడాయనే !'

*   *   *



రావుగా రింట్లోంచి ఒక ఫ్రెండ్ రూమ్‌లోకి మారాడు తను రూమ్ దొరికిందని రావుతో అబద్ధం చెప్పాడు

కాని ఏదో బాధగానే ఉంది తనకు తానై తెచ్చిపెట్టుకున్న ఆ పరిస్థితిలో, రాధ మౌనం తన కవమానంగా తోచింది అసలే ఆమెనలా అర్థించటం నేరమేమో అనే బాధతో క్రుంగిపోతున్నాడేమో, ఆమె తన కే విధమైన సమాధానమూ ఇవ్వకపోవటంతో ఇంకా నేరస్థుడిలా బాధపడిపోయాడు తను ఏంచేయాలో, ఆమెతో ఇంకేమనాలో — ఏమీ అనకుండానే ఊరుకోవాలో ఏదీ తోచని సందిగ్ధావస్థలో కటకటలాడిపోయాడు అక్కడ ఇంక ఉండలేననుకున్నాడు కాని ఇక్కడ కూడా ఉండలేక పోతున్నాడు తనకు రాధ కావాలి. ఎలా వస్తుంది ? ఏవిధంగా ఆమెను గెలుచుకుంటాడు ? ఆమె మౌనాని కేమని అర్థం చెప్పుకుంటాడు ? ఇప్పటికీ తనకు తెలియకుండా, అజ్ఞాతంగా ఉండిపోయిన మహా విషయాలలో స్త్రీ హృదయ మొకటి

ఆ నిండుతనంలో, ఆ నిర్మలత్వంలో, ఆ తేట నవ్వుల్లో, రాధలో స్త్రీ సహజమైన లజ్జాభరత్వం కూడా ఇమిడి ఉంటుందని తనకేం తెలుసు? స్త్రీ హృదయ పరిజ్ఞానానికై మనసు కే భావపరిపోషణ నిచ్చాడు కనుక స్త్రీ నైజం తనకు వంటబట్టిందనుకుంటాడు ?

రూమ్ దొరికిందని చెప్పినప్పు డామె విశాల నేత్రాంచలాల నిలచిన బాష్ప సందోహం తనకు పిలుపుగా గ్రహించలేక పోయాడు . అసలు రాధ తన కంటబడితేనా ఆ తర్వాత ?

కాని క్రమంగా తను మారిపోయాడు రాధాదేవి దివ్య సౌందర్యం తనలోని వాంఛలను మేల్కొల్పింది. అది ఆమె ప్రయత్నపూర్వకంగా చేసిన పని కాదు. ఆమె సౌందర్యాన్ని అప్పటి తన హృదయం గ్రహించిన తీరు అది అస లిటువంటి విషయాలలో ఆమె మనసెటువంటిదో తనకు తెలియదు కాని 'సిద్ధార్థుడి వంటి భర్త లభించటం సామాన్యమా ?' అని రాధ చెబుతూ ఉంటే ఆమె హృదయం తన కవగతమైందనుకున్నాడు తను ఆమెకు సిద్ధార్థుడు కాకపోవచ్చు. కాని ఆమె తనకు యశోధర ! అయితే యశోధర సిద్ధార్థుడికి చివరకు లభించింది ! తనకు మొదట వచ్చి మాయమైపోయింది ! !

రాధ మీది ప్రేమ భగ్నమైపోయింది. తన హృదయం ఉద్వేగభరిత మౌతోంది తనకు తోడుకావాలి తోడనుకున్న రాధ దూరమైపోయింది రావుగారింటికి వెళ్లటమంటే ఏదో నేరంచేసినట్లుగా బాధపడుతున్నాడు తను. అక్కడికి వెళ్లలేదు. ప్రేమ నాపుకోలేదు

ఈ మానసి కావస్థలో తను ఎన్నెన్ని ప్రణయ చిత్రాలు గీసాడు ? రూపం

లోనూ, ప్రవర్తనలోనూ కూడా పిచ్చి వాడిలా తయారయ్యాడు

తన ప్రేమ స్నేహితుడికి పరిహాస పాత్రంగా కనిపించింది అతను అడుగడుగునా తనను ఆటలు పట్టించేవాడు తన బాధ మఱింత దుర్భరమయిననాడు కూర్చుని ఏదో వేదాంతం చెప్పేవాడు

'ఒక్క భంగపాటు భరించలేని నువ్వు జీవితం ఎలా గడుపుతావు గోపాల్ ? ధైర్యంగా ఉండాలోయ్ ' రాధ కాకపోతే మరొకరు ' లోకం గొడ్డుపోయిందా ?' అనేవాడు

పైగా తన తత్వాన్ని ఆశావాదం అనేవాడు 'అందినంత వరకూ ఆనందాన్ని జూరుకోవడమే పరమార్థం గతించిన వాటికి విచారించే అవకాశం లేదోయ్ ! కాలం వేగంగా గతిస్తోంది. కాలుడి కరాళదంష్ట్రిలు భయంకరంగా మనల్ని గ్రహించబోతున్నాయి బతికినన్నాళ్ళూ సుఖపడదాం లేనిదానికి విచారమెందుకు ? ఆనందో బ్రహ్మ అన్నారోయ్ !' అనేవాడు

అది తనకు ప్రేమ అంకురించిన ప్రధమ దశ రాధను స్త్రీ కంటే అధికంగా పరిగణించలేకపోయేవా డప్పుడు అలాంటి మానసికావ్యవస్థలో సుఖానికి స్నేహితుడి నిర్వచనం తనపై అధిక ప్రభావాన్ని ముద్రించింది తనలో భౌతిక సుఖవిషయికమైన తర్కం బయలుదేరింది



"షీలాదేవీ ! మీరు త్వరగా టైప్‌రైటరు తీసుకొని ప్రక్క గదిలోకి పోండి. నా భార్య నన్ను చూట్టానికి వస్తున్నది."

'తరుణము మించిపోయిన వృథాయయిపోవు నిరీక్ష యెల్ల' తనకూ తరుణం మించి పోతే తారుణ్యపు సౌఖ్యాలు గగనకుసుమాలై పోతాయి త్వరపడాలి అందని రాధకోసం ఎందుకీ ఆవేదన ?

తను రావుగారింటికి వెళ్లటం మానేసాడు. రావు రెండు మూడుసార్లు ఫోను చేసాడు రమ్మని తను ఎప్పటికప్పుడు వెళ్దామనుకుంటూనే వెళ్లలేకపోయాడు.

'వెళ్లవోయ్ ' తన స్వామికి స్వాగతం చెబుతుంది రాధ ! ఆడవాళ్లంతా మొదట్లో అలాగే ఉంటార్లే ' కొంచెం సాధనచేస్తే దారికివస్తారు ! వెళ్ళి హాయిగా సాగినన్నాళ్ళు ప్రణయం సాగించు సరసం విరసమవుతే చల్లగా అక్కడి నుంచి జారుకో ! అంతే ' సుఖపడటమూ చేత కావాలోయ్ స్వామీ ' రాధికాస్వామీ '' అన్నాడు స్నేహితుడు

అత నెప్పుడూ తనను పరిహాసానికి అలాగే పిల్చేవాడు అతనెంత పరిహా

సంగా తన వేదాంతమంతా నూరిపోసినా ఎందుకో రాధని గురించి అతనలా మాట్లాడుతూ ఉంటే వినలేకపోయేడు తను అతని మాటలు తననేరాన్ని అధికం చేస్తున్నట్లు బాధపడి అసలే రాధ ఎదుట పడలేక పోయాడు అందుకే మళ్ళీ రావు గారింటికి వెళ్ళలేదు తను.

## 6

'ఆనందో బ్రహ్మ'' అన్నదానికి స్నేహితుడిచ్చిన విపరీతపు వ్యాఖ్యానాన్ని తానెంత చీదరించుకుంటున్నాననుకున్నాడో—అంతగా దాని ప్రభావానికి లొంగిపోయాడు అప్పటినుంచీ తను మారిపోయాడు తనలో శక్తులు విజృంభించాయి విశృంఖలవృత్తి నవలంబించాడు

కళాత్మక దృష్టి కాత్మ నిగ్రహంతోడైనప్పుడు కళ ఉద్బోధకమూ, జ్ఞాన సాధకమూ అవుతుంది కాని కళాభిజ్ఞతకు వ్యాలోలత సిద్ధించినప్పుడు విశృంఖల వృత్తిలో కాని కళాకారుడు జీవించలేడు! అప్పుడతని కళ అవుతే నిలచి ఉంటుంది కాని, వ్యక్తి మరణిస్తాడు కళ, కళాకారుడూ కూడా అజరామరంగా వెలగాలంటే, అభిజ్ఞతా, ఆత్మ నిగ్రహమూ రెండూ తోడుకావాలి!

కాని, వ్యక్తిగతంగా తను పూర్తిగా దిగజారిపోయాడు కళాపరంగా ఉన్నతుడయాడు పాతికేళ్ళ వరకూ తన జీవితం లౌకిక వాసన లెరుగని అతి అమాయకమైన బాల్యత్వంలో నడిచింది అయినా ఏ పూర్వపుణ్య ప్రాభవమో తన హృదయంలో స్వచ్ఛంద కళాంకురం మొలకలెత్తించింది ఇంచుమించు పాతికేళ్ళవఱకూ లోకమంటే ఏమిటో, శరీరావసరాలంటే ఏమిటో ఎరుగకుండా బ్రతికాడు తను

కాని రాధ తన కళాత్మక హృదయ పుటాలను వెనక్కి నెట్టి అట్టడుగున మసలుతున్న ప్రేమను పురికొల్పింది కాని దానికి కట్టలు నిర్మించలేక పోయింది అందుకే తన ప్రేమ అనుభవంతో కాని తృప్తి చెందని సామాన్య స్థితికి వచ్చేసింది

రాధకు ముందు తన కనుభవం లేదు రాధతో ప్రేమ కలిగింది కాని అనుభవం మాత్రం కలగలేదు అందుకే ఆమెను పోగొట్టుకున్నాడు తను! హృదంతర్గత ప్రేమోద్వేగాన్ని సహజంగా, అంత సులభంగా స్త్రీలు బహిర్గతం చేయలేరన్న విషయం తనకేం తెలుసు? తను వెళ్ళి పోతానంటే వ్యగ్రభావంతో కూర్చున్న రాధకు, అది తన అసభ్య ప్రవర్తనకు కోపమనుకున్నాడు కాని, తను వెళ్ళటాని కనంగీకారమని తెలుసుకోలేక పోయాడు

ఏమైనప్పటికీ తను మారిపోయాడు కేవలం ఆకస్మికంగా తనలో మేల్కొన్న

వాంఛలు ఆపరాని మాధుర్యంతో తనను కట్టివేసాయి సామాన్య దృష్టిలో సుఖమంటే ఏమిటో, ఆనందమంటే ఏదో— అవన్నీ రెండుచేతులా ఆస్వాదించాడు

తనను గురించి లోకం పరిపరి విధాల అనుకునేది

'గొప్ప చిత్రకారుడనే కాని ఒర్రి పాడుమనిషి '

'బొమ్మలు మాత్రం అద్భుతంగా, సామాన్యులుకూడా చిత్రలేఖనమంటే ఆసక్తి చూపేటంత గొప్పగా గీస్తాడు ఏం లాభం?'

'అతన్నిగురించి మన కనవసరమే ననుకోండి మనిషి మంచివాడు కాదంటారు '

'స్త్రీ లేనిచోట అతను మర్యాదస్తుడు'

—ఇవీ తనను గురించి ప్రజల అభిప్రాయాలు తనుమాత్రం వాళ్ళమాటలెన్నెప్పుడూ చెవి సోకనీయలేదు వామనమూర్తి ఈ విషయమై బుద్ధులు గరపుతూ ఎన్నో ఉత్తరాలు రాసాడు కూడా కాని తనకు లక్ష్యంలేదు

ఈ పర్ణకుటీరం, ఈ జీవితం ప్రారంభించకమునుపు తన చిత్రాలుచూసి తనను వ్యక్తిగతంగా కలుసుకోవాలని ఒక లేడీ స్టూడెంటు అన్నను అడిగిందిట కాని అతను ఒప్పుకోలేదు ఆగలేక ఆ అమ్మాయి తనకు ఫోన్ చేసింది

'మీ చిత్రాలు చూస్తుంటే మన ఆంధ్రులలో ఇటువంటి చిత్రకారు



"మీకు తెలియదు అదిసరిగా ఫిట్ అయింది"

డున్నాడుకదా అని చాలా గర్వంగా ఉంటుంది '' అన్నది.

తను నవ్వాడు, ఫోన్‌లోనే

'మిమ్మల్ని పర్సనల్‌గా మీట్ అవాలనుకున్నాను కాని మా అన్నయ్య ఒప్పుకోలేదు మీ వ్యక్తిగత జీవిత మంత మంచిదికాదుట ''

ధన్యోస్మి' మనసులో బాధ సూటిగా బయటపెట్టింది ''

'నేను మిమ్మల్నేమీ చేయనులెండి' అన్నాడు నవ్వుతూ

ఆ పిల్లకూడా నవ్వేసింది ఎవ్వరో ఏమీ దాచుకోలేని ఒర్రి బోళాపిల్లలా ఉంది''

అరగంటసేపు తనని గురించి ఏమిటో ప్రశంసించి పారేసిందామె అంత ఓపిగ్గా విన్నాడు తను

ఫోను పెట్టేముందు 'నేను మంచివాడ్నని మీకైనా అనిపించటంలేదా?' అని అడిగాడు పరిహాసానికే

'నాకా? నా కనిపిస్తోంది కళాకారులు విశృంఖలంగా సంచరించినా, ఎప్పటికైనా వాళ్ళు సత్యం రియలైజ్ చేయ

గలుగుతారనే నా దృఢవిశ్వాసం అందు వల్ల ఉత్తమ కళాకారుల లోపాలు నాకు కళంకా లనిపించవు '' అంది

ఎంత బాగా చెప్పింది! ఎం బి చదువు తోందిట బాగా పైకి వస్తుందనుకున్నాడు తను

కాని తన ప్రస్తుత పరిస్థితినిబట్టిచూస్తే ఆమె చెప్పింది నిజమే ననిపిస్తోంది ఎప్పటికైనా రియలైజేషన్ రావాలి తప్పదు కళాకారులకే కాదు, ఎవరికైనా అంతే''!

## 7

రాధతో పరిచయం కాలంతో పాటు విస్మృతి చెందుతోంది తను ఎంత విశృంఖలంగా తిరుగుతున్నా, చిత్రలేఖ నాసక్తి మాత్రం చచ్చిపోలేదు అది ఒక్కటే తనలో ఈ మాత్ర మైనా ఔన్నత్యం కలిగించింది. లేకపోతే తనెందుకూ కొరగానివాడై పోయేవాడు

అఖిలభారత చిత్రకళా ప్రదర్శనలో తన చిత్రాలకు ప్రథమ బహుమతి వచ్చింది. ఐదారేళ్ళ తర్వాత కొందఱు కళాకారులతో పాటు పారిస్ వెళ్లటం తటస్థించింది అక్కడ కూడా తన చిత్రాలెంతో ప్రశంసించబడ్డాయి తర్వాత కలకత్తాలో కొన్నాళ్ళు ఉద్యోగం చేసి, అక్కడి నుంచి మెద్రాస్ ఆర్ట్ స్కూల్ ప్రిన్సిపాల్‌గా వచ్చేసాడు మొత్తం మీద తనంటే ఎరుగని వాళ్లు లేరు దేశంలో! తన కళకు రాజుల ప్రాపకం సైతం లభించింది

కీర్తికాంత కలకలంలో రాధ చాలా వరకు విస్మృతిలో పడిపోయింది కాని అప్పుడప్పుడు స్నేహితుడు పరిహాసానికి పిల్చే 'రాధికాస్వామి' పేరు తలపుకి వచ్చి, తన హృదయం రాధచుట్టూ పరిభ్రమించి, ఆ ఆలోచనలతో పరితప్తం కావటం మాత్రం తప్పటం లేదు 'రాధికాస్వామి' అనే ఆ పేరుని గురించి తనపై ప్రజలలో వివిధ ప్రచారా లున్నాయి కూడాను ''

తను అప్పుడు మెద్రాస్‌లో ఉంటు న్నాడు

'నా దీవన ఫలించి పైకి వచ్చావు ' అత్తయ్యా, మామయ్యా పోయినా వారి పేరు నిలబెట్టావు. రక్తస్పర్శగల బంధు వులం మమ్మల్ని మరచిపోకు ఒకసారి వచ్చి చూసి వెళ్ళు' అని రాసిందొకసారి అత్తకూతురు సీత అయిదుగురు పిల్లల తల్లి ''

సీత ఉత్తరం చూడగానే చిన్ననాటి పల్లె జీవితమంతా కళ్లకు కట్టినట్లయింది

'ఈ ఉచ్ఛస్థితిలో 'ఒక్కసారి ఆ గ్రామీణ ప్రాంతాలకు వెళ్తే బాగుం టుంది' అనుకున్నాడు

అనుకోవటమే తడవుగా బయలు దేరాడు

— వేగంగా పోతుంది కారు చెట్లూ, పుట్టలూ ఒకదాని తర్వాత మరొకటి

త్వరత్వరగా వెనక్కి మరలిపోతున్నాయి. కారు చప్పుడు మాత్రం విడవకుండా వినిపిస్తోంది తను బయటికి చూస్తూ కూర్చున్నాడు . . ..

ఈ చెట్లూ, పుట్టలూ వెనక్కి మరలి పోతున్నట్లే తన జీవితంలో సంవత్సరాలు దొర్లిపోయినాయి కాని ఈ నీలాకాశం లాగానే అంతర్యంలో ఏదో ఆవేదన ఇన్నాళ్ళనుంచీ తనను వెన్నాడుతూనే ఉంది స్నేహితుడు చెప్పిన సుఖం నిజంగా సుఖమవుతే, దాని ననుభవించే తను ఎందుకు శాంతి పొందలేక పోతు న్నాడు ? దీనిని మించిన సుఖ మేదో ఉందని ఇప్పుడిప్పుడే తోస్తోంది తనకు ! !

దీర్ఘంగా నిట్టూర్చాడు తను ఎం బి స్టూడెంటు అన్నట్లు రియలైజేషన్ రాక తప్పదేమో ' !

దేశంలో కావలసినంత కీర్తి సంపా దించుకున్నాడు చిత్రలేఖనంలో గొప్ప ప్రతిభగలవాడని పేరు పొందాడు ధనానికి తనకు లోపంలేదు కాని ఏదో అసంతృప్తి అంకురిస్తూనే ఉంది మధ్య మధ్య దాని నెప్పుడూ తీవ్రం కానీయలేదు తను ఇంకా ఈ కీర్తీ, హోదాలమీద మమత వదల్లేదు......

తన పూర్వపు చిత్రాలు, ప్రస్తుత చిత్రాలతో పోల్చిచూస్తే మొదటి వాటిలో హృదయ స్వచ్ఛందత్వం స్పష్టంగా తోస్తుంది. రెండవ వాటిలో ఏదో ఆడంబ



"నువ్వు మాయింట్లో కాలు పెట్టినదగ్గర నుంచి శాంతి నెలకొల్ప బడింది అప్పుడే వెళ్లి పోతానంటావేరా ! నాలుగు రోజులుంటే నీతోపాటు కమ్మగా తిందామనుకొంటున్నా !"

రత్వం గోచరమవుతూ ఉంటుంది. అది తన హృదయంలోనే ఉండి అలా భావింప చేస్తోందేమో మరి ! !

ఏమైనా తను పూర్వపు 'గోపి'కాదు. పచ్చిక బయళ్ళలో, మాగాణీ చేలల్లో నిర్భయంగా, స్వేచ్ఛగా సంచరిస్తూ పల్లె జీవితపు అమాయకత్వ మంతా పుణికి పుచ్చుకున్న ఆనాటి హృదయం కాదు తనది. తనను చూసీ చూడగానే సీత ఆ మాట అనక మానదు ..

'మారిపోయావురా గోపీ ! ఎదిగిన కొద్దీ మనుషు లింతేలే !' అంటుంది తప్పకుండా

నవ్వుకున్నాడు. ఏమన్నా పడాలి. తప్పదు ! !

తన నెవరైనా ప్రత్యక్షంగా కాక పోయినా, పరోక్షంగా తన వ్యక్తిగత జీవితాన్ని గురించి ప్రస్తావిస్తూ 'కవులూ, కళా కారులూ, సంఘ సంస్కర్తలూ,

వేదాంతులూ ఒకరి కాదర్శంగా లేకపోతే, ఆ వృత్తుల్లోనూ, సిద్ధాంతాల్లోనూ ఇతరులకు విశ్వాసమే నశిస్తుంది. అలాంటప్పుడు వాళ్లు మరింత హీనులు కావటాని కవకాశ ముంది।' అంటే తను ఒక్క నవ్వు నవ్వేవాడు

'అనుభవించే భోగీ, అనుభవించని జోగీ నా దృష్టిలో ఒకటే। అనుభవించే వాడి కెప్పుడూ 'నాది' 'నేను' అని అనుభవించాలని ఉండదు ఇక అనుభవించని వాడిసంగతి సరేసరి!' అనేవాడు

'ఇంకేం అవుతే? 'నాది' 'నేను' అనుకోని మీ అనుభవాల్ని ఇతరులకివ్వాలనా మీ ఉద్దేశం?' అనే వాళ్లు ఎగతాళిగా

'నా అంతట నే నాదేశించను కాని, నే నింకొకరి కాదర్శం కావటం నాకు ఇష్టమే। ఈ ప్రపంచంలో ఎవరికి వాళ్లే నింకొకరి ననుసరించాలని ఉండదు చెప్పండి? చెప్పులు కుట్టేవాడు ఆ వృత్తిలో ఇంకొకడికి గురువౌతాడు।'

తనకు వాళ్ళు సమాధానం చెప్పలేక పోయేవాళ్ళు నిరుత్తరులైనా, తనవాదం అంగీకరించలేక అవస్థపడేవాళ్ళని చూసి తను నవ్వేవాడు

'మనిషి తా నింకొకరి కాదర్శం అవుతున్నానని కాని, కొందరి జీవితాల్ని తను నడిపించగలడని కాని అనుకోవటం నిజంగా వెర్రితనం ఎవరికోసం ఎవరూ హీనులుకారు ఎవరికోసం వాళ్లే ఉద్ధరింపబడతారు ఎవరి టైమ్ వచ్చినప్పుడు వాళ్లకది తప్పక సిద్ధిస్తుంది।' అనేవాడు తను మళ్ళీ

ధర్మాధర్మ విచక్షణ లేని తన జీవితం వారికి నచ్చదంటే అది నిజంగా సహేతుకమే। కాదని తనెప్పుడూ అనడు కాకపోతే వాదనకోసం కొంత మొండితనాన్ని అవలంబించేవాడు సంఘ నియతిని పాటించటం తనకు మొదటినుంచీ అలవడిన విద్యకాదు అందుకే తన వాదం సమాధానపరచలేని దైనప్పటికీ, అంగీకరించ తగినదిగానూ ఉండేదికాదు

కాని అనాదినుంచీ మానవ హృదయాలలో అసాధారణత్వంమీద అంతులేని భయమూ, సంకోచమూను। ఎక్కడైనా ఒక చోట సామాన్యత్వానికి అతీతంగానో, విరుద్ధంగానో ఒక భావం ఉత్పన్నమైనప్పుడు దానిని పరిపోషించటానికంటే, అణగదొక్కాలని ప్రయత్నిస్తారు మానవులు సామాన్యత్వంలో తపనలేనట్లే, అభివృద్ధీ లేదు కొత్త ఉద్యమంవల్లా, కొత్త ప్రయత్నాలవల్ల ఫలం ఆశించటమంటే అందని ఆకాశాలకు అర్రులు చాచటంగా ఉంటుంది చాలా మందికి అంతేకాదు, మానవులు తమ జీవితాలకూ, కుటుంబాలకూ, ధన ధాన్య సంపత్తికీ, తన అనుకున్న ఏ ఒక్క దానికి వైరుధ్యంకాని, అననుకూలత్వం కాని జరగనంత వరకు ఎన్ని మాటలైనా చెపుతారు. కాని వాళ్ళు చేప్పే ఆ మహా

శయాల కోసం తమ జీవితంలో ఏ ఒక్క దాన్ని త్యాగం చేయవలసివచ్చినా, ఆశయాలు ఒదిలి, జీవితాన్ని కావిలించు కుంటారు. 'బతికినన్నాళ్ళు ఇలా బతికితే చాలులే.' అనుకునే సంతృప్తి ఆత్మౌన్నత్యానికి ఎన్నడూ ఆస్కారం కాలేదు కాని, అది సంఘ శ్రేయస్సుకి ఎంతో ఉపకరిస్తుంది అయితే ఈ విధమైన సంతృప్తి కావాలంటే రాదు పోవాలంటే పోదు అది జన్మతః సిద్ధించేది మాత్రమే.

కాని తనలో సాంఘికమైన, వ్యక్తిగతమైన ఏ కట్టడికీ పట్టుబడని అతీతమైన, స్వచ్ఛందమైన మంచితనం, – మంచితన మనలేడు కూడాను దానిని, – ఔన్నత్యం ఎంత ఉన్నా, సంఘానికి తను పనికిరానివాడే అయినాడు అందుకే ఆశ్చర్యం వేస్తుంది తనకు బహిరంగమైన దుర్మార్గం సంఘం సహించదు తనది దుర్మార్గమైనా కాకపోయినా, సంఘపు నియమాలకు తను కట్టుబడలేదు కనుక, తను చేసేది దుర్మార్గంగానే నిర్ణయింపబడింది అదే తను పైకి శ్రీరంగ నీతులు చెబుతూ, లోలోపల ఎన్ని పాపపు పనులు తవ్వుకున్నా తన శ్రేయస్సుకీ, అస్తిత్వానికీ భంగం లేదుకనుక సంఘం తనని మన్నించి ఉండేదేమో! ఏమో! అసలీ చాటు మాటు వ్యవహారాల వల్లనే మానవులంతా నటులూ, ప్రపంచం ఒక నాటక రంగం కావటం తటస్థించిం దను కుంటాడు తను!




"ప్రొద్దున్ననగా వండిన అన్నం - ఎప్పుడో చల్లారిందండి ఇంకెందుకు విసనకర్ర!"
"ఎందుకేవిటి కళా! ఈ పాసిన వాటిపై ముసిరే యీగల్ని విసరు కోడానికి!!"

అయితే మానవులు తమకు విరుద్ధమైన, ఉన్నతమైన భావాన్ని ప్రారంభంలో ఎంత నాశనం చేయటానికి ప్రయత్నిస్తారో అంతంలో అది ఫలితానికివచ్చే సరికి అంతగానూ అభినందిస్తారు

ఇది మానవ నైజం అటువంటి మానవుల మధ్య తను జీవిస్తున్నాడు. తన చిత్రాలను మెచ్చుకుంటారు కాని, తనంటే భయం చాలామందికి మర్యాదస్తులు తనకి దూరంగా ఉండాలంటారు, ఒకవేపు తన కళ నభినందిస్తూనే. తనకు వాళ్ళ మాటలవల్ల బాధ కలిగినా, తనలోని రెండు గుణాలను తగిన విధంగా వాళ్ళు సత్కరిస్తున్నా రనుకునేవాడు అప్పుడు మాత్రం వాళ్ళ తీర్పులో కొంత న్యాయమే గోచరించేది తనకు. నిజానికి తనలో వ్యక్తిపరంగా ఫలితానికి వచ్చే దేముంది కనుక? అందుకే తనంటే కంటకం సంఘానికి.

సన్నగా తుప్పర ప్రారంభమైంది మబ్బుపట్టిన ఆకాశం ఏదో మాంద్యాన్ని, మనోవ్యాకులతను కలిగిస్తున్నది ..

ఆలోచిస్తున్నా డతను. పది పన్నెం డేళ్ళ తర్వాత అతనిలో ఒక విధమైన వైరాగ్యభావం ఉత్పన్న మైంది తను పోయాక తన చిత్రాలను గురించి చెప్పు కున్నంత గొప్పగా తనను గురించి చెబు తారా? కళాకారుడు నందగోపాల్ మిగులు తాడుకాని, వ్యక్తి నందగోపాల్ పంచ భూతాలకే నన్నమాట '

—వర్షం అధికమైంది జల్లు కొట్ట కుండా గాజుతలుపు లెత్తేసాడు

ఈ వర్షాకాలం అంటే తన కెందుకో చెప్పలేని ఆనందం అన్ని ఋతువులూ కొనితెచ్చేపాటిఆనందం నిజానికి వర్ష ఋతువు తనకివ్వనేలేదు ఐనా ఎందుకో అదంటే తనకు ప్రాణం అది తన హృదయంలో ఏనాడో అనుభూతమై అణగిపోయిన మధురబాధను, అన్వేషణా వేదనను, ఆ ఆవేదనలోగల సుఖశాంతిని అప్పుడప్పుడు తలపుకితెస్తూ ఉంటుంది అందుకేనేమో వర్షాకాల మంటే తనకంత ఇష్టం ! !

— రోడ్డు సరిగా లేదు మధ్యమధ్య కారుకుదుపులకు విసుక్కుంటూ మూలగా ఒదిగి కూర్చున్నాడు తను

ఏవో ఆలోచనలు మనసు నాక్రమి స్తూనే ఉన్నాయి అంతకంతకూ తన జీవితం ఎంత విచిత్రంగా పరిణమిం చింది ? పాతికేళ్ళవరకూ తను జీవించిన లోకం,'ఈ లోకానికి పిక్చర్ కాపీ'' అనాడు తను వెలుగు కెంత సమీపస్థుడో - క్రమ క్రమంగాదానికి తనెంత దూరమయ్యాడో- నేడు పూర్తిగా దానిని కనుచూపులోనైనా కనలేని స్థితి కెలా వచ్చాడో - అదంతా తనకే తెలుసు ఆనాటి తన మానసికా వస్థనూ, మధుర ప్రశాంతినీ నిర్వచించ లేడు తను ''

కాని ఈనాడు ? ప్రప్రధమంగా రాధని స్త్రీగా కాక, కళాత్మక శక్తిగా తాను గుర్తించి ఉంటే తనింతగా పతనమయ్యే వాడుకాదు అంతేకాదు అటువంటిస్థితిలో ఆమెను తప్పక తాను పొందగలిగేవాడు కాని రాధలోని స్త్రీ తనలో వాంఛలు రేపింది ఆ ఉద్ధృతస్థితి నడగించటానికిక తనకే శక్తి చాలలేదు రాధపై ప్రేమ వాంఛావిషయికం కానట్లవుతే, అది తన ఊహా జగద్విచ్ఛిన్న హేతువు కాక, సుస్థిర స్థాపనకు సహాయభూత మయేది తన జీవితం వ్యక్తిగతంగానూ మహో న్నత మయేది రాధ తన సంస్కారంతో, సౌందర్యంతో తన కళ్ళు విప్పింది కాని తన ఆలోచనలు ఆ సౌందర్యాన్ని మించి అధికంగా పోకుండా తను జాగ్రత్త వహించి ఉంటే బాగుండేది కాని - అదే జరగలేదు......

నాటికీ, నేటికీ తనలోని మార్పు తరచి చూసుకుంటూఉంటే హృదయ మేదో అలసటతో, నిర్వేదంతో నిట్టూరు

స్తోంది ఇప్పుడేకాదు ఈవిధమైనఆవేదన ఈ పన్నెండేళ్ళల్లో తన కప్పుడప్పుడు కలుగుతూనేఉంది అలాంటప్పుడు రాధ తలపుకివస్తూనే ఉంది కాని ఎంత సేపు? అంతస్సునే అణచిపెట్టి విశృంఖలంగా సంచరించిననాడు, రాధ విషయంలో తనను తాను వంచించుకోవటంలో ఆశ్చర్య మేముంది?

అప్రయత్నంగా నిట్టూర్పు వెలువ డింది తనలోంచి

హఠాత్తుగా కారాగిపోతుంది

తన ఆలోచనలు కట్టుబడ్డాయి

'ఏమిటి డ్రైవర్?'

'బురదలో చక్రాలుకూరుకుపోయాయి సార్!'

ఈ వర్షాకాలంలో కారుమీద ప్రయా ణం కావటం తనదే తప్పనిపించింది అందులో ఈ చాయలకు తను వచ్చి ఎన్నే ళ్ళైందో? అప్పటికంటే ఇప్పుడు రోడ్డు కాస్త బాగుపడిఉండదా అనుకున్నాడు ఏమీలేదు అప్పుడూ, ఇప్పుడూకూడా ఒక్కటే తీరుగా, గుంటలు, మెట్టలుగా ఉంది ఏమీ ఏదీ మారినట్లు లేదు ఒక్క తనే—తన జీవితమే!

నవ్వొచ్చిందీ సాదృశ్యానికి తనెంత పతనం చెందినా ఈరోడ్డంత అధ్వాన్నంగా మాత్రం లేదు

'రా డ్రైవర్! తప్పేదేముంది? ఇద్దరం పైకి లాగుదాం రా!' అన్నాడు



"డబ్బు లేదుకాబట్టే పెద్దమనిషిలాగా క్రింద కూచున్నాను జాగ్రత్త. వొంటిమీద చెయ్యివేశావంటే!"

కాని విఫల ప్రయత్నమైపోయింది. చక్రాలు లాగినకొద్దీ కూరుకుపోతు న్నాయి

చీకటి పడుతోంది. సన్నగా తుప్పర ప్రారంభమైంది మళ్ళీ

నిస్సహాయంగా ఇద్దరూ దిక్కులు చూస్తూ నుంచున్నారు ఎవరో మనిషి ఎదురుగుండా వస్తుంటే అతన్ని పిలిచి మళ్ళీ ప్రయత్నం చేశారు. లాభం లేక పోయింది

'ఊళ్ళోకి వెళ్ళి మనుషుల్ని పిలుద్దాం బాబూ' అన్నాడు రైతు

'ఊరెంత దూరముంటుంది?'

'ఎంతో దూరమెక్కడ బాబూ! ఇక్కడే! నాలుగడుగులేస్తే వచ్చేస్తుంది!'

కారు పైకి లాగినా ఆ రాత్రికింక ఎలాగూ ప్రయాణంచేయటం అసాధ్య మనుకున్నాడు తను ముందు ముందు రోడ్డింతకంటే అధ్వాన్నంగా ఉండవచ్చు

వానలో, ఈ బురదలో మళ్ళీ ఎక్కడైనా ఇలా అయితే యాతన !!

'మీ ఊళ్ళో ఈ రాత్రికి బసచెయ్యటానికి వీలుంటుందా ?'

'అయ్యో ! ఎందుకుండదు బాబూ ! మీబోటి పట్నం బాబే ఉన్నాడు ధర్మ రాజు !' అన్నాడు రైతు

డ్రైవర్‌తో ఊళ్ళోకెళ్ళి మనుషుల్ని పంపిస్తానని చెప్పి రైతుతో బయలు దేరాడు తను

ఇంకా సన్నగా తుప్పర పడుతూనే ఉంది బురదలో కాళ్ళీడ్చుకుంటూ ఎలాగో ఊళ్ళోకి ప్రవేశించా రిద్దరూ

రైతు తనకు కొంచెం ముందు నడుస్తున్నాడు బురదతో తను పడుతున్నంత అవస్థ రైతు పడటం లేదు హాయిగా నడిచి వెళ్తున్నాడు జీవితాన్ని, విధిని ఎదురొడ్డి నిలవటం ఎలాగైనా గ్రామీణులకే తెలుసు తమకంటే !!

వీధుల్లో దీపాలు గుడ్డిగా వెలుగుతున్నాయి

'మన దే ఊరు బాబూ!' అని అడుగుతున్నాడు రైతు

మబ్బుపట్టిన ఆకాశమూ, వెలుగు లేని వీధులూ చూస్తున్నాడు తను ! సన్నగా తుప్పర! ఆ వర్షాయామినిలో, విజనమైన ఆ వీధులుగడచి వెళుతూఉంటే ఏదో బాధ కెలికింది హృదయాన్ని ప్రకృతంతా లౌకిక వాసనలతో ముసురుకున్న తన ఆత్మకు ప్రతిరూపంగా, కళావిహీనంగా తన ఎదుట నిలచినట్లయింది ఆ వానరాత్రి!! తన జీవితం ఎంత తారుమారైంది? ఏదో పోగొట్టుకున్నాడు తను అది మళ్ళీ దొరుకుతుందన్న ఆశలేదు తనకు! అసలా పోగొట్టుకున్న దేదో తెలిస్తేనేగా దానిని తిరిగి సంపాదించుకోవటానికి !!

'ఇల్లింకా ఎంత దూర ముంది ?' అనడిగాడు రైతుని

'ఇదిగో ! ఇదే బాబూ !'

ఇంచుమించు ఊరి పొలిమేరలకు వచ్చేశారు పంటలూ, పైర్లూ రోడ్డు ప్రక్క మూగగా 'మేమే మీ పోషకులం' భూమాత ప్రతినిధులం !' అని చాటి చెబుతున్నాయి. తను మెల్లిగా కాళ్ళీడ్చుకుంటూ నడుస్తున్నాడు ఏదో ఆవేదన, ఆత్మపడే ఆవేదన హృదంతరాళాల్లో సన్నగా, తీయగా, బాధగా మెలిపెడుతోంది తన ఆత్మకు పురిటి నొప్పులు స్ఫురిస్తున్నాయి

— ఆకాశంలో మెరుపు మెరిసింది

'అదే బాబూ ఇల్లు !' అన్నాడు రైతు వేలితో చూపిస్తూ

ఊరిబయట, పొలాల మధ్య చక్కని బంగళా చూశాడు తను ఎంతో సంతోషం వేసింది ఇటువంటి పల్లెటూళ్ళోకూడా ఇంత చక్కని బంగళా !! ఇల్లు చూస్తేనే కడుపు నిండినట్లనిపించింది !

బంగళా సమీపించారు లోపల పెట్రోమాక్సు దీపాలు వెలుగుతున్నాయి

'బాబూ '' అని పిలిచాడు రైతు లోపలివారి నుద్దేశించి

'ఎవరూ ?' అంటూ ఒక వ్యక్తి బయటికి వచ్చాడు

తను నిర్ఘాంతపోయి నుంచున్నాడక్కడే ! ఇది నిజమా ? ఇదేమిటి ?

రావుగారు తన ఎదుట !

'అరె ! రావుగారా ? ఇదేమిటి ? చాలా తమాషాగా ఉందే '' అంటూ ఒక్క అంగలో వెళ్ళి ఆయన ఎదుట నిలబడ్డాడు తను

'ఎవరూ ? అరె ! గోపాల్ ! ఇదేమిటోయ్ ! రా ! రా ! లోపలికి రా ! కూర్చో '' ఆశ్చర్యానందాలతో గుక్క తిప్పుకోలేకపోయాడు రావు

రైతు తమ యిద్దరివైపూ ఏమిటో అర్థంగాని అయోమయపు చూపును చూస్తున్నాడు రావూ, తనూ హడావుడిగా ఏదో మాట్లాడుకుంటున్నారు

'బాబూ నేను మనుషుల్ని పిల్చుకెళ్ళి కారు తీసుకొస్తానయ్యా!' అన్నాడు రైతు

'ఆఁ ఆఁ 'ఆ సంగతే మర్చిపోయాను మనుషుల్ని కూలికి మాట్లాడుకు వెళ్ళలేకపోతే ఇంతరాత్రివేళ రారేమో? ఊఁ ఇంద ఇవాళ నువ్వు నాకు చేసిన సహాయం చాల గొప్పదోయ్!' అంటూ ఐదు రూపాయలనోటు అతని చేతిలో పెట్టాడు.

'ఎబ్బెబ్బే! ఎందుకుబాబూ!' అంటూనే రైతు దానిని తీసుకుని సంతోషంగా వెళ్ళిపోయాడు




"ఏమయ్యా! నాకిప్పుడు డబ్బు చాల అవసరంగా ఉంది నా గడ్డాన్ని చాల రోజులనుండి పెంచుతున్నా దీనిని తీసుకొని సరిపడే డబ్బివ్వు."

---

'ఏమిటి ?' కారేమిటి ? కూలీ ఏమిటి ? ఏమిటోయ్ గోపాల్ ? ఎక్కడినుంచి ఎక్కడికి వెళ్తున్నావ్ ?' అని అడిగాడు రావు.

తను జరిగిందంతా చెప్పాడు.

హఠాత్తుగా రావు 'గోపాల్ వచ్చాడు రాధా!' అన్నాడు గుమ్మంవేపు చూసి

పిడుగుపాటుకి నిద్రితవ్యక్తిలా ఒక్కసారిగా ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూశాడు తననోరు కట్టుబడింది. తన గుండెలాగిపోయాయి గుమ్మంలో. రాధ!

గోధుమరంగు జరీచీరె కట్టుకుని, చక్కని బొట్టు పచ్చని ముఖాన మెరుస్తూ ఉండే దీపపు వెలుతుర్లో దేవతలా గంభీరంగా నిలబడి ఉంది

తన ఆలోచన లాగిపోయాయి. మనసు స్తబ్దమైపోయింది స్త్రీలనే ఎరుగడా తను? రాధముందు ఇదేమిటి ?

'ఎప్పుడు వచ్చారు?'—మబ్బు మధ్యన మెరుపులా చిన్న నవ్వుతో, సన్నగా పలకరించింది

ఆ ప్రశ్నతో ఈ లోకంలోకి వచ్చి పడ్డాడు తను

బలవంతాన నవ్వుతెచ్చుకుని 'ఇప్పుడే వచ్చాను. బావున్నారా?' అని అడిగాడు

'ఏం బాగుండటమోయ్? రాధ మారి పోయింది...' అంటున్నాడు రావు

తను ఆమెవేపు చూశాడు. ఆమె గబగబా చూపులు మరల్చుకున్నది

'మీరిక్కడ ఉన్నారేమిటి?' అని అడిగాడు తను.

'ఇది మా స్వగ్రామమోయ్! రిటైరై ఇక్కడికి చేరాం. అసలిక్కడికి రావటం రాధ పట్టుదలే! పల్లెటూరు ప్రశాంతంగా ఉంటుంది పోదాం పదమని ఒకటే గోల' లేకపోతే నేను మెడ్రాస్‌లోనే సెటిల్ అయేవాణ్ణి'

శాంతి కావాలా? ఏం? ఆమెకు లేదా? అనిపించింది తనకు ఆమెవేపు చూసాడు మళ్ళీ.

'పదండి. మీరు స్నానం చేస్తే...' అంటోందామె.

'ఏం గోపాల్? మా యింటి నుంచి వెళ్లాక మమ్మల్ని పూర్తిగా మరచి పోయావు. నీ రూమ్ అడ్రెసివ్వలేదు పైగా నువ్వు మా యింటికి రాలేదు. పైగా ఫోన్‌చేసినా వస్తానని రాకపోవటం నేర్చుకున్నావు! ఊఁ. ఇదన్నమాట స్నేహం?' అంటున్నాడు రావు

తను రాధ వేపు చూస్తున్నాడు

చూపులు తట్టుకోలేక కిందికి చూస్తూ కూర్చుంది రాధ నిస్సహాయంగా

'పారిస్ వెళ్లావుట కదూ? నువ్వు పారిస్ వెళ్ళటం పేపర్లో చూసి రాధ '

'మీ రిక్కడి కెలా వచ్చారు?' అని అడిగిందామె

తను చెప్పాడు.

'నువ్వు పారిస్ వెళ్ళినపుడు రాధ రావుకి విశేషాలూరికే ఊరిపోతున్నాయి.

'బలేవాడివి నాన్నా! ఆయన ఇంటి దగ్గర ఎప్పుడు బయలుదేరారో? స్నానం చేసి, భోజనం చెయ్యనివ్వకుండా ఏమిటి చెప్పు ఈ కబుర్లు?'—మృదువుగా మందలించింది తండ్రిని

తను ఆమె ఆంతర్యం గుర్తించాడు ఆమెనుగురించి ఒక్కమాటకూడా తనకు తెలియటం ఇష్టంలేనట్లుంది రాధకు 'రాధ' అని రావు చెబుతున్నప్పుడల్లా అడ్డుతగుల్తోంది.

'పదండి మీరు స్నానం చేద్దురు గాని...'

'అవునోయ్' పద! పద'' అన్నాడు రావు కర్తవ్యం స్ఫురించినవాడిలా

స్నానంచేసి, భోజనంచేసి విశ్రాంతిగా కూర్చునేలోగా కారు తీసుకుని డ్రైవర్ వచ్చాడు. డ్రైవర్‌కూడా భోజనంచేసాక,

అందరికీ పక్కలువేయించి తనగదిలోకి వెళ్ళిపోయింది రాధ

* * *

రాత్రి చాలా పొద్దుపోయేవరకూ రావుతో కబుర్లు చెబుతూ కూర్చున్నాడు తను. మాటల సందర్భంలో రావు విషాదంగా అన్నాడు —

'రాధ ఏమిటో పూర్తిగా మారిపోయింది గోపాల్! నా బలవంతాన M. A. చదివింది. ఆట్టే మాట్లాడదు. మనసులో మాట చెప్పదు' అంటూనే చప్పున నిగ్రహించుకుని సంభాషణ మార్చేసాడు.

తనహృదయాన్ని చెయ్యిపెట్టి కెలికినట్లయింది. ఆ మాట చెప్పిన తరువాత రావుతో సంభాషణ అంతా చెవిటివాడి ముందు శంఖం ఊదిన చందమే అయింది

......ఇల్లు నిద్రిస్తోంది ప్రాణికోటి నిద్రిస్తోంది. కీచురాళ్ళ మోతా, అప్పుడప్పుడు పక్షులరెక్కలల్లార్పులూ తప్ప మరే శబ్దమూ వినిపించటంలేదు ఆ ఒక్క రాత్రిలోనే తాను లోకానికి వెలిగా, కంటికి కునుకూ, మనసుకి శాంతీలేక జన్మ జన్మాలనుంచీ బాధితుడిలా యమయాతన ననుభవిస్తూ గడిపాడు మానసికంగా ఎందుకు? ఏమో ! ఈ అవ్యక్తావేదనకు తాను అర్థం చెప్పుకోలేదు తనకేదో కావాలి. రాధకూ, తనకూ ఏదో అవినాభావ సంబంధం ఉంది ఆంతరంగికంగా. అందుకే ఆమెను గురించి రావు చెప్పిన ఆ ఒక్కమాటా తననింత కదిల్చివేస్తోంది

రాధ మారిపోయిందా? అవును అని తనకే అనిపిస్తోంది కాని రావు ఊహించిన విధంగా మాత్రంకాదు విషాదంతో, వైఫల్యంతో, చివికిపోయిన గుండెలతో నిరాశగా బ్రతకటంలేదామె అది కేవలం బాహ్యదృష్టికి కనిపించే విధం మాత్రమే ' కాని ఆమెలో ఇప్పుడు ఎవరూ సామాన్యంగా గుర్తించలేని అంతర్ముఖత్వం గోచరమౌతోందితనకు. ఇంతకు మునుపు ఆమె సేవించవలసిన శక్తి ! ఇప్పుడనుగ్రహించగల దేవత ' !

ఇన్నేళ్లు ఈ విధంగా సుఖంకోసం, శాంతికోసం వెర్రి మొర్రి మార్గాల వెంట పడి పరుగు లెత్తినా, పతనం తప్ప తనకేమీ అంతు చిక్కలేదు ఆ మధ్యనే సత్యమని నమ్మించుకుని ఆనందంగా కాలం గడిపాడు కాని అంతస్సూత్రంగా తనను వెన్నాడి వచ్చిన ఆవేదననూ, అశాంతినీ మాత్రం ఆమూలాగ్రంగా అణచివేయలేకపోయాడు. ఆశ్చర్యం ఏమిటంటే తన మనసీ స్థితిలో ఎప్పుడూ రాధను మధ్య ఉంచుకుని, ఆమె నావరించి పరితప్తమౌతోంది

రాధ తన కళ కాదర్శం ఏనాడు తన కళాజీవితానికి శంఖుస్థాపన జరిగిందో ఆనాటినుంచీ తన హృదయంలో నిక్షిప్తమై ఉన్న సౌందర్యస్వరూపాని కొక వాస్తవికమైన రూపం దాల్చి, తన

హృదయాంతరాళ భావసందోహాన్ని తనలో మలచుకుని నిలిచిన వ్యక్తి రాధగా తాను గుర్తించాడు కాని కళాకారు డెప్పుడూ వాస్తవికమైన అనుభవాలను హృదయంతో అర్థం చేసుకోవటంలోనే వాటి సార్ధకత వెల్లివిరుస్తుంది. తను ఆ జాగ్రత వహించలేదు ఎప్పుడు రాధను తన మనసుతో విచారించ సాగాడో అప్పుడే భౌతికావసరా లతిప్రాముఖ్యం వహించి కూర్చున్నాయి తనలో. అందు వల్లనే రాధ తన కళ కాదర్శం అయినా ఆమెను పొందగలిగిన విధం మాత్రం విస్మరించాడు. ఆమె తనకు దూరమైంది! కాని రాధ తన కళాత్మకమైన హృద యాన్నే కనుక అధివసించిఉంటే తన కళ ఇంకా పరిపూర్ణస్థితి నందుకోగలిగేది తన కళలో ఆమె జీవించేది. కాని విధి వ్యత్యస్తమైంది. తానిప్పుడు గొప్ప కళా కారుడే కాని శాంతిలేదు తనకు. శాంతి కోసం తానింకో జీవితం ప్రారంభించాలి. తప్పదు. ఎం బి స్టూడెంటు అన్నట్లు రియలైజేషన్ రావాలి!

తా నవలంబించిన విశృంఖల వృత్తి తనలోని నూరేళ్ల ప్రతిభను సగానికి సగం మింగేసింది అందుకే మునుపటంత ప్రేరణ శక్తి, బొమ్మలు వేస్తేనే కాని బతకలేనన్నంత ఉద్వేగమూ కూడా లోపి స్తున్నాయి తనలో! తన కళాశక్తి చచ్చి పోతోంది. దానికి తగిన ఆత్మ పరిపోషణ లేక!!

రాధ తనదే అయిఉంటే కళకు శక్తి తోడై ఆజన్మాంతం తను కళాకారుడు గానే ఉండేవాడు కాని తనతో పాటు ఆమెనూ వంచించాడు. అందుకే తనింక ఎక్కువ కాలం కళలో జీవించ లేడు. తనలో కళాసామగ్రి తరిగిపోతోంది.

రాధ తనను బాధిస్తోంది కేవలం 'రాధ' అనే ఆ రెండక్షరాల స్ఫురణే తన స్థావరాన్నంతా సమూలంగా కదల్చి వేస్తోంది. తన అంతస్సు రాధ! లేక పోతే ఆమె వాడిపోతోంటే తనకెందు కింత బాధ??

ఆలోచనతో తల పగిలిపోతోంది.

వేడి నిట్టూర్పులు ముసురుకున్నాయి హృదయాన్ని! తా నిక నిలువలేక పోయాడు.

మెల్లిగా లేచాడు

'అది శరద్రాత్రి! శీతచంద్రాతపాంతరాళ
రమణీయ రజత తల్పంబు నందు
చల్లగా నిద్రవోవు ప్రేపల్లె వాడ —'

అలాంటి సమయంలో తను 'శాంతి దేవతాచరణలాక్ష రసారుణాంక లవలేశ ముల వెతుకాడు' కొనే నిమిత్తం బయలు దేరాడు.

చాలా మెల్లిగా రాధ గది దగ్గరకు వచ్చాడు. గదిలో బెడ్‌లాంప్ వెలుగు తోంది.

ధైర్యంగా లోపలికి వెళ్లాడు. హృద యాన్ని పాపవాంఛ సోకితే భయం!

రాధ విషయంలో ఇప్పుడు తన కా ఆలోచనలేదు భయ మెందుకు?

పక్కమీద రాధ కదిలింది నిద్రపోతున్నట్లు లేదు. తన నీడ చూసి కంగారుగా 'ఎవరు?' అంటూ లేచింది.

'నేను......' వణుకుతున్న కంఠంతో అన్నాడు.

గబగబా లేచి దీపం పెద్దది చేసింది తననుచూసి త్రాన్పడి అక్కడే నిలబడిపోయింది.



'ఎందుకు వచ్చారు?' అంది తేరుకుని.

'ఎందుకు?'—ఎంత నిర్దయ! ఏమంటాడు తను? ఎంకావాలో ఆమెకు తెలియదా? పూజించిన దేవతలూ, ప్రేమించిన స్త్రీలూ ఇలాగే పరీక్షిస్తారు కాబోలు!!

జన్మ జన్మగత బాధలన్నీ హృదయంలో వడులు సుడులై తిరుగుతున్నాయి. వేయి దుఃఖ స్రవంతులు కంఠంలో చెలగి రేగుతున్నాయి

రాధ ప్రశ్నకు సమాధానం లేకుండానే తనకళ్ళు ధారాపాతంగా వర్షించసాగాయి, తనకే ఆశ్చర్యంగా.

రాధ కళ్ళు అశ్రువులతో ఆ గుడ్డి వెలుతుర్లో అందంగా మెరిశాయి.

'ఎందుకు?' అంది దగ్గరకువచ్చి లాలనగా.

పెద్దగా రోదనధ్వని ఒకటి వెలువడింది తన కంఠంలోంచి! ఆమె గుండెల మీద తలవాల్చి పడ్డాడు

రాధ నిశ్చలంగా నుంచుంది. ఓదార్చటానికి ఎటువంటి ప్రయత్నమూ చేయ్యలేదు. తను ఏడవగలిగినంత సేపు ఏడవనిచ్చింది.

కాస్సేపటికి తేరుకున్నాడు దుఃఖంలోంచి! ఆమెవేపు జాలిగా చూసాడు

'పిచ్చివాడా! ఎందుకూ?' అని అడిగింది ప్రశాంత ప్రసన్నవదనంతో

ప్రేమ నిర్భరమైన ఆ లాలన తనకు మళ్ళీ దుఃఖం తెప్పించింది పక్షిపిల్ల వాడిలా తలచుకుని తలచుకుని కుమిలిపోయాడు

రాధముఖంలో ప్రసన్నత్వ మధికమవుతోంది

'వెళ్ళి పడుకోండి' అంది మృదువుగా

'రాధా' రాధా' నాతో..... '

ఆపైన ఆమె చెప్పనివ్వలేదు పూర్వంలా తొట్రుపడుతూ వెళ్ళిపోనూ లేదు ప్రశాంతంగా నవ్వింది

'ఏమిటి నీతో' పిచ్చిగోపీ' మనుషుల కోసం కాలం ఆగదు కాలంతోపాటు మానవు డభివృద్ధి చెందకపోతే జీవితమే వృధా! చూడు నీతోవచ్చి నేనేం చేయాలిప్పుడు? నీవే దిగజారిపోయావే! ఇక నన్నుద్ధరించగలవా?'

ఎంతసూటిగా అడిగింది! తన హృదయాన్నలుముకున్న పంకిలమంతా విదల్చి వేసేటంత తీవ్రంగా అడిగింది!

'నేను చెడిపోయాను రాధా! భౌతికంగానే! మానసికంగా కాదు!' అన్నాడు తను గాద్గదికంగా

రాధ విషాదంగా నవ్వింది

'పురుషులు చెడిపోరు గోపీ! దిగజారి పోతారు భౌతికమైన దోషాలు పురుషులకు మానసికమైన దుష్పరిణామాలకు దారితీస్తాయి స్త్రీలలోని ప్రేమోద్రిక్తత వారి పతనానికి హేతువు' పురుషులలోని అహంకారం వారి ఔన్నత్యానికి ఆటంకం!'

'కాని నువ్వులేకుండా నేనింక బతకలేను రాధా''—తను మళ్ళీ రాధ హృదయం కరగించివేసేట్లు దుఃఖించాడు

'పిచ్చిగోపీ' నా మనసుని కరిగించి నన్ను మళ్ళీ చలింప చేయకు! ఈ జీవితానికింక నీకు నేను కాలేను అదే! ఈ శరీర మిలాగే వాడిపోవాలి నీకు తెలియదు ఎప్పటికైనా, ఆనాడు నీ చిత్రంలో నీవన్నమాటల్ని నీవు నిలబెట్టుకోలేకపోయావు కాని, ఇప్పటికీ నీమాటలు నేనంటాను నేను నీకే గోపీ' కాని మన కలయికమాత్రం అసంభవం! మనసు ఎప్పుడూ నీకే''

తనేమీ మాట్లాడలేకపోయాడు. బాధతో బ్రద్దలవుతోంది హృదయం

'గోపీ' ఇలా ఎన్నిసార్లు కలవరించాను నీ కోసం! ఒక్కనాడైనా నీకు నేను తలపుకి వస్తే చాలునని పరితపించాను. నీవు వెళ్ళిపోయాక, మళ్ళీ ఏనాడు నీవు వచ్చి తలుపు కొడతావో, ఏనాడు నన్ను పిలుస్తావో నని ఎంత తహతహలాడుతూ ఎదురు చూశాను? కాని నా ఆశ నిరాశ అయింది ఈ జీవన మధుభాండం ఒక్కరికే! నీవు రాలేదు. నేను మిగిలా నొంటరిగా నీ రాకకై నిరీక్షిస్తూ! ఆ దీర్ఘ నిరీక్షణలోనే నే నొక మహార్థం గుర్తించగలిగాను. ఈనాడు నీ కోసం నిరీక్షించి నిరీక్షించి ఎప్పుడో మృత్యుగహ్వరంలోకి త్రోయ బడతాను. మరొక



"మీ అమ్మను తీసుకురావద్దని టెలిగ్రాం ఇచ్చానుగా!"
"ఆ కారణ మేమిటో తెలుసుకోడానికి అమ్మ వచ్చింది."

జన్మలోనూ ఇంతే కావచ్చు. పరంపరాగతమైన ఈ నిరీక్షణకి అంతం పరమార్థం ఒక్కటే! భగ్నమై రగిలే ఈ హృదయాన్నింకా భగ్నంచేయట మెందుకు? నేను నీ నిరీక్షణలో నుంచి ఒక మహాయాత్రను గమిస్తున్నాను ఈనాడు నా గోపీ నాకు లభించలేదనే బాధ లేదు!' అని ఆగింది రాధ.

తను ఉత్కంఠతతో వింటున్నాడు.

రాధ మళ్ళీ ప్రారంభించింది.

'కాని,—కాని ఆనాడు నీవు మరొకసారి నా అభిప్రాయం అడిగి ఉంటే నేను నీకే అయిపోయే దాన్ని గోపీ! కాని నీకు స్త్రీ హృదయం తెలియదు!'

'ఇప్పుడు తెలుసుకున్నాను......' అన్నా డాశగా.

నవ్వింది తల్లి పిల్లవాడి అమాయకత్వమూ, వ్యర్థపుటాశా చూసి నవ్వినట్లు.

'ఏం లాభం? నీవు లోకానికై, నేను

లోకం నుంచి విడిపడ్డాక! నేను నీ స్థితికి రాలేనప్పుడు నీవు నా స్థితికి రాలేవు! ఒకవేళ వచ్చినా, నేనప్పుడింకా ముందుకి పోగలనేమో? పోలేకపోయినా, అప్పుడు నీవే కోరవు నన్ను! అదే' ఈవిధంగా కోరవు!' కాని ఆనాడు స్త్రీ హృదయమెరుగని అనుభవ రహితమైన నీ వ్యక్తిత్వం నన్నెంత ఆకర్షించింది!' నీవు వెళ్ళిపోయాక నాఅంతట నేను నిన్నెందుకు దాచుకోలేకపోయానని ఏడ్చాను! ఏంలాభం?. ఈనాటి ప్రశాంత గంభీరమైన మానసిక స్థితి ఆనాడు నాకుండి ఉంటే అలాగే చేసేదాన్నేమో ప్చ్... అది గతం: ఎందుకు తలచుకుని??'

చంద్రుడు క్రమంగా కిందికి దిగబోతున్నాడు కిటికీ నానుకుని నుంచుని చెబుతోంది రాధ

'నువ్వూ మారిపోతావు గోపీ! లోక జీవిత సంగ్రామంలోపడి దానిని సుఖమని నీవెంత కావిలించుకున్నా, కాదనే అంతర్ఘోష నీలో ఉండనే ఉంది. అదే చెబుతాను గోపీ! అలౌకికానందంతో కాని సంతృప్తి చెందలేని మనసులెంత మభ్యపెట్టినా, అశాంతితో తరుమబడి చివరకెలాగూ ఆ ఆనందానికే అర్రులుచాచి తీరుతాయి...'

రాధమాటలు వింటున్న తనకు—తనలోని అవ్యక్తావేదనకు, ఇంతవరకూ తాను ఇదమిత్థం అని తేల్చుకోలేని బాధకు ఒకహేతువు లభించినట్లయుంది. తనకు అలౌకికానందం కావాలి...అదే తనకు కనిపించని వస్తువు! కనిపెట్టలేని వస్తువు!!

రాధ సామీప్యతలో, కేవలం ఒక్క క్షణకాలంలోనే, తన మనసులో ఏదో వింత పరిణామం కదులుతోంది.

తెల్లవార బోతోంది. కిటికీలోంచి బయటికి చూసి 'ఇంక వెళ్ళి పడుకోవూ?' అంది లాలన ఉట్టిపడే స్వరంతో.

మంత్ర రుద్ధ భుజంగంలా అక్కడి నుంచి వచ్చేసాడు. సంకల్ప వికల్ప శక్తులు కోల్పోయి గాఢంగా నిద్రకు పడ్డాడు. ఎంతసేపు అలా నిద్రపోయాడో కిటికీలోంచి చుర్రుమని ఎండ తాకేవరకూ ఒళ్లే తెలియలేదు.

* * *

జీవితంలో రాధను మళ్ళీ కలుస్తానని కాని, తను ఈ విధమైన జీవితం మళ్ళీ గడుపుతాడని కాని ఆశలేదు తనకు అయితే అదే సంఘటించింది,

రాధదగ్గర తను సరిగ్గా నాలుగు రోజులున్నాడు. ఈ నాలుగురోజుల్లోనూ నాలుగు జన్మలెత్తినా మారలేనంత గొప్పగా మారాడు తను. అందుకే క్షణమంత విలువైనది జీవితంలో!!

రాధ అన్నది —

'ప్రపంచానికి రెండు పక్షాలు ఒకటి లౌకికం రెండవది అలౌకికం. నువ్వూ నీ జీవిత ప్రారంభంలో అలౌకికంగానే ఉన్నావు! కాని ఏమీ ఎరుగని నిర్మో

హత్వ మదే విన్నాకర్షించే వస్తువులు ప్రపంచంలో ఉన్నాయనీ. వాటిని గురించి నువ్వు నిర్వికారంగా ఉన్నావనీ స్ఫురణలేదు నీ కప్పుడు. కాని నువ్వు మోహపడిపోయావు తర్వాత. అయితే నువెక్కడ ఉండేవాడివో అక్కడికే వచ్చావిప్పుడు. కాలం వృథా అయిందని పశ్చాత్తాపడుతున్నావా ? ఈ సత్యం తెలుసుకోవటానికే నే విన్నాళ్లు కలతపడి పోయా ననుకుంటున్నావా? నువ్వు కాలం వృథా చేయ లేదు. ఏమీ తెలియక అమాయకంగా ఉండటం అజ్ఞానం. అన్నీ తెలిసి గంభీరుడు కావటం ఔన్నత్యం. నువ్వది సాధిస్తావు. దిగులు పడకు గోపీ!' అంది తనకు ధైర్యం పురి గొల్పుతూ.

—సీతను చూపి మెద్రాస్ వచ్చేసాడు తను.

రోజులు గడుస్తున్నాయి. కాని తను పూర్వంలా లేడు. తనలో ఏదో మార్పు వస్తోంది.

'హఠాత్తుగా బాగుపడ్డాడు!' అన్నారు కొందరు

బాగుపడటమంటే వారి దృష్టిలో ఒక్కటే అర్థం!

'విచిత్ర వ్యక్తి! వేళావేళలు బుద్ధి స్థిరంలేదు!' అన్నారు ఆదరించుతాడని ఆశపెట్టుకు వచ్చిన స్త్రీలు.

మొత్తంమీద అందరూ తననించి దూరమౌతున్నారు.

ఒకనా చొక జమిందారు ఒకఫోటో రంగుల్లో అద్భుతంగా చిత్రిస్తే ఎంతైనా సరే ఇస్తానన్నాడు.

ఒప్పుకున్నాడు తను చిత్రం గీయ టానికి కూర్చున్నాడు కాని బుద్ధి పని చెయ్యలేదు గీత లస్పష్టంగా, వంకర టింకరగా వచ్చేస్తున్నాయి. ఇంతకు మునుపు బొమ్మలుగీస్తూ రాత్రులకు రాత్రులు జాగరణ చేసేవాడి కిప్పుడు ఊరికే కళ్ళు కూరుకుపోతున్నాయి నిట్టూర్చాడు తను. తన కళా ప్రాభవం తొలగిపోయే సమయ మాసన్న మైంది.

చెప్పిననాటికి చిత్రం అందించలేక పోయాడు తను జమిందారికి. ఆయన ఇంకొంచెం వ్యవధి ఇచ్చినా పూర్తిచేయ గలనన్న నమ్మకం కాని, చెయ్యాలన్న ఆసక్తికాని లేదు తనకు ఫోటో తీసు కుని జమిందారు వెళ్ళిపోయాడు.

తనకే కాదు —ప్రజలకు కూడా క్రమంగా తన చిత్రలేఖనంమీద ఆసక్తి తగ్గిపోతుంది! తను బొమ్మలు గియ్యలేక పోతున్నమాట నిజమే' కాని అలా ప్రజలలో తనగురించి ప్రచారం కావటం తనకెంత బాధగా ఉంది!'

అన్నిటికంటే, ఈ జనం మధ్య, ఈ కలకలంలో తను నిలవలేక పోతు న్నాడు. భరించలేని అశాంతి తననెక్క డికో తోసేస్తోంది తనింక ఈ ప్రపంచం మధ్య నిలవలే ననుకుంటున్నాడు.

ఆ సమయమూ ఆసన్నమైంది. ఒకానొక క్షణంలో తను ఇల్లూ, వాకిలీ, ప్రాణప్రదమైన చిత్రలేఖనమూ, అన్నీ ఒదిలేసి ఈ పర్ణకుటీరానికి వచ్చివాలాడు

*　　*　　*

మానవ జీవితంలో ఏనాటికైనా సత్యం సుస్పష్టం కాక తప్పదు ఆ తపన హృదయంలో చెలరేగక తప్పదు కాని, తను శక్తులుడిగిన వార్ధక్యంలో కాక, ఏమీ తెలియని అజ్ఞానంలోనుంచి, అన్నీ తెలిసి అనుభవించే ఉన్మాదంలోనుంచి ఉద్ధరింపబడి అలౌకిక జీవిత పథగామి అయినాడు. తన మనసింక చలించదు ఎక్కువకాలం వృథాకాకుండా తనలో త్వరలోనే వెలుగును పునః స్థాపన చేసింది రాధ

ఇప్పుడీ పచ్చని మైదానంలో నీలాకాశంవేపు దృష్టిసారించి, కొన్ని మైళ్ళ వరకూ తను మైదానమూ, ఆకాశమూ తప్ప మరేమీలేని ఆ చిన్న గోళంలో కూర్చుని ఆలోచిస్తూ ఉంటే, ఆ సౌందర్యంలో తన జీవితపు హాలాహలం, విశ్వ మానవకోటి ఆక్రందనలా హృదయానికి వినిపించి రసార్ద్రమై పోతుంది మనసు ! గత జీవిత స్మృతులు, తానుపొందిన వంచనలు, చేసిన దోషాలూ అన్నీ 'తలపుకివచ్చి మాధుర్యంతో, బాధతో, పశ్చాత్తాపంతో నిండిపోతుంది, హృదయం ! ఆర్ద్రాతిఆర్ద్రమైపోయిన గుండెలతో తానెన్ని కన్నీళ్ళు కార్చాడు??

'ఎదమెత్తనౌటకై
సొదగుందరా అంత
మదిగల అహమ్మెల్ల
వదలిపోవునురా'—

మానసికంగా తా నెంత బాధ అనుభవించా డింతవరకూ! తన దోషాలే తన బాధ! కాని అవి దోషాలు కావేమో! ఔన్నత్యశృంగారోహణా ప్రయత్నాల్లో కలిగే అనురోధాలు మాత్రమేనేమో ? ఏమైనా తన దోషాల కింతకు మునుపు ప్రపంచం బాధ్యమని ఆరోపించేవాడు ఇప్పుడు వాటి ప్రసక్తే తలపెట్టటంలేదు. ఇప్పుడు తనలో ద్వేషం అంతరించింది. ఏ సన్నివేశం చూసినా, ఎవరిని తలచుకున్నా కళ్ళుచెమర్చి, హృదయం ద్రవించేటంత ప్రేమ అంకురిస్తోంది తనలో!

ఈ మధుర బాధలో, వలపులో, రాధాదేవి దివ్య సౌందర్యం ఆకాశంలో—తన హృదయ ఫలకంలోలా, స్వచ్ఛంగా తోస్తుంది.

'రావోయి! ఈరేయి రాధికాస్వామీ!'

—ఆమె సన్నగా, తియ్యగా, హాయిగా పాడుతుంది'! ఆమె తన ప్రణయిని !!

'జీవితంపు నిరాశచే చిక్కిచిక్కి ప్రాణమే పోయినను' బాయలేని ఆమె తన ఆరాధ్యమూర్తి !'

రాధ ఎవరని ప్రశ్నించుకుంటే 'వెలుగు నీడలవైపు వేలు చూపించింది' హృదయం!!

రాధ తనలో ఇప్పుడు రెండువిధాల జీవిస్తోంది ఆమె తన చిత్రాలలో జీవించింది కాని యావజ్జీవమూ తనను చిత్రాలతో జీవించనీయలేదు ఉన్మత్తమైన మనోహయాన్ని పట్టితెచ్చి మార్గం తప్పించింది! ఇప్పుడు తన ఆధ్యాత్మిక జీవితంలో అడుగడుగునా రాధ-వెలుగు తోడు తనకు!

ఎటుతిరిగీ—నాటికీ నేటికీకూడా తన శక్తి రాధే అయింది!

'ఇంక నను పిలచేర! ఇంత తలచేర?
ఎంకికేగాక నాకిట ఊరా పేరా?'

—తన చిత్రాల కీర్తి రాధదే! తన ప్రస్తుతౌన్నత్యమూ రాధదే!!

తన హృదయంలో ఉత్పన్న మవుతున్న ఆధ్యాత్మిక భావ సందోహంలో రాధ రూపులు మారుతూ రాణిస్తోంది దివ్యరాజ్ఞిలా—

ఆమె తన ప్రణయిని! తోడునీడ! శక్తి, సంసేవిత!!

ఆమె స్త్రీమూర్తి!

రాధ!!

* * *

భౌతికమై సంచరించే మనసు సూక్ష్మంలో లీనమైంది సూక్ష్మం విశాలమై అంతటా ఆవరించి ఉంది మనసు సూక్ష్మంలో లీనమవుతోంది సూక్ష్మం విశాలమౌతోంది రాధ విశ్వమంతా ఆక్రమిస్తోంది.

హృదయమే విశ్వం! విశ్వమే హృదయం!!

జీవిత సార్థకత! అదే పరమార్థం!!

*'Beyond the realm of thought,*
*He is freed being already freed'* ★



# దేవుళ్ళ పాట్లు



"అహో! అగ్నిదేవ, వాయుదేవులు!!! ఇద్దరు మిత్రులూ ఏదో అస్త్రం తయారీలో ఉన్నట్లుందే?"

"ఔనౌను నారదా! ఆ మానవ మేధోద్దండపిండాలు మమ్మల్ని బానిసలను చేసుకొని నానా రభస తెస్తున్నారు. మరి సహించలేం! ఇది జంతు అస్త్రం; దీన్ని సూర్యుడికేసి పంపుతాం; సూర్య మండలం మీద ఇది ప్రేలుతుంది; తత్ఫలితంగా సూర్యకాంతిద్వారా దీని శక్తి వ్యాపిస్తుంది; జంతు కల్పం ప్రారంభమౌతుంది. అంటే మానవులంతా జంతువు లౌతారు; జంతువులకుండే బుద్ధివిశేషం కంటే ఎక్కువ మేధస్సు ఎవ్వరికీ ఉండకుండా జేయుటయే మా సత్సంకల్పం. కలహ భోజనా! ఇక నీపని నీవు చూసుకోవచ్చు!"

# నిత్య విజయాలకు నిజసోపానాలు

"నువ్వు చేసిన పొరపాట్లనుంచి గుణ పాఠాలు నేర్చుకుని లాభించు" అనేది అనూచానంగా వస్తున్న ఉద్బోధ ఈ బోధను పెడచెవిబెట్టినప్పుడే మనకు విజయావకాశాలు అపారంగా లభిస్తాయి జరిగిన తప్పిదాలను తడుముకునే బదులు— గతంలో నీవు సాధించిన విజయాలను, అందుకు తోడ్పడిన నీ వ్యక్తిగత లక్షణాలను, శక్తులను కూలంకషంగా పరిశీలించుకో. వాటి పునాదులమీదనే నీవు భవిష్యద్విజయ సౌధాలను నిర్మించుకో గలవు.

20 సంవత్సరాలనుంచి "ఉద్యోగ సలహాదారు''గా పనిచేస్తూ, 40,000 మంది స్త్రీ పురుషుల జీవితాలను పరిశీలించిన నా అనుభవం ఈ సత్యాన్ని నిరూపించింది.

అసలు—"విజయం'' అంటే ఏమిటి? ఒకానొక పనిని చేస్తున్నప్పుడు నీకు ఆనందానుభూతి కలుగుతుంది, గర్వం తలెత్తుతుంది, నీ భావనలు ఉత్తేజితం అవుతాయి. నీ వెంతో ఎదిగి నట్లుంటుంది అదే పనిని పదేపదే చెయ్యడం నీ కిష్టం—నిజానికి, ఎన్ని ఎక్కువసార్లు చేస్తే అంత బాగుంటుంది. ఈ కుతూహలానుభూతు లన్నీ కలిసి "విజయం'' రూపొందుతుంది.

అట్టి విజయాలను నువ్వు ఏ వయసులో వుండగా సాధించావనేది గాని, అవి ఇతరుల దృష్టిలో అంతగా గణనీయం కాలేదనేదిగాని ముఖ్యంకాదు. క్లిష్ట పద సముచ్ఛయాన్ని సులభంగా, స్పష్టంగా ఉచ్చరించినందుకు నిన్ను తోటి విద్యార్థులు అభినందించి యుండవచ్చు. రకరకాల పక్షులగూళ్ళనుంచి రంగు రంగుల గుడ్లను సేకరిస్తున్నందుకు తలిదండ్రులు నిన్ను దండించి యుండవచ్చు ఏ సందర్భంలోనైనా ఇతరులు ఏమనుకున్నారనేది ముఖ్యం కాదు, నీవు సాధించిన వాటిపై నీకుగల అభిప్రాయం ఏమిటనేదే ముఖ్యం. దాన్నే లెక్కలోకి తీసుకోవాలి

* * *

నాకు తెలిసిన ఒకాయన (ఆయన పేరు ఆల్బర్ట్ అనుకుందాం) తన 43 వ యేట నా దగ్గరకు వచ్చాడు. అప్పటికి పదేళ్ళనుంచి ఒక కిరాణాకొట్టులో సరుకు లందించేవాడుగా పని చేస్తున్నాననీ, ఎదుగూ బొదుగూలేక ఎటు జూచినా నిరర్థకతే కనుపిస్తున్నదనీ చెప్పాడు. "ఈ

బెర్నార్డ్ హాల్డేన్

వయసులో మరో రకం ఉద్యోగానికి మారి, విద్యాలయాలనుంచి కొత్తగా వచ్చి ఉద్యోగాల్లో చేరుతున్న యువజనులతో పోటీపడటం మేలా?'' అని అడిగాడు.

నేను సలహా యిచ్చేముందు–ఆయనకు ఏపనిచేయడం ఎక్కువ ఇష్టమో చెప్పమన్నాను ఆల్బర్ట్ ఆగి ఆగి, నట్లు నట్లుగా తన విశేషాలు చెప్పాడు చిన్నతనంలో – అతి క్లిష్టంగా నిర్మించబడిన ఒక తుపాకీని ఏభాగానికి ఆభాగం విడదీసి, శుభ్రంచేసి, మళ్ళీ యధాతధంగా చక్కగా అమర్చాడట పదేళ్ళ వయసులోనే తండ్రిగారి లోహాల కార్ఖానాలో ఎక్కువ కష్టించి పనిచేస్తూ తలిదండ్రుల మన్నన లందుకున్నాడట అప్పటినుంచీ లోహ పరికరాలు సృష్టించే పనిని అభిమాన వ్యాపకంగా పెట్టుకున్నాడట తనయింటి నేల మాళిగలో ఒక కార్ఖానాను అమర్చుకుని, తీరిక వేళల్లో ఎలా కొత్త కొత్త పనులు చేస్తున్నదీ వివరిస్తున్నప్పుడు–ఆల్బర్ట్ మరొక మనిషైనట్లు, సముత్సాహంతో కళ్ళు వెలుగుతున్నట్లు కనిపించాడు

"ఇంటికి వెళ్ళి, ఆలోచించుకుని మీరు సాధించగలిగిన విశేషాంశాలన్నీ వ్రాసుకురండి'' అని ఆల్బర్ట్‌ను పంపివేశాను. ఆయన వారంరోజుల్లో మరో పది విషయాలను గురించి ఒక పట్టీ వ్రాసుకువచ్చాడు

ఆల్బర్ట్ గత యుద్ధంలో పాల్గొన్నాడు. ఉత్తరాఫ్రికానుంచి జర్మనీ వరకు–అతని దళాన్ని శత్రు విమానాలు వెంబడించి శతఘ్నుల వర్షం కురిపించాయి. ఒకసారి ఆల్బర్ట్‌వున్న టేంక్ గుళ్ళు తగిలి బదా బదలై ఆగిపోయింది పైనుంచి శత్రువిమానాలు గురిచూచి అగ్నివర్షం కురిపిస్తూనే వున్నాయి అతడు అప్పటికప్పుడు ఒక ముఖ్య యాంత్రిక భాగాన్ని తయారుచేసి, తమ టేంక్‌ను బాగుచేసి సురక్షితంగా నడిపించాడు

ఇటీవలనే తాను పనిచేస్తున్న కిరాణా కొట్టులో ఎప్పుడు ఏ సరుకు ఎంత నిల్వ వున్నదో తెలియజేసే ఒక లఘు యంత్రాన్ని తయారుచేసి నిర్వహిస్తున్నాడు "దాందేముందిలే అదేమంత చెప్పదగ్గది కాదులే" అన్నాడు

కాని–ఆల్బర్ట్‌కుగల కౌశల్యాలు ఎన్ని నిరూపయోగంగా వుండిపోయాయి?! ముఖ్యంగా యంత్ర నిర్మాణ కౌశల్యం ప్రతిదీ సమర్ధవంతంగా నిర్వహించాలనే పట్టుదల వున్నాయిగదా!

''మీరు ఈ రెండు విశిష్ట లక్షణాలనూ సమ్మేళనం చేసుకోవాలని ఎన్నడూ అనుకోలేదా? యంత్రాల నుత్పత్తిచేసే కర్మాగారంలో – ఏ యంత్రాలకు వాటి విడిభాగాలు, తగు పరిణామంలో, తగు తరుణంలో సిద్ధంగా వుంటేనే అమర్చేపని సక్రమంగా కొనసాగుతుందనే సిద్ధాంతం

ఎరుగరా? 'ఉత్పత్తులను సమన్వయం' అనే పదాన్ని వినలేదా?" అని ఆయన్ను ప్రశ్నించాను

ఇప్పుడు ఆల్బర్ట్ ఒక యాంత్రిక పరికరాల కర్మాగారంలో రెట్టింపు జీతం మీద పనిచేస్తున్నాడు అంతటి సమర్థుడైన "ఉత్పత్తుల సమన్వయాధికారి" ఆ కర్మాగారాని కింతకుముందు లభించలేదట

*　　*　　*

మీరు మీ విజయ మార్గాన్ని మలచుకోవాలంటే—మీ మనసుకెంతో నచ్చిన మీ విజయాలలో 20 ఒక పట్టికగా వ్రాయడంతో ఆ కృషి ప్రారంభించండి సంప్రదాయిక విశ్వాసాలు "భ్రమ, దుర్భ్రమ, ఆత్మవంచన" అనదగ్గ వాసన లున్నాయని భయపెట్టి, మీ విజయాంశాలలో కొన్నింటిని ఉదహరించ నీయవు కాని—మీరు ఏదో ఒక విజయాన్ని సాధించినప్పుడే చిత్తశుద్ధితో, సవినయంగా దాన్ని వెలిబుచ్చగలరనే సత్యాన్ని మనసులో వుంచుకోండి

"ఆపని చేసినప్పుడు ఎంతో గొప్ప అనుకున్నానుగాని, నిజానికి అది అత్యల్పం లెద్దూ'' అనే అలసభావానికి లొంగిపోవద్దు మీ విజయాల్లో ప్రతిఒక్కదానికీ—అది మీ మనసునెంత ఆకట్టిందో దాన్నిబట్టే — విలువకలిగి వుంటుందని గుర్తుంచుకోండి ఒక పనిని మీరే కాలంలో చేశారో ఆకాలపు పరిస్థితులను, ఆ పనిని సవివరంగా మనస్సులో సృష్టించుకుని — ఆ కాలంలో మీకుగల దృక్కోణంతోనే పరిశీలించండి

ఇటీవలనే జరిగి, ఇంకా మరపురాని అంశాలను మాత్రమే లెక్కవేసి తృప్తి పడకండి మీ జీవితాలలో అంతకుముందు, ఎంతోకాలం క్రితం, సాధ్యమైనంత వెనక్కుపోయి ఆయా విజయాంశాలను పరికించండి ఒకతను ఏడేళ్ళ వయసులో ఉద్దేశరహితంగా ఒక మదించిన గుర్రాన్ని ఎక్కాడు అది వెర్రెక్కినట్టు అతి వేగంగా, అల్లిబిల్లిగా, వంకర టింకరగా పరుగులెత్తింది ఆ కుర్రవాడు భయపడి, ఏడ్చి, క్రింద పడిపోలేదు ఆ అస్తవ్యస్తపు వెర్రి గుర్రంస్వారీ అతనికెంతో సంతోషంగా, ఉత్సాహోద్రేక ప్రేరకంగా వుందట ఈ అనుభూతి వల్లనే—సర్వదా గుర్రాలతోనే గడుపుతూ: గుర్రాలను పెంచి, తరిఫీదు యిచ్చి, రేసుల్లో పాల్గొనాలనే ధ్యాసలో పడ్డాడు. యుక్తవయస్సు రాగానే ఆతడు గొప్ప గొప్ప అరబ్బీ గుర్రాలను పెంచుతూ, విశేష విజయాలను సాధించాడు మొదటి స్వారీ సమయంలో భయపడి వుంటే — నేడింతటి గొప్ప గుర్రాల వ్యాపారి అయ్యేవాడు కాదుగదా!

ప్రత్యేకశక్తి, కుతూహలం, మానసిక ప్రేరణ మొదలైన అనేక లక్షణాలు కలిసి ''విజయా''న్ని రూపొందిస్తాయి. మీ గత విజయాలను సాధించడానికి

తోడ్పడిన అంశాలను మీరు స్పష్టంగా అంచనా వేసుకుంటే—మీ విజయాలలో ఒకదానికి మరొకదానికి పోలికలు లేవని పిస్తుంది. కాని, వాటన్నిటికీ తోడ్పడిన సమానాంశాలు కొన్ని తేలతాయి. అవి ఏమిటంటే— ఊహాశక్తి, చోదకశక్తి, సృజనాత్మకశక్తి, ఆకర్షణ, దీక్ష, ఈ విశిష్ట లక్షణాలను "విశిష్ట విజయాంశాలు" అందాం.

* * *

మీలో ఈ "విశిష్ట విజయాంశాలు" ఉన్నవని గుర్తించడం ఒకయెత్తు, వాటిని బహుళ ప్రజ్ఞతో వినియోగించుకోవడం మరోయెత్తు...మీకు తగిన ఉద్యోగాలు, వృత్తులు, వేలకు వేలు గోచరిస్తాయి అయితే వాటిని అయిదు రంగాలుగా విభజించుకోవచ్చు (1) పెట్టుబడులు అమ్మకాలకు సంబంధించిన వ్యాపార రంగం (2) ముడిసరుకులను అమ్మటానికి తగ్గ వస్తువులుగా మార్చే పారిశ్రామికరంగం (3) విద్యాబోధ, రవాణా, ఆహార సరఫరా, గృహనిర్మాణం, పారిశుధ్యం వంటి శాఖలుగల సేవారంగం (4) శాస్త్రవేత్తలు, వైద్యులు, న్యాయవాదులు, సలహాదారులు, గణాంకకులు, తదితర వ్యష్టివృత్తుల రంగం (5) వ్యష్టి యాజమాన్య రంగం.

ఈ అయిదు రంగాలను పునర్విభజిస్తే 12 రకాల వృత్తిశాఖలు గోచరిస్తాయి: (1) కళలు (2) లెక్కలు, ఖాతాలు (3) యాంత్రిక, సాంకేతిక (4) మాటలు (5) నచ్చజెప్పడం (6) భావనలు (7) విజ్ఞానశాస్త్రం (8) మానవ సంబంధాలు, (9) సమస్యా పరిష్కారం (10) సంగీతం (11) శారీరకం (12) నాయకత్వం

* * *

మీ విజయ కారణాంశాలు—మాటలు, భావన, రచన, అలంకారము (కళ) అవుతాయనుకోండి. ఇవన్నీ కలసి— మీరు వ్యాపార, వృత్తి రంగాలకు తగియుండగలరని దృఢంగా సూచిస్తున్నాయి మీరు ఆ రంగాలమీదనే దృష్టిని కేంద్రీకరించాలి మాటలు, భావాలు, రచన, అలంకరణ—ఈ నాలుగూ పూర్తిగా వుపయోగపడే వృత్తి ఏది? పుస్తక ప్రచురణ, ప్రకటనల సంస్థలు మీకు తగినవనేది సుస్పష్టం

తన శక్తియుక్తుల్ని సరిగా గుర్తించి, వినియోగించుకోగల వ్యక్తి విజయ పరంపరలకు అంతంటూ వుండదు ప్రతి ముందడుగూ మరో ఘన విజయానికి దోవతీస్తుంది. ఈ విధంగా నిత్యవిజయ సాధనయే తనకు అలవాటైంది అని గుర్తించినవాడు—విజయమే తనను వరించిందని గ్రహించగలడు 

# గీతాంజలి

అనువాదం

శ్రీ వేంకటేశ్వరరావు

★



ప్రాణములోని ప్రాణమవురా, ప్రభు! నా సకలాంగకమ్ములన్
నీనును జీవసంస్పృశన నివ్వటిలున్, విరబూయునంచు నెం
తేనియుఁ దెల్వికూరుటను నిష్ఠమెయిన్ బ్రయతింతు సర్వదా
మేనునుపం గడున్ శుచిసుమింపగ, శుభ్రత తేజరింపగా!!

నా మనమున్ వివేచన మనం జిఱుదివ్వియ వెల్గువెట్టి తే
జోమయ ధామమున్ సలుపు సూనృత మీవని నిన్నెరుంగుటన్
మామక భావనా విశద మండలముల్ దరిదాపులందునే
నీ మెసలాడకుండఁ బ్రయతింతు నజస్రమ సద్విచారముల్!!

నా యెద దివ్య మందిరమునన్ మణిపీఠము వెట్టి కొల్వు వేం
చేయు ప్రభూత్తరుండవను చేతన చేకురి నా యెడందఁ బ్రో
ద్రోయుద మంగళమ్ము నఘవిదోషము నెల్ల—ప్రఫుల్ల నిత్య లీ
లాయతిఁ బ్రేమము న్నిలుపులాగ జతించెద నెల్లవేళలన్!!

చేష్టకును వలయు బలము చేపడుటయు
నీదు శక్తి కల్మియని నే నెరుగుకతన
నిన్ను నా చెయ్యువలంబట్టి నిపుణముగను
వ్యక్త మానమ్మొనర్చుచే యత్నమోయి!!

*    *    *

చాలురా మంత్రచారణ — మేల నామ
కీర్తన — విడుము జపమాల వర్తనమును.—
తలుపులు బిగించి చీకటులలముకొన్న
ఒక్క గుడి మారుమూలలో నొంటి నొదిగి
ఎవని కోసమో భక్తి ధ్యానింతు వౌర!!

విప్పురా కన్నుదమ్ములు, విరిసిచూడు
లేదురా నీ యెదుర నీశ్వరేశ్వరుండు!!

కలడాతడు కర్షకునెడ
నిల నాగఁట పగులదున్ని యెసఁగిన చోటన్
కలడాతడు కూలియెడ
శిల చిద్రుపలుగొట్టి బాటచేసెడి చోటన్!!

నడివేసగి యెండలలో
కడవలతో గ్రుమ్మరించు గమివానలలో
నడతెంచును వారల యెడ
కడుధూళిని మాయునతని కౌశేయకముల్!!

విడిచి పుచ్చుము నీ మడి మడుగు లింత,
స్వామి ఫలమైన ధూళిధూసరధరాప
థాలకై దిగి నడువగాఁ దలఁపుమోయి!!

మోక్షమందు వదెక్కడ పొడమ నేర్చు
ప్రభువతంసుడె సమ్మోద భరితుడౌచు
సృష్టి సంకెళ్ళు స్వయము కై సేసి కొనియె
నెప్పటికి మనతోనే నటింపవలసి !!

అవలఁ ద్రోయుము హారతు లలరులన్ని
లేచిరా ధాన్యముద్రావిలీనత విడి—
నీవు గట్టిన వలువ చిన్గికఱలైన
నేమి నీపుట్టి మున్గిపోయినది లేదు !!

కానరా, కలిసికొనురా కదలివాని—
నిలుమురా కృషిలోన వానికయిదండ
నీ నుదురనోడు చెమరింత నిలిపి నిలిపి!!



# మారు పేరు పెట్టు



మనిషికైనా మారుపేర్లు పెట్టడం బహు తేలిక. ఆకారంలోని విలక్షణాలను బట్టి, పేర్లలోని ఎబ్బెట్టు పదాలనుబట్టి, చేష్టలలోని వికారాలనుబట్టి — ఎదుటి వారికి వెంటనే తట్టే మారుపేర్లు ఎక్కువగా వుంటాయి

ఒకరిపట్ల తనకుగల అసూయ, ద్వేషం, విరోధాల కారణంగా తన తాపాన్ని (?) భరించలేక పెట్టే మారు

---

పోలవరపు శ్రీహరిరావు

పేర్లుకూడా తరచే ఈ రెండు తరహాల మారు పేర్లూ ఎక్కువ సందర్భాలలో అల్ప హాస్యానికీ, కొన్ని సందర్భాలలో వాటిని సృష్టించిన వారి అల్పజ్ఞతకూ మాత్రమే పతాకలు కావడం సాధారణం ఇలాంటి మారుపేర్ల కారణంగా ఉభయపక్షాలమధ్య హాస్య సంకేతాలుగా అర్ధం చేసుకోబడనప్పుడు—కోప తాప ద్వేషాలు రేగడం కద్దు



మారుపేర్లలో మరొకరకం ముచ్చట కోసం పెట్టుకునేవీ, పెట్టబడేవీను ఇవి ఉభయ పక్షాలకూ సంతోషప్రదంగా వుంటాయి గనుక, అవి ఆప్యాయతను పెంచేవే అవుతాయి గాని పేచీ వుండదు.

వీటన్నింటినీ మించిన మరో తరహా మారుపేర్ల విషయంలో మరింత నిశిత పరీక్ష అవసరం

ఒక్కొక వ్యక్తి వ్యవహార సరళిని, గాఢాభిప్రాయాలను, జీవిత విధానాన్ని విశేషంగా పరిచయం చేసుకున్నవారు ఆలోచించి మరీ పెట్టే మారుపేర్లు— ఈ కోవకిందికి వస్తాయి ఇవి ఆ వ్యక్తి జీవిత సరళికి సంక్షిప్తాభి వర్ణనలుగా టంకంలా అతికిపోతాయి

* * *

భూషయ్యగారికి దూర్వాసుడనే మారు పేరును పెట్టిం దెవరోగాని—ముప్ఫయ్యేళ్ళకు పైగా ఆయనతో కాపురంచేస్తూ, మనుమలనూ, మనుమరాళ్ళను కూడా యెత్తుకున్న సీతమ్మగారైనా ఎన్నడూ ఆయన్ను గురించి ఆ మారుపేరుకు భిన్నమైన అభిప్రాయం వెలిబుచ్చి వుండదు

కాపురానికి వచ్చిన కొత్తలో తనభర్తనుద్దేశించి ఎవరైనా "దూర్వాసుడు'' అన్నప్పుడు సీతమ్మగారు మనసు నొచ్చినట్లు ముఖం ముడుచుకునేది మరి కొంత కాలానికి—ఇరుగు పొరుగు అమ్మలక్కలెవరైనా తన భర్తను ఆ మారు పేరుతో అభివర్ణిస్తే తనలో తనే సిగ్గుపడేది

అత్త మామలు పోయి తన బిడ్డలు ఎదుగుతూన్న కాలంలో ఆమె తనభర్తనెవరు ఆ మారుపేరుతో సూచించినా వినీ విననట్లు ఊరుకునేది కూతుళ్ళు తన యింటినుంచి కాపురాలకువెళ్ళి, కోడళ్ళు తొలిబిడ్డల నెత్తుకువచ్చి తన యింట కాపురాలు చేస్తున్న కాలంలో— సీతమ్మగారు కూడా ఆయన లేనప్పుడు ఆయన్ను దూర్వాసుడనే వ్యవహరించ సాగింది

చిన్నకొడుకు వేరడి నప్పట్నుంచీ ఆమె భూషయ్యగారి ముఖంమీదే ఆపేరు బెట్టి మాట్లాడ్డానికి సాహసించింది. అయిదారేళ్ళనుంచీ ఈ సాహసం దినదిన ప్రవర్ధమానం అవుతూ ఆమె "దూర్వాసు" డని ఉచ్చరించే తీరుకూడా ప్రతిసారీ వెనుకటికంటె కటువుగా ధ్వనిస్తున్నది.

ఇలాంటి చరిత్రగల ఆ మారుపేరు భూషయ్యగారికి టంకంలాగా అతికిపోయిందంటే—అది "అల్పోక్తి'' అవుతుందేగాని, "అతిశయోక్తి'' కాదుగదా!

* * *

ఆఖరికి గతరాత్రి భూషయ్యగారే స్వయంగా "అవునే! నేను దూర్వాసుణ్ణే దూర్వాసుణ్ణే కాదు—అంతకు మించినవాడి యబ్బె వడ్డన్నా వుంటే—వాడి తాత ననుకో!!'' అనేశాడు.

మనుమలూ, మనుమరాళ్ళూ ఊహా పోహలు పెంచుకుంటున్నకొద్దీ—తనను భర్త అంత బహిరంగంగా దులపరిం చెయ్యడంలేదని విశ్వసిస్తున్న సీతమ్మ, గతరాత్రి అందరి ఎదుటా ఆయన ఇంత విజృంభించేసరికి విస్తుపోయింది

ఇదివర కెప్పుడు తా నా మారుపేరును పలికినా ఆయన వృద్ధాప్యంవల్ల ఊడి పోగా మిగిలిన నాలుగు పళ్ళనే పటపట లాడించేవాడు అంతలో తనకు చెప్పరాని భయం వేసేది ఆ పక్క—నున్న పసి బిడ్డనో, ఈ ప్రక్క—నున్న చేటనో అందు కుని ఏదో అర్జంటు పని వున్నట్టు తాను లోపలికి వెళ్ళిపోయేది పులి తరుము కొస్తున్న లేడిలా గుండెలు తడబడుతూ తా నలా లోపలికి వెళ్ళిపోయినా—ఆయన అరుగుమీదవుండి విసరిన సకిలింపు సింహగర్జనలాగా తన ఒంటిని జలద రింప జేసేది

అటువంటి అనుభూతులుగల సీతమ్మ గతరాత్రి భర్తనోటనే ఆ మారుపేరును మరింత ఘట్టిగా వినడంతో—గుటక పడ నట్లు కళ్ళు తేలవేసి నుంచుంది ఆయన గారి పుష్టి మీసాలూ (మామూలుగా పై పెదవిమీద పెరిగే బుర్ర మీసాలకు తోడుగా చెక్కి—ళ్ళకు దిగువను పెరిగే గడ్డంవెంట్రుకలనుకూడా బొద్దుగాపెంచి, అన్నీకలసి ఒకే మీ స మ ని పిం చే వి), ఎర్రని కళ్ళూ, ముడుతలుపడిన నుదురూ



" అబ్బే, మరేంలేదు. శనివారం కదూ ఇవాళ అందుకనీ అలా గుడికి వెళ్దామనీ "

అదరడంచూచి—ఆ వృద్ధురాలి గుండెలు బిక్కు—బిక్కు— మన్నాయి

అలవాటుప్రకారం ఆ ప్రక్క—అరుగు మీద దీపంచుట్టూ కూచ్చుని చదువుకుం టున్న పెద్ద పిల్లలనూ, వాళ్ళ పుస్తకా ల్లోని బొమ్మలనూ శతవిధాల వేధించు తూండే చిన్న మనుమరాలు కూడా— పళ్ళు బిగబట్టి నోరు మూసుకుంది. చీమ చిటుక్కు—మన్నా వి ని పిం చే ఆ నిశ్శ బ్దంలో—భర్తను ఆ విధంగా చూస్తున్న సీతమ్మకు గుం డె లా గి పో తు న్న ట్లయింది

ఆమెకూడా అలవాటు ప్రకారం ఆ మనుమరాలినో, మరో ప్రక్క—నున్న చెంబునో అందుకుని, లోపల ఏదో పని

వున్నట్లు వెళ్ళిపోదామని ప్రయత్నించ లేకపోయింది ఆమె పమిటెచెంగు తీసి నోట్లో దోపుకుంటూ—ఎన్నడూలేని కోపం తెచ్చుకుంటూ, ''ఇక మీముందు నే నోరెత్తితే ఒట్టు! నా పేరు సీతమ్మ కాదు!'' అని, చరచరా యింట్లోకి వెళ్ళి పోతున్నది భూషయ్యగారు భార్య వెళు తున్న తీరు చూస్తూనే ''అదే మాట మీదుండు నీ చిన్నకొడుకును నా గడప తొక్కనిస్తే నా పేరుదీసి మారుపేరు పెట్టవే!'' అన్నాడు

అంతవరకూ బిగబట్టుకు కూర్చున్న చిన్న మనుమరాలు, పెద్దపిల్లల దగ్గ ర్నుంచి లేచి, చెంగుచెంగున లోపలికి పరుగెత్తింది అప్పటికే యింటి మధ్య గల మండువా మెల్లానుదాటిన ముత్తవను ఆ బిడ్డ అందుకుని ''నాయనమ్మా'' అని కేకపెట్టింది ఆ అయిదేళ్ళ పిల్లవేసిన ఆ కేకలో ఆర్తనాదమూ, అనునయమూ కూడా ధ్వనించాయి

తనభార్య ''ఒట్టు'' అని అనిపోయిన మాటలూ, ఈ చిన్న మనుమరాలు వేసిన కేకా భూషయ్యగారికి కొత్తతరహాగా వినిపించాయి తన అరవయ్యేళ్ళ జీవితం లోనూ ఏ ఒక్కసారి తా నిలాంటివి విన లేదనిపించింది ఇంతలో వంటింటి గుమ్మం వేపు నుంచి ''పెద్దన్నయ్య పుస్తకంలో ఎలుగ్గొడ్డుకు — తాత య్యేమవుతారు నాయనమ్మా?'' అని ఆ చిన్నమనుమరాలుఅడగడంవినిపించింది

భూషయ్యగారికి ఆ మాట ముల్లుగర్రలా గుచ్చుకుంది సీతమ్మ ''దానికి తాతేవ డన్నా వుంటే వాడికి తాతంట—మీ తాతయ్యే అన్నారు వినలా?'' అని ఆ పిల్లతో చెప్పడం ఆయనకు వినిపించింది

* * *

పొద్దుపోయేదాకా చదువుకున్న పిల్లలు వచ్చి లోపల పడుకుని నిద్రపోతున్నారు ఆ అందరి మధ్యా పడుకున్న సీతమ్మగారు మాత్రం కునుకు రానట్లు, పడక కుదరనట్లు అటూ యిటూ మసలుతున్నది మాటి మాటికీ పమిటె చెంగుతో కళ్ళు తుడుచు కుంటూ, మధ్య మధ్య లేచికూచ్చుని ముక్కు చీదివేస్తున్నది భర్త కోపానికి గురై ఆస్తిలో చిల్లిగవ్వభాగం కూడా లేకుండా అన్యాయమైపోయిన చిన్న కొడుకే గుర్తు వస్తున్నాడు

ఇంకో ఝాము పొద్దుపోయాక— అలవాటు ప్రకారం రచ్చబండ దగ్గర కాలక్షేపానికి వెళ్ళిన పెద్ద కొడుక్కూడా తిరిగి వచ్చాడు అతడు అలా రాగానే సింహద్వారం తలుపులు మూసి, గడియ వేయడం అలవాటు గతరాత్రి ఈ అల వాటుకు భిన్నంగా పెద్దకొడుకు ప్రవ ర్తించడం సీతమ్మకు ఏదో లోపంగానే తోచింది

తాను లేచివెళ్ళి ఆ తలుపులు వేద్దా మనుకునే సరికి పెద్దకొడుకు ''అమ్మా'' అని పిలుస్తూ దగ్గరకు వచ్చాడు సీతమ్మ లేచి కూచ్చుని ''ఏం బాబూ?'' అంది

అతడు రహస్యం చెబుతున్నట్లుగా, ''నాన్నగా రింకా కూచ్చునే వున్నారేం? వంట్లో బాగుండలేదా మ్మా?'' అని అడిగాడు అతడు అయిదుగురు బిడ్డల తండ్రి అయినా నేటివరకు తన తండ్రి ఎదుట బిగ్గరగా మాట్లాడి యెరుగడు

అతని ప్రశ్న వినగానే సీతమ్మగారు ''ఏమోరా బాబూ, రోజూ ఈ పాటికి గుర్రుపెట్టి నిద్రోయే వారే?'' అంది కొడుకు ''చలి ఎక్కువయింది—నాన్న గారి మంచం లోపల వెయ్యకపోయారా'' అని, అతని గదిలోకి వెళ్ళిపోయాడు సీతమ్మ మరోసారి చీదివేసి, కళ్ళు తుడుచుకొని సింహద్వారం దగ్గరకు వెళ్ళింది గుమ్మంలో నుంచిని కుడిచేతి వేపు అరుగుమీద వున్న భర్త మంచాన్ని చూచింది

భూషయ్యగారు అప్పుడే అగ్గిపుల్ల గీసి చుట్ట ముట్టించుకోబోతున్నారు ఆమె ఏదో చెప్పాలన్నా మాట పెగలక రెండు మూడుసార్లు గుటకలు వేసింది ఆమె ఆ తటపటాయింపులో అప్రయత్నంగానే పమిటచెంగును రెండో భుజం కూడా కప్పుకునేట్టుగా సవరించుకుంది. అలా సవరించుకోడంలో ఆమె చేతి గాజులు కొద్దిగా సవ్వడి చేశాయి భర్త ఇటు తిరిగి తనవేపు చూశాడు. ఆ చీకటిలో ఆయనకేమి కనపడిందో తనకు తెలియదు ఆయన వెంటనే చుట్టను గిరవాటేసి



''ఏమయ్యా నిన్ను ఉరితీసేముందు నీ కేమైనా కోరికలుంటే అడుగు''
''మా ఆవిడ చేసిన భోజనం తినాలని ఉంది సార్ అప్పుడు నాకు తప్పకుండా చచ్చిపోవాలని ఉంటుంది.''

పడుకుని, శాలువా ముసుగు పెట్టుకున్నాడు

సీతమ్మ తృప్తిగా నిట్టూర్చి తలుపులు గడియవేసి, వెళ్ళి పడుకుంది

* * *

గతరాత్రి జరిగింది ఇంతే

ఈ రోజు ఉదయం సీతమ్మ వంటింట్లో పనులు చేస్తూండగా భూషయ్యగారు నాలుగైదుసార్లు ఏదో పనివున్నట్లు అరుగుమీదినుంచి వంటింటిదాకా రావడం, మళ్ళీ మెల్లగా వెళ్ళి పోవడం ఆమె గమనించింది. కోడళ్ళు కాపురాలకు వచ్చినప్పట్నుంచీ — తాను పిలిచే వరకూ వంటింటి వేపు భోజనానికైనా రాని ఆయన,

ఈ వేళ యిలా చేస్తున్నారేమిటా అని సీతమ్మ అనుకోకపోలేదు

ఒకసారి ఆయన హడావుడిగా వంటింటి గుమ్మంలోకంటా వచ్చి తన కళ్ళల్లోకి చూచినపుడు — ఆమె ఎందుకో అడగాలనుకుంది గతరాత్రి పెట్టిన ఒట్టు గుర్తున్నదేమో అంతరాత్మకు — ఆమె గొంతుపెగల్లేదు ఇంతలోనే ఆయన చరచరా వెళ్ళిపోయారు

ఆయన ముందు భాగంలో వున్న ఇనప్పెట్టె తియ్యడం, ధబ్బుమనేట్టు వేయడం, సకిలిస్తూ అరుగు మీదికి వెళ్ళడం, పైపంచెను ఛెళ్ళున దులిపి తలగుడ్డ చుట్టుకొవడం — వంట పనుల్లో వున్నా సీతమ్మగారికి సినిమాలో బొమ్మల్లాగా కళ్ళలో కనపడుతూనే వున్నాయి

వడసారం తగ్గుతున్నప్పటి నుంచీ ఆయన పిల్లలతోపాటే పెందరాళ భోం చేస్తున్నారు ఈ వేళ ఇలా భోజనాల వేళ బైటికి వెళుతున్నారేమిటా, పిలిచి వడ్డించి వేద్దామా, మళ్ళీ ఎంత పొద్దెక్కి ఇంటికి వస్తారో నని ఆమె మనసు గుబగుబలాడింది... "ఎవరికైనా పండగ మామూలు ఏదైనా ఇవ్వడానికి వెళ్ళారేమో, ఎంత సేపట్లో వస్తారులే!" అని సరిపెట్టుకుంది.

కాని, ఆయన ఏ వేళకూ తిరిగిరాకపోయేసరికి సీతమ్మ గాభరా పడింది ప్రొద్దు నెత్తిమీది కొచ్చేసరికి పిల్లలు రెండోసారి భోజనాలకూర్చున్నా వచ్చేశారు ఆయన రాలేదు. ఆమె ఎన్నడూ లేంది పిల్లల్ని కసురుకుని, ముందు వాకిట్లోకి వెళ్ళింది వీధిలో నిలబడి అటూ యిటూ చూచింది ఆయన జాడ కనిపించలేదు

లోపలికివెళ్ళి పెద్ద కొడుకును నిద్ర లేపి "మీ నాన్న అన్నానికన్నా రాలేదు ఎక్కడికి కెళ్ళారో!!" అంది తల్లి ఆదుర్దాను గమనించిన పెద్దకొడుకు "ఇవాళ పొలంవేపుకూడా రాలేదమ్మా.. ఎక్కడికి వెళతారూ?...పండగకోసం ఈ యేడు గొర్రెపిల్లను పెంచలేదని రెండు మూడుసార్లు పాలేళ్ళదగ్గర అన్నారట. ఒకవేళ దానికోసం వెళ్లారేమో! వస్తార్లే అమ్మా, నువ్వెళ్ళి అన్నం తిను — మా నాన్న కోసం గాభరా ఏమిటీ!" అని నవ్వేశాడు

సీతమ్మ నిట్టూర్చి "అంతేలే బాబూ" అని వెళ్ళిపోయింది పిల్లలకు కోడలు వడించేసింది అత్తగారు రాగానే ఆమె కంచంలో కూడా వడ్డించింది

* * *

ప్రొద్దుగూకేవేళ సీతమ్మగారు పెద్ద బర్రె పాలను పిండుతున్నది. చిన్న మనుమరాలు గేదె దూడకు "రేపేం మనింటోనే భోగి పండగ... అంచక్కా తలంటుకుంటాం...ఇంచక్కా పట్టు పరికిణీలు కట్టుకుంటాం...పరమాన్నం వొండుకుంటాం... అ(...నీ కూ్కా స్తి

పెడతాలే — ఏం బుజ్జిగా'' అని మాటలు చెబుతున్నది. సీతమ్మ కళ్ళలో నీళ్ళు తిరిగాయి !

చిన్నకొడుకూ, చిన్నకోడలూ, వాళ్ల ఒక్కగానొక్క బిడ్డ కుష్టుడూ గుర్తు వచ్చారు వాళ్ళు ఏం పండగ చేసుకుంటారో, ఎంత కటకటలాడుతున్నారోనని ఊహించుకునేసరికి సీతమ్మ కన్నీరు జొటజొటా పాల చెంబులో పడిపోయాయి ఆమె 'ఇదేమిటా' అని పాలు పిండడం ఆపి, కళ్ళలో నిండిన నీటిని తల ఊపి విదిలించివేసుకుంది

ఇంతలో పెద్దకోడలు ఇంట్లో నుంచి హడావుడిగా వస్తూ ''అత్తయ్యా ! కుష్టు దొచ్చాడు, కుష్టుడు'' అంది. ఆ మాటల తొందరపాటు మరో విధంగా ధ్వనిస్తున్నా సీతమ్మకు ఎవరో కొరడాతో కొట్టినట్లయింది ఆమె పాలు పిండకుండానే విసురుగా లేచి "అంత ఎత్తిపొడుపు దేనికమ్మా" అని విసుక్కుంటూ చిన్న మనుమరాలి చేతిలోని దూడతాడును విదిలించి, కుడవడానికి వదిలివేసింది

పెద్దకోడలు మూతి మూడు వంకర్లు తిప్పడం ఆమె చూడలేదుగాని, ''ఎత్తిపొడుపులూ, దెప్పిపొడుపులూ నేరిస్తే ఇట్టా ఎందుకుంటాం — నేనూ మీ చిన్నకోడల్లాగా భర్తను కొంగుగట్టే ఆడించే దాన్ని సీమ రాణీలా'' అనడం మాత్రం వింది.



"మీ మొగవాళ్ళు ఎప్పుడూ ఇంతే ఒక చెవితో విని రెండో చెవితో వదిలేస్తుంటారు."
"మరి మీ ఆడవాళ్ళు రెండు చెవుల్తో విని నోటితోవదుల్తుంటారా!"

---

ఈ ఈసడింపు వినేసరికి సీతమ్మ నవనాడులూ కుంగిపోయాయి ఆమె పొంగివస్తున్న కన్నీరు కోడలికి కనుపించకుండా చెంగు అడ్డం పెట్టుకుని, ఇంటోకి వెళ్ళబోయింది ఆమె నాలు గడుగులు వేసే సరికి "నాయనమ్మా" అంటూ పదేళ్ళ కుర్రాడు పరుగెత్తుకొచ్చి కాళ్ళకు చుట్టేసుకున్నాడు సీతమ్మ తన చెవులను తాను నమ్మలేక పోయింది. లిప్తలో కళ్ళు తుడుచుకుని ఆ కుర్రాణ్ణి చూచి, పాలచెంబు అక్కడే వదిలి, తటాలున అతన్ని ఎత్తుకుని ముద్దులతో నింపివేసింది

* * *

సీతమ్మ ఆ రాత్రి వంటింటి వేపు చూడనైనా లేదు మండువా మెల్లాలో కూచ్చుని, మాటిమాటికీ కృష్ణుణ్ణి ముద్దు పెట్టుకుంటూ, వాడితో కబుర్లు చెప్పించుకుంటూ, వాణ్ణి ఆడుకుందామని పిలుస్తున్న ఇతర మనుమలనూ, మనుమరాళ్ళనూ దూరంగా కూచ్చో బెడుతూ గడుపుతున్నది.

ఈలోగా వందసార్లయినా అడిగి వుంటుంది : "ఎట్లా వచ్చావురా బాబూ ? మీ అమ్మా నాన్నా పంపించారా ? ఈ ముసలి నాయనమ్మ ఇప్పటికి గుర్తొచ్చిందా ?" అని కృష్ణుడు, "నేనే వచ్చేశా నాయనమ్మా, ఎవళ్ళూ ఏం అనలేదు'' అని మాత్రమే జవాబు చెప్పాడు

ఇతర పిల్లలంతా అన్నాలు తిని అరుగు మీదికి వెళ్ళి చదువుకుంటున్నారు సీతమ్మ ఒక పళ్ళెంలో అన్నీ వడ్డించుకు వచ్చి, గిన్నెడు నెయ్యివోసి కలిపి ముద్దలు చేసి కృష్ణుడికి తినిపిస్తున్నది పెద్దకోడలు ఎన్ని తరహాలుగా మూలిగినా, ఎంత విసుగ్గా దీర్ఘాలు తీసినా వంటింటివేపు కన్నెత్తి చూడలేదు

పెద్దకొడుకు కాళ్ళు కడుక్కుని "అన్నం వడ్డించు అమ్మా'' అంటూ వచ్చి, తల్లి కృష్ణుడికి అన్నం తినిపించడం చూచాడు ''వీ డెప్పుడొచ్చాడే అమ్మా ?'' అని అత్యాశ్చర్యంగా అడిగాడు ఇంతలో భార్య వంటింట్లోనుంచి పిలవగా, అట్టు వెళ్ళిపోయాడు సీతమ్మ ఏదో చెప్పబోయింది ఇంతలో కృష్ణుడు ''పెదనాన్న అట్లా నల్లబడిపోయాడేం నాయనమ్మా'' అని అడిగాడు వాడి కంఠంలో ఆర్ద్రిత ధ్వనించడంతో సీతమ్మకు వాత్సల్యం ఉప్పొంగింది. ఆమె ఎంగిలి చేయనేది కూడా గుర్తులేనట్టు వాడి గడ్డం పట్టుకు నిమురుతూ ''మా నాయనే - చుట్టాల మీద నీకెంత భ్రమతరా !'' అని మురుసుకుంది ''మీ తాతదే రాతిగుండె'' అనికూడా అంది—నోట్లో ముద్దపెడుతూ

* * *

కృష్ణుడు ఏదో తొందరగా చెప్పాలని నోట్లో ముద్ద చకచకా మింగుతూ "నాయనమ్మా—మా తాతయ్య—'' అంటున్నాడు ఇంతలో—ఎవరో స్త్రీ డగ్గుత్తితో ''లేచి రారా కృష్ణా'' అనడం, అతని భుజాన్ని గట్టిగా పట్టుకోడం, సీతమ్మ బెంబేలుపడి తలెత్తి ఆ స్త్రీ ముఖంలోకి చూడడం క్షణంలో సంఘటిల్లాయి

సీతమ్మ చిన్నకోడల్ని అలా చూచి, తన కళ్ళను తాను నమ్మలేకపోయింది ఎడమచేత్తో కళ్ళు తుడుచుకుంటూ, కుడి చేతిని ఆమెవేపు చాస్తూ— ''శారదా'' అని అంది అది పిలుపుకాదు, కేకకాదు— లేగదూడను కసాయివాడు లాక్కుపోతున్నప్పుడు తల్లిఆవు వేసే అంభారవం లాంటి ఆర్తారవం.

శారద కళ్ళనుంచి రెండు కన్నీటి బొట్లు జారి అత్త సాచిన చేతిమీద

పడ్డాయి. సీతమ్మ చివాలున లేచి కోపమూ, ఆవేదనా పెనగొన్న ఆవేశంతో "నీకింకా నామీద కసి తీరలేదా శారదా? నా బిడ్డ మనసు విరిచి, మాకు దూరంచేసింది చాలక, ఈ ముసలిది మనుమణ్ణి చూచి సంతోషపడితే కూడా నీ కళ్ళల్లో నిప్పులు కురవాలా? నేనేం పాపం చేశాను?" అంది

శారద కత్తి కెరవుతున్న కోడి పిల్లలా మెలికలు తిరుగుతూ అత్తగారి కాళ్ళమీద వాలిపోయి "అత్తయ్యా" అంది ఆ ఒక్క మాటలోనే కోటి గొంతుల దీనారవాలు వినిపించాయి సీతమ్మ ఆశ్చర్యంగా నిలచిపోయింది

అంతలో పెద్దకొడుకు అంగలూ పంగలూ వేసుకుంటూ వస్తూనే "ఆ టక్కులాడిని ఇంట్లో కెవర్రానిచ్చారు? గెంటండి బయటికి" అని గర్జించాడు కుష్టుడు తెల్లబోయి, గాభరాగా చూస్తు న్నాడు సీతమ్మ తనకాళ్ళ కావులించుకున్న కోడలి తలమీద కుడిచేతిని బలంగా ఆన్చి, పెద్ద కొడుకుతో "ఎవర్రా గెంటేది? ఎవరినిరా నువ్వు అనేది?" అని గద్దించింది పెద్దకొడుకు తన తల్లి చూపులూ, పలుకులూ అంత కటువుగా వుండగలవని ఎన్నడూ అనుకోలేదు నిర్విణ్ణుడై నిలబడి పోయాడు

క్షణం సేపు నిశ్శబ్దం పాదుకుంది దాన్ని భగ్నం చేస్తూ సింహద్వారం వేపు నుంచి "శివుని మాట విననిసతీదేవి



పోషర్‌వర్కర్ మీరంటే నాకు ప్రేమ. అందుకనే మీదగ్గరి కొచ్చాను

చాకలి మాకిక్కడ అందరికీ పెళ్ళిళ్లు అయినై. పక్క మంగళిగూడేనికి పోండి.

కంటే గొప్పదాని వయ్యావుగా — రావే ఇవతలికి" అనే పిలుపు మేఘగర్జనగా వినిపించింది శారద అత్తగారి పాదాలకు నమస్కరించి, తత్తరపడుతూ లేచి కుష్టుణ్ణి బలంగా పట్టుకుని, బైటికి నడువబోయింది

సీతమ్మ హృదయం రంపపుకోతకు నెలవైంది కట్టలు తెంచుకు వస్తున్న శోకాన్ని ఆపుకోడానికి వ్యర్థ ప్రయత్నం చేస్తూనే—"జగం"అని గావుకేకపెట్టింది ఆ కేకలోని ఆర్తనాదం, గద్దింపూ కలసి ఇల్లంతా నిండిపోయాయి సీతమ్మ పళ్లు బిగబట్టి చరచరా నాలుగడుగులు వేసి— తల్లి వెంట వెళుతున్న కుష్టుణ్ణి తటాలున వెనక్కులాక్కుంది "అగు కిష్టుడూ— ఈ పాపిష్టి వాళ్ళిద్దరూ ఎట్లాలాక్కెళతారో నా బిడ్డని, నేనూ చూస్తాను" అని కేకలు వేసింది

గుమ్మం దాటబోతూ అత్తగారి మాటలు విని ఆగిపోయిన శారదను— బైటనుంచే జగం చేయి పుచ్చుకుని లాగబోయాడు. ఇంతలో వీధిలోంచి లోపలికి వస్తున్న భూషయ్యగారు కుడిచేయిసాచి, జగం చెంపమీద ఛెళ్ళున కొట్టి, ''నా కోడల్ని తాకావా నీవళ్ళు చీరుస్తాను, తల పగలగొడతాను — ఫో అవతలికి'' అన్నాడు

ఆయన దూకుడుగా లోపలికి వస్తుంటే ఎడమ చంకలోని పెద్దమూట ఒకటి కింద పడిపోయింది వెనుకనుంచి గొర్రె ఒకటి అరుస్తున్నది. ఆయన అవేమీ గమనించనట్లు కోడలి ముఖంలోకే చూస్తూ ''పండగపూట గుమ్మంలోకి వచ్చి ఇట్టే వెళ్ళిపోతావా అమ్మా'' అనేసరికి — ఆయన కంఠం ఒణికింది శారద ''లేదు మామయ్యా, నే వెళ్ళను లే'' అంటూ వెనక్కి తిరిగింది

సీతమ్మ కోడల్ని తనగదిలోకి తీసుకెళ్ళిపోయింది భూషయ్యగారు మనుమనితో ''కిష్టయ్యా — ఆ బట్టలమూట తీసుకెళ్ళి మీ నాయనమ్మ కివ్వరా'' అని, మండువాలో నివ్వెరపోయి నుంచున్న పెద్దకొడుకును ''బైట గొర్రె పిల్ల అరవడంలా ? పోయి చావిట్లో కట్టవేం'' అని గద్దించారు అతడు పిల్లిలాగా బైటికి వెళ్ళాడు

బైట అరుగుమూల కూర్చున్న జగాన్ని అన్న పలకరించలేదు జగమే నోరారా ''అన్నయ్యా'' అని పిలిచినా దులపరించుకుంటూ, గొర్రెను తీసుకు వెళ్ళిపోయాడు జగం పొంగివస్తున్న శోకాన్ని ఆపుకుంటూ, జేబుగుడ్డతో నోటికి అదిమిపెట్టుకుంటూ లేచి వెళుతున్నాడు

లోపలివసారాలో ఆసులో కండె లాగా తిరుగుతున్న భూషయ్యగారు చరాలున బైటికివచ్చి చూచేసరికి, చిన్న కొడుకు తమ యింటిమూల మళ్ళి వెళ్ళిపోతున్నాడు భూషయ్యగారు ''ఒరేయ్, జగం'' అని గర్జించుతూ అటు పరుగెత్తాడు,

మూలగదిలోవున్న సీతమ్మకూ, శారదకూ ఈ కేక ''త్రాష్టుడా'' అని తిట్టినంత కటువుగా వినిపించింది వాళ్ళు తత్తరలాడుతూ సింహద్వారంలోకి వచ్చేసరికి — భూషయ్యగారు జగాన్ని చేయి పట్టుకుని బరబరా లాక్కువస్తున్నారు జగం తన చేతిగుడ్డను నోట్లో కుక్కివేసుకుంటున్నాడు

భర్త అఘాయిత్యాన్ని చూసి సీతమ్మ ''ఇవ్వాళ ఈ కొంపకేదో మూడింది" అని బెగ్గటిల్లిపోయింది. ''నా బిడ్డను తీసుకు రమ్మని పోరినందుకు — నా కళ్ళెదుటే వాణ్ణి చంపుతారా ఏమిటి?'' అని భర్తను గద్దించి, పులుకూ పులుకూ చూచింది

ఆయన భార్యవంక చూడకుండా తల మరోవైపుకు తిప్పుకుంటూ, మామూలు

కోపధోరణిలోనే "ఊఁ.......లోపలికి తగలడండి" అని చిన్నకొడుకును కూడా లోపలికి తోసి, తాను సింహద్వారం గడపమీద కూర్చున్నాడు

సీతమ్మ చిన్నకొడుకును పడిపోకుండా పట్టుకుని డగ్గుత్తికతో "నేనెంత పాపిష్టిదాన్నిరా జగం" అంది మండిగం మీద కూర్చుని జేబులోంచి చుట్టతీస్తున్న భూషయ్యగారు — "నోర్మూయ్. .వాణ్ణి బైటికి కదలనిచ్చావంటే నిన్ను పాతేస్తాను జాగర్త" అని గద్దించి, చుట్ట నోట్లో పెట్టుకుని కొనను కటుక్కున కొరికి, తుపుక్కున ఊశారు సీతమ్మ నోరు నొక్కుకుని చిన్నకొడుకును లోపలికి తీసుకెళ్ళింది







* * *

ఆ రాత్రి చిన్నకొడుకూ కోడలికీ— తాను వాళ్ళ ఎడబాటును సహించలేకా, వాళ్ళ అనవసర పేదరికాన్ని ఊహించి భరించలేకా ఎంత కుమిలిపోయిందీ, భర్తను ఎన్నెన్నిసార్లు ఎత్తిపొడిచి చిన్నబోయిందీ చెబుతున్నది

అంతా వింటూ జగం కన్నీరు కార్చుతూ ముఖం మీద తుండుగుడ్డ కప్పుకుని పడుకున్నాడు శారద "ఊరుకోండి అత్తయ్యా — ఇక అంతా కలిశాముగా" అని ఓదార్చబోయింది సీతమ్మ "ఏం కలిశామో, ఏమో — నా కుష్టుడు మూలాన మీరిద్దరూ ఇంత కాలానికి ఇంటికివస్తే, మీమామ నోరార; పలకరించకపోగా ఆ దుర్వాసుడి వాలకం వదలకనేపోయె" అంటూ కళ్ళు తుడుచుకుంది

ఆమె తొడమీద తలపెట్టి పడుకుని అంతా వింటున్న కుష్టుడు లేచి

కూర్చుని—"మా తాతయ్యను అట్లా అన కోకు నాయనమ్మా ఆయనేగా మా అమ్మను బ్రతిమాలి నన్ను తీసు కొచ్చింది" అన్నాడు సీతమ్మ తన చెవులను తాను నమ్మలేనట్టు చూస్తూ కృష్ణుణ్ణి ఒళ్ళోకి తీసుకుంది కృష్ణుడు "అవున్నాయనమ్మా — ఈ మాట ఎవరి తోనూ చెప్పొద్దనీ ఒట్టువేసుకుని, తాతయ్య నన్నిక్కడ దింపి—కొత్తబట్టలు తెస్తానని వెళ్ళారుగా" అన్నాడు

సీతమ్మ మరింత విస్తుపోయినట్లు కోడలివేపు చూచింది' శారద ముసిముసి నవ్వుతూ—"అవునత్తయ్యా దూర్వాసులే అనుకున్న మామగారు కళ్ళనీళ్ళు పెట్టు కుంటూ, కిష్టుడు లేందే తాను బతకనని గడపమీద కూచుంటే నామనసు విలవిల లాడింది. మీ అబ్బాయి వచ్చి ఏమం టారోనని భయపడినా కూడా — కిష్టుణ్ణి పంపించాను మీ అబ్బాయి స్కూలు నుంచి వచ్చినప్పటినుంచీ నన్ను తిట్టి పోశారు" అంది

సీతమ్మ కేదో కొత్తలోకం తలుపులు తెరుచుకున్నట్లనపించింది గత రాత్రి కూడా తాను "ఈ పెద్ద పండుగ మళ్ళీ యేడు వచ్చేవరకూ ఉంటామో, ఊడ తామో ఒక్కసారి నా బిడ్డనూ, మను మణ్ణీ నా కళ్ళకు చూపించం"డని ఎంత బ్రతిమాలినా, పోరుకాడినా ససేమిరా అని ఒట్టువేసుకున్న తన్న భర్త, ఆ అపర దూర్వాసుడు ఎందు కిట్లా చేశారో నని ఆమె ఆశ్చర్యపడింది

క్షణం ఆలోచించి, చివాలున లేచి బైటికి వెళ్ళి చూచింది భూషయ్యగా రింకా గడపలోనే కూచ్చుని చుట్ట తాగు తున్నారు సీతమ్మ దగ్గరకంటా వెళ్ళి "ఏమండీ" అని సంతోష కంఠంతో పలకరించింది

ఆయన మామూలు ధోరణిలోనే సకి లించి, "నీ చిన్న కొడుకేమంటున్నాడు? మళ్ళీ ఆ ముష్టి పంతులు పనికే వెళ్ళి పోతానంటాడా?"అని అడిగాడు సీతమ్మ ఈ ధోరణికి మరింత విస్తుపోయి "వాడేమీ అనడంలేదు ఈ పట్టుదల తోనే అప్పుడూ వాణ్ణి ఎడంచేశారు మళ్ళీ అదే వాదనా? ఎక్కడో ఒకచోట సుఖంగావున్నారు మీ ఆస్తి కోసం వాళ్ళెన్నడూ ఏడవలేదు వాళ్ళనింకా అనడానికి మీ నోరెట్లా వస్తున్నది" అంది నిష్ఠూరంగా

భూషయ్య రివ్వునలేచి, పై పంచె ఛెళ్ళున దులుపుతూ "నా కోడలట్లా కడుపు మాడ్చుకుంటూ, ముప్పయ్యేళ్ళకే మలగబడిన తోటకూరకాడైపోతే నీ కళ్ళేం కనపడ్డంలా? నీ చిన్నకొడుకూ మనవడూ ముప్పూటలా తింటే నీకు అంతే చాలన్నమాట" అని గద్దించాడు

సీతమ్మకిది మరీ విచిత్రంగాతోచింది కళ్ళు పెద్దవిచేసుకుని భర్త ముఖంలోకి చూస్తూ"నా కోడలు అంత యాతనలో—"

అని ఏమో అడగబోయింది భూషయ్యే వణికే పెదవుల్ని బిగబట్టుకోవాలని వ్యర్థ ప్రయత్నం చేస్తూ "వాళ్ళయిరుగు పొరుగు సంసారుల నోటవింటే—నేను చేసిన పాపానికి నరకం కూడా చాలదని పించింది నీకేం తెలుసునే—నా కోడలు తాను గంజిత్రాగి నీ కొడుక్కు పాలూ నెయ్యీ మేపుతున్నదే మనల్ని చూడాలని పట్టుబట్టి ఎన్నిసార్లో నీ సుపుత్రుడి చేత తన్నులు తిందే'' అంటూనే తల మరోవైపు తిప్పుకుని, చిన్న పిల్లడిలాగా బావురుమన్నాడు

తన భర్త కన్నీరు పెట్టుకోవడమైనా ఎన్నడూ చూడని సీతమ్మ ఇది చూచే సరికి ఆగలేకపోయింది చకచకా రెండడుగులు వేసి భర్త వీపుమీద చేయివేసి నిమురుతూ ''మీరింత ఇదైపోతే నే బతకలేను...వాడు మీకంటే దుర్వాసుడై పోయాడుగావల్ను'' అంది

చిన్నకొడుకూ, కోడలూ ఎప్పుడు వచ్చి తన వెనుక నుంచున్నారో సీతమ్మకు తెలియదు. శారద "ఇంట్లోనూ బైటా వారినలా మారుపేరునపిలిచే గంగిరెత్తించారు నిజానికి మేం సుఖపడాలనేగదా ఆవేళ కోప్పడినా, ఈవేళ గద్దించినా'' అనేసరికి—భూషయ్యగారు కళ్ళు తుడుచుకుని, తలెత్తుతూ ''పరాయివాళ్ళ బిడ్డవు. నీకున్న మనసు నా కొడుక్కు లేకుండా పోయింది'' అన్నారు

ఆయన కళ్ళలో నీరుచూచిన జగం ''నాన్నా—నాన్నా" అని ఆవురుమంటూ వెళ్ళి తండ్రిని కావిలించుకున్నాడు భూషయ్యగారు కొడుకుని ఆవలికి నెట్టివేస్తూ—''ఒరేయ్ నన్ను తాకకు నా ఆస్తిలో నువ్వు భాగం పుచ్చుకునేదాకా నువ్వు నా కొడుకువే కాదురా—ఆఁ''అని బింకంగా అంటున్నారు

జగం ''అలాగే నాన్నా' మీ రేదిచ్చినా తీసుకుంటాను ఒక్కసారి నన్ను మన్నించా ననండి'' అంటూ కాళ్ళమీద పడబోయాడు భూషయ్యగారు వంగుతున్న కొడుకును రెండుచేతులా పైకెత్తి రొమ్ముకన ఆన్చుకున్నారు

సీతమ్మ జలజలాకారుతున్న కన్నీటిని, కొంగుతో తుడుచుకుంటూనే ఫక్కున నవ్వి ''మారుపేరు పెట్టమని ఒట్టేసుకున్నారుగా!'' అంది.

కిష్టుడు లగెత్తుకు వచ్చి తాతగారి మీదికి ఎగబ్రాకుతూ ''మా తాతయ్య దుర్వాసుడు కాదు—అశోకుడు" అనేశాడు.






తనలో

# సత్యాన్వేషణ



సత్యమే భగవంతుడు ఈ సత్యసాధనకు అర్పితం కావడమే జీవితలక్ష్యం ఈ లక్ష్యం లేకుండా జీవితంలో ఏ నియమాలనూ అనుసరించలేము మనోవాక్కాయ కర్మలన్నింటా సత్యాన్వేషణ గోచరించాలి

అయితే—'సత్యం' అనేదాన్ని నిర్ధారణ చేయడమెలాగనేది ప్రశ్న అన్ని అభిరుచులపట్లా ఆశను త్రెంచుకొని ఏకాగ్రత నలవరచుకొమ్మని భగవద్గీత చెబుతున్నది సాధనలో కూడా ఒకరికి సత్యంగా గోచరించేది మరొక్కరికి అసత్యంగా తోచవచ్చు అయితే—లక్ష్యసాధకుడిని ఈ విషయం కలవరపెట్టేదేమీ కాదు ఎందుకంటే—సత్యాన్వేషణలో ఎంతో తపోనిష్ఠ కష్టాలకు తట్టుకునే శక్తి ఒకప్పుడు ప్రాణత్యాగం కూడా అవసరం కావచ్చు స్వార్థచింతలేని ఈ అన్వేషణా క్రమంలో కలిగే బాధలు కలకాలం వుండేవి కావు తప్పుదారిన పడ్డాడో జారిపడ్తాడు అప్పుడు తెలుసుకొని సక్రమ మార్గానికొస్తాడు ఈ పద్ధతిలో ఓటమికి తావే లేదు మరింకూడా స్వర్గద్వారాలను తెరిపించే తాయెత్తుగా పనిచేస్తుంది సత్యమే దేవుడుగా అమూల్యంగా గోచరిస్తుంది నాకు అందరికీ అలాగే గోచరిస్తాడని కూడా భావిస్తాను

సత్యమే దేవుడనేది ధ్యేయం అయితే—అహింస, ప్రేమ అనే సాధనాల ద్వారానే ఈ విషయాన్ని గుర్తించగలం నిర్ధారణ చేసుకోగలం అహింసలేకుండా సత్యసాధన అసాధ్యం సత్యాహింసలకు దారి ఎంత సూటిగా వుంటుందో అంత ఇరుకుగా కూడా వుంటుంది ఏ మాత్రం కన్నుచెదరినా పరమపదసోపాన పటంలా అట్టడుగుకు రావాల్సిందే నిరంతరసాధన ద్వారా మాత్రమే సత్యాహింసలు అలవడతాయి

మహాత్మా గాంధీ

చంపకుండా వుండడమే అహింస అనిపించుకోదు. ఎంత పొరపాటు చేసిన వాడినైనా కోపగించుకోక — అతన్ని ప్రేమించగల ఓర్పును సాధించాలి. అలాగని అతని తప్పిదాలను సమర్థించమని అర్థంకాదు వాటిని ఖండిస్తూనే అతన్ని ప్రేమించగలగడం అలవర్చుకోవాలి తప్పులను ఖండిస్తున్నందుకు అతను పెట్టే ఇబ్బందులను కూడా తట్టుకోవాలి.

జీవహింస చేయకపోవడం కూడా అహింసయే అది అహింసకు చరమదశ అనవచ్చు. ఏ విధంగానైనా ఇతరులకు అపకారం తలపెట్టే ఆలోచన రావడం కూడా ఒక విధంగా హింస అని చెప్పవలసిందే.

అహింస జీవిత సాధనమైతే — సత్యమనేది గమ్యం. గమ్యాన్ని చేర్చేసాధనం సరియైనదైనప్పుడు, ఆ సాధనం ముందు వెనుకలుగా గమ్యాన్ని చేరుస్తుంది. అలాంటి సాధనపట్ల మన జాగ్రత్త అవసరం. బ్రహ్మచర్యం అవలంబించకుండా సత్యాహింసలను సమగ్రంగా సాధించలేం. బ్రహ్మను-అంటే సత్యాన్ని అన్వేషించే ప్రవర్తనే బ్రహ్మచర్యం అనిపించుకొంటుంది. మరో విధంగా చెప్పాలంటే సమస్త ఇంద్రియాలను నిగ్రహించగలగటమే బ్రహ్మచర్యం. సాధారణంగా బ్రహ్మచర్యం అంటే లైంగిక దృక్పథం నుంచే పరిశీలిస్తున్నారు. అది సరికాదు.

జిహ్వేంద్రియాలను వశపరచుకునే వారికి బ్రహ్మచర్యం అవలంబించటం చాలా తేలికని నా అనుభవం చెపుతున్నది శరీరం ఆరోగ్యంగా ఉండడానికీ, పనిచేయడానికీ ఆహారం అవసరమే. అయితే తినడమే వ్యసనంగా మారకూడదు. ఈ దృక్పథా న్ననుసరించి, ఉద్రేకపరచే పదార్థాలను మానేయాలి. అలాంటప్పుడు సరదాకోసం ఏర్పాటయ్యే విందుభోజనాలని విసర్జించవలసివస్తుంది నిజానికి భగవత్సృష్టిలోని యథార్థమైన భోజనం, సూర్యరశ్మికి పక్వమైన పదార్థాలు, చెట్టునపండిన పళ్ళేనని చెప్పుకోవాలి ఇతరులది అపహరించడమెంత తప్పో,తనది తాను అపహరించడం అంటే చాటుగా పనులు జరపడం అంత తప్పు సాధారణంగా తల్లిదండ్రులు తమవస్తువే అయినా పిల్లలచాటున తింటూంటారు. అదీ ఒక విధంగా దొంగతనమే. తనకు నిజంగా అవసరంలేని ఆ వస్తువును ఇతరులనుంచి పుచ్చుకోవడం కూడా దొంగతనమే ఈ రకమైన పనులనుండి దూరం కావడానికి ప్రయత్నించడంవల్ల మానవుడు తనలోని వాంఛలను క్రమంగా తగ్గించుకోవడానికి దోహదం చేస్తుంది. ప్రస్తుత ప్రపంచలో ఇంతటి దుర్భర దారిద్ర్యానికి కారణం ఈ నియమానికి భంగపాటు కలగడం వల్లనే. ఇతరుల

వస్తువులను తనవిగా చేసుకోవాలనే ఆలోచన కూడా అపహరణ క్రింద లెక్కే.

ఎలాగైతే తనకు అనవసరమైన వస్తువును స్వీకరించగూడదో, అలాగే తనకు అవసరంలేని వాటిని కలిగి వుండకూడదు. అవసరాన్ని మించిన ఆహార పదార్థాలను, బట్టలను, గృహోపకరణాలను కలిగివుండడంకూడా పై సూత్రానికి భంగపాటు కలిగించడమే కాగలదు ఉదాహరణకు కుర్చీ లేకుండా పని వెళ్ళగల దనుకొన్నప్పుడు దానిని కలిగి వుండడం అనవసరం. ఈ సూత్రాన్ని పాటించడంద్వారా మానవుడు అత్యంత సామాన్యమైన జీవితాన్ని గడపడానికి అభ్యున్నత మార్గాన సులువుగా పయనించ గలుగుతాడు.

దేవుడు ఈక్షణానికి అవసరమైన దానిని తప్ప రేపటి దానిని కూడా ఇవాళే నిలువ చేయడానికి దేనినీ సృష్టించడు. ఈ సృష్టిక్రమా న్ననుసరించి ప్రతివాడు తన కా క్షణాని కవసరమైనదాన్నే వాడుకొనేటట్లైతే ఇతరులకు దక్కకుండా పోయే పరిస్థితి ఉండదు అందరూ తృప్తిగానే జీవించడానికి వీలుంటుంది. సృష్టిక్రమా న్నర్థం చేసుకొనే ఆలోచన లేనప్పుడే ఈ బాధలన్నీ కలుగుతున్నాయి.

దివ్య జీవనానికి మనోధైర్యం ముఖ్యమైనదని భగవద్గీత 16వ అధ్యాయంలో చెప్పబడింది. మనోధైర్యం కలవాళ్ళే హరిని చేరగలరని వుంది. 'హరి' అంటే సత్యం అని తెలుసుకోవాలి

మన చుట్టూవున్న భయాలను వదిలించుకోవాలి. అయితే మన అంతశ్శత్రువులకు మాత్రం భయపడక తప్పదు పశుబలం వంటి కోపానికి మనం భయపడడం సహజం. అయితే వీటిని జయించిన వాటి ప్రభావం తగ్గిపోతుంది. సిరిసంపదలూ, కుటుంబం, శరీరంపట్ల ఆసక్తిని వదిలించుకుంటే మన హృదయంలో భయానికి చోటు ఉండదు విధి నిర్ణయా న్ననుసరించి ఏర్పడ్డ ఈ సృష్టివైచిత్ర్యాన్ని గమనిస్తూ ఆనందించ వచ్చు.

సృష్టిక్రమం దానంతట అది సత్యాన్ని వెల్లడిస్తుంది అసంపూర్ణ మానవులు దానిని సరిగా అర్థం చేసుకోనప్పుడు అది అసత్యంగానే గోచరిస్తుంది. అలాగే తన జాతివిశ్వాసాల లాగే ఇతర జాతుల విశ్వాసాలను కూడా గౌరవించాలి. ఈ సహనంవల్ల విభిన్నమైన విశ్వాసాలు దెబ్బతినకుండా పెంపొందే వీలుంది.

మనం అమిత ఓర్పుతో సత్యాన్ని వెల్లడించే ఈ సృష్టిక్రమాన్ని సరిగ్గా విశ్వసించి పురోగమించిననాడు ఇతరుల తప్పిదాలు మన దారిని మార్చలేవు.

మనలోని అహంకారాన్ని జయించిన నాడు మనకూ, భగవంతునికీ మధ్యనున్న అడ్డుగోడలు పడిపోతాయి ★



# మా వారితో బజారుకు

"కాంతమ్మగారు పుచ్చొంకాయలు తెచ్చిందని, నీళ్లుకలిపిన కిరసనాయిలు పోయించుకుందని మహాచెబుతారు మునిమాణిక్యంగారు ఈ మగాళ్లకు చేతయినట్టు'' అని విసుక్కుంటున్నది మా శారద, ఒకరోజు వాళ్లింటికెళ్లేటప్పటికి

"ఏం జరిగిందేమిటి?" అని అడిగాను

"ఏముంది! ఇవ్వాళ మా వారు బజారుకు

*నండగిరి ఇందిరాదేవి*

వేంచేశారు ఇల్లు పట్టినంత సామాను చేరవేశారు" అన్నది వెటకారంగా

"మంచిదేగా" అన్నాను, ఆమె వారిని మావారితో **మనసులో కంపేరు** చేసుకుంటూ.

"ఆ' మంచే'గడమంచె। మళ్లీ జన్మలో బజారెళ్లమని అనకుండాచేశారు'' అన్నది.

"అయినా ఇవ్వాళ ఆదివారం గదుటే।'' అన్నాను.

"అదే కొంప ముంచింది। ఆదివారం అన్నసంగతి ఓ స్నేహితుడు జ్ఞాపకం



చేసి ఆక్షనుకు వెడుతున్నానన్నాడు. పొర టుపాన 'మీరూ వెళ్లి ఒక సోఫాసెట్టు పట్టుకురండి' అన్నాను "అన్నది శారద.

"మరింకేం! పట్టుకొచ్చిఉంటారు" అన్నాను

"అయ్యో! రాత! సోఫాసెట్టు పట్టుకురావటంకాదు, ఆయనతో వెళ్లి ఓ ఎక్సుపార్టీ జడ్జిమెంటుచేసి వొచ్చారు వీళ్లను చూసి ఏడవాలో నవ్వాలో తెలియటంలేదు" అన్నది కాస్త చికాకుగా

"అసలు సంగతి చెప్పవేం?" అన్నాను, ఆక్షను హాలులో జడ్జిమెంటు చేయటం అర్ధంకాక

"వెళ్లారు ఆక్షనుకనే! ప్రొద్దుననగా వెళ్లినవారు టీ టైము దాటినా రాకపోతే ఎంతమంచి సెట్టు తెస్తున్నారో ఎన్ని హాల్సు తిరుగుతున్నారో, పాపం అనుకున్నాను

"మరి?"

"విను, చెపుతా ఆ పాత సెట్టు లోపల పడేయించి డ్రాయింగురూం అంతా సర్ది ఎదురుచూస్తుంటే ఇందాకనే వొచ్చారు 'లారీ మీద సామాను వస్తోంది! ఎక్కడ పెట్టిస్తావోమరి' అన్నారు ఇంతలో లారీ రానే వచ్చింది ఎదురాగా వెళ్ళిచూద్దునుగదా ఆసామాను ఏమిటో, ఎందుకు పనికివస్తుందో ఏమీ అంతు పట్టలేదు గడకొయ్యలు దేరా మేకులు, ఓ పెద్ద కాన్వాసు బట్ట, ఓ నాలుగు చినిగిపోయిన బ్లాంకెట్లు, రెండు స్వెట్టర్లు ఓకట్ట ఖాకీ పాంట్లు. పడేసి ఆ లారీ వెళ్ళిపోయింది. నాకు మతిపోయినట్టయి ఇదంతా ఏమిటి అన్నట్టు వారికేసిచూసి, 'ఆక్షనుకు వెడతానంటిరిగా' అన్నాను. 'అవును. ఆక్షనుకే వెళ్ళాను. ఇదిచూడు. టెంటు — అంటే దేరా — ఈ మేకులు పాతేస్తే ఒక సెకండులో రూం — గది — అదీ పోర్టబుల్ గది ఇక్కడంటే ఇక్కడ — అక్కడంటే అక్కడ...' అని అంటూంటే 'నా తల మీద అన్నాను' అడుతగిలి. 'అహ! నీ తలమీద అయితే కుదరదు — నలు చదరంగా ఉన్న నేల ఎక్కడుంటే అక్కడ రూం తయారవుతుంది పిక్నిక్కుకు వెళ్ళినా తీసికెళ్ళవచ్చు పిల్లలకు పడకగది — నాకు ఆఫీసుగది — నీకు వంట గది ..'అని గుక్కతిప్పుకోకుండావాదించే లాయరులాగ చెపుతుంటే చికాకుపుట్టి — 'ఆ చినిగిపోయిన బ్లాంకెట్లు, ఈ చిల్లులు పడ్డ స్వెట్టర్లు — ఈ మురికిపాంట్లు! అహహా! ఎంత బాగున్నాయి!' అన్నాను ఒళ్ళు మండిపోయి. అది వినిపించుకోకుండా 'అవి మిలిటరీ బ్లాంకెట్లు — బయట చస్తే దొరకవు అన్నీకలిపి చాలాచవకగా వచ్చేశాయి' అన్నారు ఏంచేస్తాం! అవన్నీ, కట్టకట్టి లంబరురూములో పడేయించాను. 'Law is nothing but common sense' అంటారు. కాని అది మినహాయించిందే 'లా' అనిపిస్తోంది వీరివాలకం చూస్తుంటే! నీట్ విస్కీ తాగినట్టు ఆ 'లా' మోతాదు

హద్దులుదాటి ఎక్కువ పడుతోంది వారికి'' అన్నది, ఆమె వారు బజారు వెళ్ళిన వైనం విశదంగా విపులీకరిస్తూ ఆమె చెప్పింది విని రోలు పోయి మద్దెలతో మొరపెట్టుకున్నట్లు ఉందనుకొని నవ్వుకున్నాను

''అసలు జరిగిందేమిటంటే ఆ స్నేహితుడు ఈయనగారిని మిలిటరీ ఆక్షనుకు తీసికెళ్లి చవకగా పోతున్నాయి కొనమని అనివుంటాడు రెండు వాదాలు వినటానికి అలవాటు పడినవారు అది ఖండించటానికి ఎవరూ లేకపొయ్యేటప్పటికి ఎక్సుపార్టీ జడ్జిమెంటు చేసినట్టు ఆ కచరా అంతా కొనేశారు'' అన్నది శారద నిట్టూరుస్తూ

ఈ స్నేహితుడి సంగతి ఇట్లావుంటే మాకు ఇంకో స్నేహితుడున్నాడు ఆయన లాయరుగాని, జడ్జికాని కాదు కాబట్టి కాస్త ఇంటిపనుల మీద శ్రద్ధ కలిగిన మనిషి. అదీ విపరీతమే అనుకోండి' భార్య తెచ్చేవన్నీ అతి ప్రియంగా తెస్తుందని ఆయన కొాక అపోహ! తనే శ్రమపడి బజారెళ్ళి ఒక్కొక్క దుకాణంలో గంట అయినా తెమలక ఉన్న గట్టాలన్ని దింపించి డజన్ల లెక్కన గ్రోసుల లెక్కన బేరం చేస్తాడు. ఆ షాపువాడు ఎన్నిగట్టాలు కొంటారోనని తమ ఫైల్సులో ఉన్న ధరలను రిఫరు చేసి చెపుతుంటారు వినుక్కోకుండా చివరకు ఆయన కొనేవి పావు డజను (మూడు అని అననే అనడు) బనియన్లో, ఓ గజం తువాల తుంపో, లేక



"భోంచేసేటప్పుడు చేతులు ఎందుకు కడుక్కోవాలమ్మా?"
"చేతుల కుండే మురికి పోవడానికి బాబూ."
"ఆ ముకికున్న చోట పొడరు రాసేసుకుంటే చాలుకదమ్మా సీలాగ."

ఓ పావు పౌండు బిస్కట్లతోనో బయట పడతాడు. అదీ వాళ్లమీద జాలేస్తే. లేకపోతే మీ ధరలు గిట్టటం లేదు అన్న ముక్క చిరునవ్వుతో అనేసి జారు కుంటాడు

అసలు బజారెళ్ళటం, కావలిసినవి కొనుక్కోటం కూడా ఒక కళ గమనించారో లేదో' మా స్నేహితురాలి భర్తలాగా చేతులో డబ్బుండగానే కనపడ్డదేదో కొనుక్కు రాకుండా మనకేం కావాలి అని నిర్ణయించుకొని ఇతరుల దగ్గరచూసి ధర అదీ కనుక్కొని వెళ్ళాలి అట్లాకాకుండా ఎంత ధర ఎక్కువ పెడితే అంతమంచి దనుకునే కొందరికి నిజంగానే తాటాకులు కట్టి పంపిస్తారు షాపువాళ్ళు

ఇహ మా వారు బజారెళ్ళటం సంగతి చెపితినా ఓ కథయి కూచుంటుంది వారికి

ఈ గొడవలన్నీ తెలియక పోవటమే కాక, కొంత ధైర్యము లేకపోవటం, కొంత తప్పించుకునే తత్వం రెండూ కలిసి వస్తున్నాయి సరే ఇప్పుడంటే ట్రాన్సు ఫరయింది కాని ఇక్కడున్నప్పుడన్నా బజారులో కనబడ్డ మామూలు పళ్ళు కాని, తమలపాకులు కాని తీసుకురావటం అల వాటేలేదు ఒక రోజు తెస్తేట — నాకు అలవాటయి రోజూ తెమ్మంటానట అదీ వారి భయం ' కూపస్థమండూకం లాగా కేవలం ఆఫీసులో కూచుని ఆర్డర్లు పడేయటం, జడ్జిమెంట్లు రాయటం తప్ప ఇంకేమీ తెలియని వారికి ట్రాన్సుఫరు అవుతే పాపం ఎట్లావుంటారోనని దిగు లయింది అయినా మన చేతిలో మాట కనుకనా ' పోనీ ఒంటరిగా ఉంటే నలుగురితో అవసరంపడి కాస్త ప్రపంచ జ్ఞానం (అంతమాట అనగూడదుకాని) అలవడుతుందని సరిపెట్టుకున్నాను వారు వెళ్లాక ఎట్లా ఉన్నారో ఏమోనని ఒకసారి పిల్లలకు సెలవులు వచ్చినప్పుడు మా అమ్మ దగ్గర వాళ్ళను వదిలేసి వెళ్ళాను వారి ఊరికి అక్కడపోయి చూద్దును గదా ఘనంగా వుంది వ్యవహారం' వండటానికి, వడ్డించటానికి, చేతులు కడిగించటానికి, తువా లందించటానికి, మనుషలే మనుషులు దొరగారి నోటినుంచి ఏం ముత్యాలు రాలుతయో నని కాచుకు కూచునే వాళ్ళను చూసి నేను లేకుండా వారికి గడవదన్న నా అభిమానం కాస్త దెబ్బతిన్నది. ఒకరోజు ఉదయం వంట వాడు రావటం ఆలస్యం అయ్యేసరికి పోనీ పెట్టేద్దామని కిందికివచ్చి చూస్తే స్టవు అంటించటానికి అగ్గిపెట్టె కనపడలేదు. అక్కడున్న ప్యూనును అడిగితే —

"వంట బాబుగారు ఇండెంటు రాయ లేదు" అన్నాడు

"అగ్గిపెట్టెకు ఇండెంటేమిటి?" అన్నాను

"ఆఫీసు ప్రొసీజరు" అన్నాడు

సరేలే, ఏడిసినట్టే ఉందనుకొని ఓ అణా యిచ్చి పంపాను టీ పెట్టాక వెళ్ళిచూస్తే వారి టేబులుమీద పర్సనలు ఫైల్సు ఓ బుట్టనిండా ఉన్నాయి ఇండెట్లు, బిల్లులు, వోచర్లు, దొరవారి చాకలి పద్దు, దొరవారి ఇంటిలెక్క, అణాపయిసలతో వ్రాసిఉంది, ఆడిట్ ఇన్స్పెక్షనుకు సిద్ధంగా. ఇంకేం' బజా రెళ్ళాల్సిన అవసరం, నలుగురితో మాట్లాడవలసిన అవసరం కలిగి మనిషి కాస్త మారుతారని నేననుకుంటూ వుంటే ఇల్లుకూడా ఆఫీసుకింద తయారయి, లేనిదో లెక్కచూసి చెడు అలవాటు నేర్పి పంపుతున్నారు వీళ్ళు అనిపిం చింది సరే ఆ కాగితాలు చూస్తుంటే, "దొరవారి బనియన్లు చినిగి పోయినవి. ఒక అరడజను బనియన్లకు మంజూరు ఇప్పించవలసింది" అని వ్రాసిఉంది 'సరే' నన్న ఓ సంతకం బహుశా అకౌంటెంటుది అయి వుంటుంది.

ఇంతలో వారు స్నానం చేసి వచ్చేవరకు బట్టలన్నింటితోపాటు కొన్ని చేతులున్నవి, కొన్ని చేతులులేనివి బనియన్లు పెట్టి ఉన్నాయి. ఒకటి వేసుకొని చూశారు పొట్టిపొట్టిగా పొట్టమీదికి పోయింది అది తొడుక్కొని దర్జాగా అద్దంముందు నిలబడ్డారు "సరిపోనట్టు ఉందికదూ?" అన్నారు, కొంగుచాటున నవ్వుకుంటున్న నన్నుచూసి "ముక్కుకు చీమిడి, మురికిచెడ్డి ఉంటే చక్కగా మొద్దబ్బాయిలాగా ఉంటారు" అన్నాను రెండోది వేసుకుంటే అది ఇద్దరికీ సరిపోను ఉంది పాపం వాళ్ళు బనియన్లంటే తెస్తారుకాని సైజెట్లా తెలుస్తుంది "ఇదంతా ఏం ఖర్మ, హాయిగా బజారెళ్ళి సరిగ్గా సైజుచూసి కొనుక్కోకూడదూ?" అన్నాను "ఆ, సైము లేదు" అంటారు

అదీ అయిందిలెండి, ఒకసారి పోరగా పోరగా బజారెళ్లారు సాక్సు కొనుక్కుందామని వెళ్ళక వెళ్ళక వెళ్ళి కొనుక్కోకుండానే తిరిగి వచ్చారు ఎందుకూ అంటే అంటారుగదా, "వాడు నన్ను మోసం చేయాలని చూశాడు తక్కువ రకమువి కూడా రూపాయిన్నర అన్నాడు నాకు తెలియదనుకొని అసలు సాక్సు ధర రెండణాలు" అన్నారు నాకు ఫక్కున నవ్వొచ్చింది "ఏం, నవ్వుతా వెందుకూ, రెండు రూపాయిలకు బూట్లు, రెండణాలకు సాక్సు, చిన్నప్పుడు ఎన్నో జతలు కొన్నాను" అన్నారు తన స్టేటుమెంటు




"ఈ వర్షం చూస్తే భయంగా ఉందోయ్. మా ఆవిడ ఏవో కొనుక్కోడానికి బజారుకెళ్లింది."
"ఫరవాలేదులేవోయ్, వర్షం అంత ఎక్కువగా, వుంటే వెలిసేదాకా ఏ షాపులోనో ఆగుతుందిలే"
"బాబోయ్! షాపులో ఆగిందంటే నా కొంప గుండం చెయ్యదూ!"

---

సరియయింది అన్నట్టు. "ఇంకా నయం! వాడితో ఆ మాట అన్నారు కాదు. 'ఏ యుగంలో వున్నావు నాయినా!' అని అడిగేవాడు" అన్నాను మరిట, ఒకాయన చాలా రోజులకిందట తపస్సుకు కూర్చున్నాడట ఏళ్ళు గడిచిపొయ్యే వరకు, అతని చుట్టూ పుట్టలు పెరిగిపొయ్యాయట మొన్న ఎప్పుడో ఆ పుట్టలో ఏదో కదిలినట్టవుతే త్రవ్వి చూశారట అందులోంచి గడ్డాలు మీసాలు పెరిగిపోయిన ఆ ఒకాయన కళ్ళు నులుముకుంటూ లేచి, "శ్రీ రాములవారు అడివినుంచి తిరిగి వొచ్చారా?" అని అడిగాడట అట్లావుంది మావారి బజారు ఇన్ఫర్మేషను

తామొక్కరూ వెడితే అదీ సంగతి.. కూడా వస్తారా అంటే సాధారణంగా

రానేరారు ఆ'లా' అనే జలస్ మిస్ట్రెస్ రానియ్యదు కాని ఒక్కసారి వచ్చారు బాబూ. ఆ అనుభవం కల్లోకూడా మరచి పోననుకోండి. తప్పికూడా వారిని బజారుకు తీసుకెళ్ళ గూడదని లెంపలు వాయించుకున్నానంటే నమ్మండి' అసలు ఏమయిందంటే—ఏదో పండుగొచ్చింది తల్చుకుంటే నవ్వొస్తుందికాని ఆరోజు నేను పడ్డ యాతన ఇంతా అంతా గాదు. అయితే పండుగకు పిల్లలకు ఏమన్నా బట్టలు కొందామని రమ్మన్నాను మొదట ఆ—ఊ—అన్నారు కాని మొండి కేసేవరకు దేవుడా అని కార్లో కూర్చున్నారు దొరవారిని ఇంత సాగదీసే వరకు కాస్త చీకటికూడా పడింది దుకాణందగ్గర దిగమంటే, "ఆ మనుష్యులు, ఆ మర్యాదలు, ఆ నమస్కారముల నుండి రక్షించుదూ—కాస్త ప్రశాంతంగా కూచోనీ—'' అని ఓ చెట్టు కింద దుకాణానికి పది గజాల దూరంలో కారు పార్కు చేసుకొని కూర్చున్నారు ఎంత తొందరపడ్డా దుకాణంలో నుంచి గంట రెండుగంటల దాకా తెమలలేక పోయ్యాను తీసుకున్న బట్టలన్నీ పాకింగు చేస్తుంటే ఆ షాపు మానేజరు ట్రేలో టీ తెచ్చి ఇంకో కప్పు కలిపి, "మేంసాబ్ డ్రైవరుకు దేకేఆతా'' అని అక్కడున్న కుర్రాణ్ణి కేకేశాడు ఆ మాట వినేసరికి నాకు ముచ్చెమటలు పోసినయి 'కార్లో కూర్చున్నది డ్రైవరు కాదు ఈ బిల్లు చెల్లించే యజమాని' అని అతనితో చెప్పటానికి అభిమాన మనిపించింది. నాతో పాటు దిగమంటే దిగనందుకు వారిమీద, తెలియక అనుకున్నా అంత మనిషిని పట్టుకొని డ్రైవరంటున్నాడని అతనిమీద కోపం కట్టలు తెంచుకుంది అయినా అదంతా దిగమింగి, "ఆ! డ్రైవరు కెందుకు! అక్కరలేదు'' అన్నాను తడబడుతూ అతడు ఇంకా అతివినయం చూపుతూ, "కుచ్‌పర్వానహీ, బిచారా ఉస్కూబీ పీనేదీజీయే!'' అంటూ మళ్లీ ఆ కుర్రాణ్ణి కేకేశాడు. డ్రైవరు టీ తాగడంటే కూడా వినిపించుకోకుండా! ఏం చేయను! నాకు పై ప్రాణాలు పైన ఎగిరి పోతున్నాయి! కప్పు పట్టుకొని యముడి లాగా నిలబడ్డ ఆ కుర్రాణ్ణి చూస్తుంటే! "నీబొంద! వద్దంటే ఊరుకోరాదు! '' అని మనసులో తిట్టుకొని, చివరకు గట్టిగా,"ఆడ్రైవరుకు డయాబిటీసుఉంది. చక్కెర వేసిన టీ తాగడు'' అని నెత్తి నోరు కొట్టుకొని చెప్పేదాక వదల్లేదు. ఇంత అవస్థ నేను పడుతుంటే,'' దయగల మేంసాబు,'' అని కాంప్లిమెంటు పడేశాడు రక్షించావులే అనుకోని ఆ పాకెట్ నేనే మోసుకొచ్చి కార్లోపడ్డాను. ఇట్లా నా ప్రాణం సగం కొరుక్కుతిని కుట్టిన తేలు గుణవంతురాలు లాగా కార్లో హాయిగా ఆలోచిస్తూ కూర్చున్నారువారు

మనవాళ్ళంటారే సామెత—వెళ్ళితే బ్రహ్మహత్య. వెళ్ళకపోతే గోహత్య లాగా వుంటుంది వీళ్ళ బజారెళ్ళటం. ★

# ఆహార నియమాలు

ఆరోగ్యం కాపాడుకోటానికి సమగ్ర ఆహారం తీసుకోవటమే కాక ఆరోగ్య నియమాలు పాటించటం కూడా అవసరం

ఆహారం నియమిత కాలాల్లో మాత్రమే తీసుకోవాలి ఎప్పుడు పడితే అప్పుడు తీసుకోగూడదు మధ్య కాలంలో తీసుకోగూడదు తిన్న ఆహారం అరిగిన తర్వాత గర్భకోశానికి కొంత విశ్రాంతి ఇవ్వాలి అలా ఇవ్వకపోతే పని ఎక్కువై అది చెడుతుంది

ఈ నియమితకాలం మార్చాలంటే ఆ పని క్రమ క్రమేణా చెయ్యాలి అకస్మాత్తుగా చేస్తే చెడు సంభవిస్తుంది ఆహారంలో మార్పు కూడా ఇదే విధంగా జరగాలి

వయస్సుకీ ఎత్తుకీ తగిన బరువు వుండేటట్టు చూసే ఆహారం మంచి ఆహారం క్రింద లెక్క అంతకంటే ఎక్కువ ఆహారం హానికరమే మనం తినవలసింది ఖరీదైన ఆహారం కాదు ఆరోగ్యకరమైన ఆహారం ఇటువంటి ఆహారం తినకపోవటం వల్లనే అనేక రోగాలు సంభవించటానికి అవకాశం ఏర్పడుతూ వుంది



మానవుడి ఆరోగ్యాన్ని నిర్ణయించేది ఆహారం గాని శీతోష్ణస్థితి కాదు

ఆధ్యాత్మిక సాధన చెయ్యాలనుకున్న వారికి ఈ విషయాలు కూడా కొంతవరకు తెలిసివుండాలి ఆహారం చౌకదిగానూ సమగ్ర స్వభావం కలదిగానూ వున్నప్పుడే దానివల్ల వచ్చే లాభాలను ప్రతి వారూ పొందగలుగుతారు

ఖరీదైన ఆహారం లివర్ జబ్బులకూ మూత్ర కోశం జబ్బులకూ కారణభూతం అవుతుంది సరైన ఆహారం మనిషికి ఎక్కువ పనిని చెయ్యగలిగిన సత్తువనీ పుష్టినీ ఇచ్చి అతను సక్రమంగా వృద్ధి పొందటానికి సహాయపడుతుంది

నీ ఆహార పదార్థాలను బట్టి నీ భవిష్యత్తు నిర్ణయించబడుతుంది భౌతిక

స్వామి శివానంద

రోగాలకే కాక అనేక మానసిక రోగాలకు కూడా ఆహారమే కారణం

అన్నిటిలోకీ సాత్విక ఆహారం మంచిది. ఈ ఆహారం మనిషిని నిగ్రహపరుణ్ణిగా చేస్తుంది ప్రశాంతచిత్తుని చేస్తుంది. రాజసాహారం మానవుణ్ణి ఆవేశపరుణ్ణిగానూ, కోపోద్రిక్తునిగానూ చేస్తుంది ఇక తామసాహారం సంగతి చెప్పనవసరం లేదు దానివల్ల జడుడూ, సోమరిపోతూ తయారవుతాడు

ఇటీవల మనిషి కడుపునే కైలాసంగా చేసుకుంటున్నాడు ఇది తప్పు ఈ పద్ధతి మరణాన్ని కొని తెచ్చుకొంటుంది దీనివల్ల శరీర అవయవాలన్నీ శిథిలమైపోతవి.

శరీరం అనే యంత్రం పనిచెయ్యగలందులకు అవుసరమైన బొగ్గుగా మాత్రమే వుండాలి, మానవుని ఆహారం సరిపడని ఆహారం విషద్రవాలను శరీరంలో సృష్టిస్తుంది తెలుపు చెయ్యబడిన పంచదారా, తెలుపుచెయ్యబడిన పిండీ, బియ్యం, వేపుడు కూరలూ, అన్నిరకాల తిరగమోతలూ, శరీరానికి సరిపడని ఆహారాలు

ఎక్కువ ఉప్పువల్ల కంపరం పుడుతుంది. జిహ్వాకు చాపల్యం పుట్టిస్తుంది మరణాన్ని దగ్గరకు తెస్తుంది మామూలు ఉప్పుకంటే కాయలవల్ల తయారయ్యే ఉప్పు మంచిది. అది శరీరానికి హాని చెయ్యదు

ఆరోగ్యంగా వుండదలచిన వారికి, ఎక్కువకాలం బ్రతకదలచిన వారికి పండ్లూ, పాలూ ఎక్కువగా వాడటం మంచిది ఉప్పూ, చింతపండూ, మిరపకాయలూ, మాంసాదులూ, పుగాకూ, కాఫీ మొదలైనవి వాడకుండా టొమేటో రసం, నారింజరసం మొదలైన పండ్లరసాలను వాడాలి ఉదయం, చిరుతిండిని మానుకొని ఆహారం తీసుకోవడం మంచిది. రాత్రి పాలూ పండ్లూ తీసుకోవటం మంచిది వొట్టి పండ్లయినా సరే

కారెట్స్, గింజలూ మొదలైన పదార్థాలలో శరీరానికి కావలసిన విటమిన్లన్నీ వున్నాయి తక్కువ పరిణామంలోవుండి ఇవి సమగ్రమైన ఆహారం అందువల్ల కడుపును మొయ్యలేని స్థితికి తీసుకురాకుండా శరీరానికి అవుసరమైన ఆహారం తీసుకోటానికి వీలవుతుంది అందువల్ల ఆరోగ్యం, జీవితానందం ప్రతి మనిషికీ లభ్యమౌతుంది

శరీరానికి మంచి శిక్షణ ఇస్తే మామూలు రొట్టే, పప్పునుంచే దానికి అవుసరమైన శక్తులను పోగుజేసుకునే టట్లు చెయ్యవచ్చు శరీరం ఎటువంటి ముతక పదార్థాన్నయినా తిని జీర్ణించుకోగలదు దానికి అందుకు తగిన శిక్షణ ఇవ్వాలి ★



# రంగికాడు

జీవితంలో ఆశయాలూ, హద్దులూ అతనికి లేవు. అవంటే అతనికి అర్థంకూడా తెలియదు

''అతనికి'' అని నే నుపయోగించి, గౌరవమయిన స్థానం ఇచ్చి నన్ను నేను అగౌరవ పరుచుకోవటం ఇష్టం లేదు.

వాడికి —

రంగిమీద వున్న ప్రేమ — కాదు కాదు ఇష్టం, ఇవన్నీ పెద్దమాటలతో వర్ణించడం చేతకాదు.

ఆ భావాన్ని వర్ణించడం కూడా చేత కాదు.

చిన్న హృదయం...చిన్న రూపం

వాడు మరుగుజ్జు రంగడు.

ఈ ఉపోద్ఘాతం ఇంతకన్నా మించితే వాడు పొడుగై పోతాడు. మరీ పొట్టిదైతే బాధపడతాడు.

* * *

''నాయకీ నాయకుల విరహం''...

— ''వివాహం.''

''శుభం...''

సినిమా వదిలారు. గట్టిగా ఆవులించాడు. గేటుకాడ రంగడు పైక్లాస్సు నుంచి, అందమైన జంట వస్తున్నారు కిలకిల నవ్వులతో — రెప్ప వాల్చకుండా చూశాడు.

— వెళ్ళిపోయారు.

మనస్సు కాసేపు కరకర ఈర్ష్య పడింది కడుపులో పేగులు ఒకసారి యేడ్చి నిద్రపోయాయి.

కాళ్ళను చకచకా మర్రిచెట్టు ధగ్గరకు కదిపాడు.

గుడ్డి దీపం ముందు నిద్రతో జోగుతున్నాడు బజ్జీల జోగయ్య.

కుక్క ఒకటి సానుభూతిగా ఆవులించి బజ్జీ నోట కరుచుకు పోయింది.

''జోగీ—జోగీ...''

విసుగుతో తట్టాడు రంగయ్య.

# నన్నన్యాయం చేసిందా?

**కె. హరీష్**



''యేంద్రా పోట్టోడా - సినిమా వదిలేసిన్రా ?''

—విసుక్కున్నాడు జోగి మంచి నిద్ర సడలినందుకు. –

''ఛీ - యెధవబేరం - సాయంత్రం నుంచీ పావలా అమ్మితే ఒట్టు - పాలు కాగి కాగి మరిగిపోయాయి''—

నాలుగు బజ్జీలుతీసి చేతిలో పెట్టాడు.

వాటిమీద విశ్రాంతిగా నిద్రపోతున్న ఈగలు విసుక్కుంటూ లేచి వెళ్ళాయి.

''మావా''

''ఊ—'' విసుగ్గా ఫోజుపెట్టాడు టీ కలుపుతున్న జోగి.

''ఒక ముచ్చట సెబుదామనుకున్న - నిన్ను సూత్తుంటేనే భయమేత్తుండాది''

''సెప్పేదేదో సెప్పేడువ్ - నే తొందరగా పోవాలి.''

—చెవిలో సగంకాల్చి దాచుకున్న బీడీతీసి రంగడి చేతిలోకి విసురుతూ —

''టీ బ్రహ్మాండంగాఉంది''—కాస్త జోగిని మెత్త బరుద్దామని.........

''మావా - మంచి అవసరమొచ్చింది. ఒక అయిదు రూపాయలు, అప్పుకావాలి. ఆ బీడీ కంపెనోళ్ళు, బోర్డులు మోసినందుకు పైసలింకా ఇవ్వలేదు''

''బాగుంది—బేరంలేక నే నేడుత్తుంటే...ఆ ఖాతా పైసలు ఒదిలియ్యి'' పొయ్యి చల్లార్పి గోనెపట్టా పరిచాడు జోగి—నిద్రపోటానికి.

బీడీ ముట్టించాడు రంగడు.

వేడి వంటిని నింపుతుంది.

వెన్నెల చలిని రేపుతుంది.

భారంగానడిచాడు రంగడు గుడిసె వైపు.

* * *

పంచభూతాలకూ పూరిళ్ళంటే ప్రేమా, బీదలంటే ఆదరమూ—గోనె పట్టాలోదూరి పై కప్పునుంచి తొంగి చూసే చంద్రుడ్ని ఒక్కసారి తిట్టాడు రంగడు.

తనకి నిద్రపట్టక పోవడానికి ప్రథమ కారకుడు.

చల్లని గాలిలో ప్రక్కనున్న మురుగు కాల్వ వాసన ఒక్కసారి గుప్పుమంది—

—పోయింది.

— సినిమాలో డ్యాన్సు సీనూ—ఆరడుగుల పొడుగున ఉన్న విలనూ—బాక్సులో కూర్చొన్న అందమైన అమ్మాయీ — తొంగిచూస్తున్న చందమామయ్యా'

'డిస్టర్బింగ్ ఫ్యాక్టర్స్'

చిరిగి పోయిన దిండును ప్రక్కన పెట్టుకుని చెయ్యి వేసాడు.

రంగి నడుములా మెత్తగా తగిలింది — అని అనుకున్నాడు.

అనుభవించిన వేడినెత్తురు ఒక్కసారి ఒత్తుగా పారింది.

బుద్ధి కర్తవ్యాన్ని ఒక్కసారి గుర్తు చేసింది.

తను చీరె తేందే దానిముఖం చూడనని ప్రతిన చేసాడు. కొంటే ... మంచి చీరే కొనాలి ... సిల్కు చీరె. ఆ చీరెలో తన ప్రేమనంతా పొట్లం కట్టి యివ్వాలి.

* * *

పూర్తి వివరాలు తెలియని ఈ హీరోని గురించి మిమ్మల్ని ఇక విసిగించను.

నిద్రపట్టక దొర్లుతున్న అతను కాస్సేపటికి నిద్రపోయాడనుకోండి. చీరె ''యెట్టా'' కొనాలో తెలియక ఆవేదన పడుతున్న అతని మనసుకు త్రోవ దొరికింది అనుకోండి.

అనుకుని సంతృప్తిపడే ఓపిక లేకపోతే అది ఈ కథలోని ''తుక్కు సస్పెన్స్'' అనుకోండి.

అనుకున్నారా? ఇక హీరోని గురించి చెప్తాను—కథా నాయకుడు అంటే హీరో మరుగుజ్జు, ముప్పై అయిదు సంవత్సరాల మనిషి కాదు. నాలుగడుగుల మనిషి.

అతనికి ఒక వృత్తి లేదు. ఒకవేళ వుంటే నాకు తెలియదు.

అతనికి విచిత్రంగా రంగులు పూసి— మనిషి చుట్టూ బోర్డులు తగిలించి — ప్రచారానికి బజారులో ఊరేగిస్తూ వుంటారు,. టీడీకంపెనీవాళ్ళూ — స్టంట్ పిక్చర్లవాళ్లూ. అంతేకాక అతను సినిమాహాల్లో కుర్చీలగేటువద్ద టిక్కట్లు వసూలు చేస్తుంటాడు.

బస్సుస్టాండులో పెట్టెలు మోస్తాడు—

ఇవేమీ చేయకపోతే అడుక్కుంటూ వుంటాడు—

అతను రోడ్లమీద జనానికి ఒక 'హాబీ'.

రోడ్డు మధ్య అతను పోతుంటే అటూ ఇటూపోయే జనం ఆ విచిత్ర సృష్టిని వింతగా చూస్తూ వుంటారు.

హాస్య ప్రియులు ఛలోక్తులు విసురుతుంటారు — అతని మీద.

వేదాంతులు 'ఔరా! భగవంతుడు లీలామయుడు'—అని ముక్కుమీద వేలు వేసుకుంటారు.

అందరికీ విచిత్రంగా కన్పిస్తుండబట్టే, తిండిలేని రోజు అడుక్కున్నా పొట్టకిసరిపడ డబ్బులు పడతాయి అతనికి.

ప్రక్కన రెండుకళ్ళూ పోయిన గుడ్డివాడున్నా — విచిత్రంగా కనిపించే మరుగుజ్జుకు ముందు డబ్బులు వేస్తారు.

ప్రతి మనిషికీ ఇతనిని చూస్తే తాత్కాలికమైన 'సుపీరియారిటీ'.

కాని మరుగుజ్జుకు మనస్సువుంది — అతని కోర్కెలు ముప్ఫైఅయిదు సంవత్సరాల వయస్సుకు దాస్యం చేస్తున్నయ్.

అతనూ సినిమాతారలను ప్రేమిస్తాడు.

అందమైన వాళ్ళను చూసి మనస్సుపడతాడు.

తనను అందరూ విచిత్రమైన జంతువులా చూస్తూంటే యేడ్చాడు.

"భగవంతుడు తన నిట్లా శపించాడు.. దొంగ వెధవ, వాడసలులేడు...'' అనుకుంటాడు.

''ప్రపంచంలో ప్రతి మనిషికీ ఒక భార్య – అది వో జన్మహక్కు...ఆఖరికి ముక్కు పూర్తిగాలేని రిక్షా లచ్చిగాడికి కూడా వొక భార్యవుంది"

కాని, తనకు లేదు. భగవంతుడు కరుణామయుడు.—

ఆ మాట 'బావా' అని రంగి నోరారా పిల్చిననాడు తోచింది.

నల్లగాఉండే రంగికి – నవ్వితే బుగ్గలు వుబ్బినా ముఖంమీద స్ఫోటకం మచ్చలు పూడవు—

జాలిపడింది మరుగుజ్జును చూసి.

దిక్కులేని రంగిని తన దానిని చేసు



"ఏరా, పెళ్ళైందిగా, ఇంకా విచారం ఎందుకు?"
"విచారం అంతా అందుకేరా".

కుని మగదిక్కు అవుదామనుకున్నాడు మరుగుజ్జు.

ఆమాటవిని పక్కున నవ్వింది రంగి. ఆడిచ్చిన రెండు రూపాయలూ కొంగున ముడేసుకుంటూ.

యెందుకు నవ్వింది అని యెర్రిముఖమేసాడు రంగడు

ఒంగి గట్టిగా ముద్దుపెట్టుకుంది.

"దేము దన్యాయం, సెయ్యలేదు... నాకూ అంద సూపించాడు," అనుకున్నాడు రంగడు ఆనాడు ఆమె వొళ్ళో వొదిగిపోతూ.

*  *  *

రాత్రి రంగడికి ఆలోచనలతో నిద్రే లేదు. తెల్లవారి ఒక కునుకు తీసాడ్దేమో ఆలస్యంగా లేచాడు నిద్రనుంచి.

గబగబా పోయి జోగిదగ్గర రెండి డ్డెన్లు తిని ఆలోచించాడు—చీరెకు సరిపడే డబ్బెక్కడ దొరుకుతుందా అని.

'యెట్లేదన్నా, స్టేషనుకాడ పాత బట్టలమ్మే గురవయ్యకాడ కొనాలన్నా, అయిదు రూపాయ లవుతుంది,?'

కాల్చిన మూడు బీడీల రవ్వలు మెదడును మేల్కొల్పాయి.

జోగిదగ్గర చేతిసంచి అరువు తీసుకుని బయల్దేరాడు. "బిచ్చాలు – ఆడి భార్య ఈ వేళప్పుడు ఇంటిపట్టున వుండరు. యెక్కడో తాపీపనికి పోతారు –"

పరిచయమైన ఇల్లు—బయట తాటాకుల దడి—త్రోసుకుని లోపలికి వెళ్లాడు, కోళ్ళగూడుదగ్గరకు వెళ్ళాడు.

ఊపిరి బిగబట్టాడు.

మెల్లగా రెండుకోళ్ళను తీసి కాళ్ళకు తాడుకట్టి సంచిలోవేసి మూతి బిగించి నడిచాడు మార్కెట్వైపు.

*  *  *

సిల్కుచీరె తీసుకుని నాణ్యం పరిశీలించాడు రంగడు.

చిరుగులు కన్పించకుండా చక్కగా మాసికలు వేసి వున్నాయి. పాతబట్టల గురవయ్యకు మూడు రూపాయలు చెల్లించి బయటపడ్డాడు.

ఒక సబ్బూ – గడ్డ పవుడరూ – ఒక చెండు మల్లెపూలు — కాకా హోటల్లో మిగిలిన ముప్పావలాతో సుష్టిగా చపాతీ తిని రంగి ఇంటికి బయిల్దేరాడు.

చంద్రుడు సౌందర్య పోటీలో నిఅందాల రాణిలా – అందాన్ని విరజిమ్మటానికి ఆరాట పడుతున్నాడు.

వెనుకవున్న యెలక్ట్రిక్ దీపపు కాంతికి తన నీడ పొడుగ్గా కనిపించింది రంగడికి. మనస్సు చెప్పలేని ఆనందపు టంచులను తాకింది – మేడలు కడుతున్న ఊహలలో నడిచాడు రంగడు.

"...ఈపాటికి రంగి నిద్రపోతూ వుంటుంది – తను తలుపు తడతాడు. చీరె అరుగు ప్రక్కన దాచి నిలబడుతాడు– నిద్రమత్తు వదలక కళ్ళు నులుముకుంటున్న రంగి ముందు...

"చీరె తేలేదే ?" అని కోప్పడుతుంది

"ముద్దిత్తే"— అంటాడు తను.

పెదాలు తడుపుకున్నాడు రంగడు నడుస్తూనే.

*  *  *

గుడిసెలో దీపం సన్నగా వెలుగుతూ వుంది.

అతన్ని చూసి దూరాన కుక్క మొరిగింది.

ప్రేమతో నిండిన మనస్సుతో "రంగమ్మా"? అని ముద్దుగా పిలిచాడు.

వెన్నెల కొంచెం వేడిగావుంది.

బీటలిచ్చిన తలుపు.

వెన్నెల వెలుగు మింగిన గది.

ఓ జవాబులేని పిలుపు.

—తలుపును చేత్తో తట్టాడు.

—వోటి మోత!

లోన నులక మంచం కిర్రుమంది.

"యెవరూ?"—నూతిలోంచి స్వరం

"పడుకో - యెవడొత్తా డిప్పుడు—" తలుపుకు చెవి ఆన్చాడు మరుగుజ్జు.

—"రంగీ!" వొక మగ స్వరం.

ముద్దు, దాని వెనుక సన్నని తియ్యని నవ్వు.

బీటలు వారిన తలుపు. యెడ యెడంగా కూర్చబడ్డ బేలుచెక్కల తలుపు.

తలుపు సందులో కన్నిరికించాడు రంగడు.

పైకప్పు చిల్లులుగుండా ప్రవహిస్తున్న వెన్నెల...ప్రక్కన నులక మంచం — వెన్నెల కాంతికి నల్లని రంగి రూపం — లీలగా కనిపిస్తుంది —

రంగి ఒక్కర్తి కాదు —

— ప్రక్కన మరొకడున్నాడు.

తెల్లబట్టలతో తాపీమేస్త్రి బిచ్చాలు.

గాలి పొరలను ఛేదిస్తున్న ఆయాసపు ధ్వని —

కండలు తిరిగిన మేస్త్రీ చేతులు ఇనుప గొలుసుల్లా ప్రవర్తించినై.

—బాధతో మూలిగిన స్వరం వినిపించింది.

పై సంఘటన రంగడు చూసింది ఒక్క క్షణం.

అతని రక్తనాళాలు ఒక్కసారి వేడితో కదిలాయి.

అతను కోపంతో ఒణికి పోయాడు.

వెనక్కి తిరిగాడు రంగడు.

వెన్నెలకి అతని నీడ పొట్టిదయింది.

—మరీ పొట్టిదయింది.

వికృతంగా వెక్కిరించింది.

పొట్లంలో వున్న మల్లెపువ్వులు ఫక్కున నవ్వాయి—

కోపంతో నేలకు విసిరికొట్టాడు—కసి తీరా తొక్కాడు.

చేతిలో వున్న చీరెను దూరంగా విసిరాడు.

భారం తీరినట్లు నిట్టూర్చి నింపాదిగా నడిచాడు.

చంద్రుడు చల్లబడ్డాడు.

మరుగుజ్జు కోపం పోయింది.

దూరాన దేవుడి గుడి కొక్కిరించింది.

"రంగి కాదు నన్ను అన్యాయం చేసింది—నన్ను ఈ రూపంలో సృష్టించిన భగవంతుడు,"—అనుకున్నాడు.

దూరాన ఉన్న కుక్క భౌ భౌ మని మొరిగింది.

★

# అనిమిషులూ - అనిమిషాలు




మెరుస్తున్నది ఎండ
కరుస్తున్నాయి క్రిమికీటకాలు గడ్డిలో
అన్ని కళ్లూ ఆటగాణ్ణి చూస్తున్నాయి
తొంభయ్యో పడిలో ఊగిసలాడుతున్నాడు కుర్రాడు
టెస్టులో మొదటిసారి ఆడుతున్నాడు
అంబరం నిర్మలంగా వుంది
నిశ్శబ్దం దుర్భరంగా పడింది మంది మీద
కాలం నిలబడి పోయింది కథలో సాలభంజికలా
పులిలా చూస్తున్నాడు ఆటగాడు వేటగాణ్ణి
(అది బౌలర్ని)
వంద పరుగులు చేస్తే ఈ రోజు కతడు రాజు
లేకపోతే గుండెల్ని గీరినట్టుగా వుంటుంది గాజు
క్రికెట్ ఆట జీవితం వంటిది
గెలుపూ ఓటమీ రెండూ ఫేసినేటింగానే వుంటాయి
ఇంతకూ అతను శతశ్లోక పండితుడా కాదా?
చూద్దాం రేపు ఉదయం వార్తాపత్రిక.





# తిండికి లేనివాళ్ళు

హరీంద్రనాధ్ చౌదరి

నేను రోజూ ఆఫీసుకి లెజిస్‌లేటివ్ ఎసెంబ్లీ మీదుగానే వేళ్తూవుండేవాడిని. అక్కడ ఎప్పుడూ జనం కిటకిట లాడుతూనే వుండేవాళ్లు. మంత్రులు, సభ్యులే కాకుండా, పల్లెటూర్లనుంచి వాళ్ళతో పనివుండి వచ్చిన వారుకూడా హడావిడిగా తిరుగుతుండేవాళ్ళు. మంత్రులకార్లు హడావిడిగా లోపలకు, బయటికి తిరుగుతుండేవి. ఒక్కొక్క సభ్యుడు తనతో పనివుండివచ్చిన ఏ పది పన్నెండు మంది గ్రామస్థులనో వెనుక వేసుకుని తిరుగుతుండేవాడు. అంతా కోలాహలంగానే వుండేది. కాని, అక్కడవున్నవారి ఒక్కరిమొహంమీద కూడ తిండికి లేనివాళ్ళకి తిండి కల్పించే బాధ్యత తమ మీద వుందనే ఆరాటం కనిపించేది కాదు. ఎవరి గొడవల్లో వారు తిరుగుతూండేవారు. అంతే.

ఒకరోజు నేను ఎసెంబ్లీ మీటింగుజరుగుతూండగ లోపలికి వెళ్ళటం తటస్థించింది. ఒక్కొక్కరు ఉపన్యసించి కూర్చుంటున్నారు, మరొక్కరు ఉపన్యసించటానికి లేస్తున్నారు. ఉపన్యాసాలైతే జోరుగానే సాగుతున్నాయి గాని, అవన్నీ నా చెవికి చాలా కృత్రిమంగా సోకినై. తిండికిలేనివాళ్ళ ఆక్రందనలకు స్పందించిన హృదయాలనుంచి ఆ ఉపన్యాసాలు వస్తున్నట్లు నాకు వినిపించలేదు. కొందరు ప్రభుత్వపార్టీకి సంభందించినవారు గనుక ప్రభుత్వాన్ని సమర్ధించక తప్పదు గనుక సమర్ధించినట్టు కనిపించారు. మరికొందరు ప్రభుత్వ వ్యతిరేక పార్టీవారు అవటం వల్ల ప్రభుత్వాన్ని విమర్శించక తప్పదు కనుక విమర్శించినట్టు కనిపించారు. మాట్లాడిన వారందరూ ఉక్రోషంతోనే మాట్లాడారు. కాని ఆ ఉక్రోషం ఎవరి మీదో నాకు తెలియలేదు. ఈ పార్టీలమధ్య తిండికి లేనివాడి కోసం వెతకవల్సి వచ్చింది నేను. వాడిక్కడ ఉండడని తేల్చుకున్నాను. టంప్రధమంలో వున్న ఈ పార్టీలమధ్య ఏనాడో నలిగి నామ రూపం లేకుండాపోయి వుంటాడు. అతను నిష్క్రమించిన రంగస్థలంలో ఇక మిగిలింది సైడు కర్టెన్లు, తమతమ పోర్షన్ల నప్పగించే పాత్రలు మాత్రమే.

ఒకరోజు నేను ఆఫీసుకి వెడుతున్నాను. అప్పుడు ఎసెంబ్లీ జరుగుతున్న రోజులే అవటంవల్ల భవంతిలోనూ,

భవంతిబైట రోడ్లమీద జనం కిక్కిరిసి వున్నారు. ప్రక్కనే పేవ్‌మెంటుమీద ఒక తిండికి లేనివాడు మరణించివున్నాడు. వెల్లికిలా పడుకుని ఆకాశం వైపుకు చూస్తున్నాడు. అటూ యిటూ తిరిగే జనం మొదట్లో ఎవరో బిచ్చగాడు పడుకున్నాడనుకున్నారు. అది శవం అని తెలుసుకుని తప్పుకుపోయేవారు.

అక్కడున్న ఒక్కరికికూడా ఈ మరణించిన వాడి సంగతి మాత్రం పట్టలేదు. వారికి తట్టిందల్లా ఎవరో ఒకరు మరణించారని మాత్రమే. అందులో కొంత మందికి ఆ తిండికి లేనివాడు ఇంట్లో మరణించక బయట మరణించి తమకు ఇబ్బంది కలిగించాడనే కోపం వచ్చినా వచ్చి వుండవచ్చు.

అతన్ని చూస్తూ నుంచున్న నాకు ఈ విశాల ప్రపంచంలో అతనికి 'నా' అనే వాళ్ళెవరూ లేరనిపించింది. అన్నం దొరికితే తిన్నాడు - రోగంవస్తే మూలిగాడు. ఎక్కడ నిద్రవస్తే అక్కడ పడుకున్నాడు. పడుకోగూడని చోట పడుకున్నాడని, కూర్చోగూడని చోట కూర్చున్నాడని, తిరగగూడనిచోట తిరిగాడని ప్రభుత్వం డబ్బుతినే పోలీసులు అతన్ని ఎన్నిసార్లు జైల్లో పెట్టారో చెప్పటం కష్టం.

అతను శరీరాన్ని మోసుకొని తిరిగి తిరిగి ఏ అర్ధరాత్రో ఆ పేవ్‌మెంటు మీద పడుకుని వుంటాడు. పండుకొన్న ఏ కొద్ది సేపటికో అతని ప్రాణాలుపోయి వుంటై. అప్పటినుంచీ పడుకున్నవాడు పడుకున్నట్లు అతను ఆకాశంచూస్తూ పడుకునే వున్నాడు. పురప్రముఖు లందరూ అతన్ని చూసి దాటుకుపోయారు. దేశనాయకులేమో అతన్ని చూసి తప్పుకుపోయారు. అతను మాత్రం అక్కడే వున్నాడు.

అతనివంటివాళ్ళు మనదేశంలో ఎంత మందివున్నారో ఊహించలేం. స్వరాజ్యానికి ముందు ఎంతమంది వున్నారో, తరువాతకూడా అంతమంది ఉన్నారని చెప్పుకోటంలో తప్పులేదని అనుకుంటాను. ప్రణాళికలకు ముందు ఎంతమంది వున్నారో ఇప్పుడూ అంతమంది వున్నారు. వీళ్ళు ఎప్పుడూ వుంటారు. అయితే వీళ్ళు జనాభాలెఖ్ఖలోకి వస్తారా? రారు. కాకులు, గద్దలు ఎన్ని మరణించటం లేదు! వీళ్ళూ అంతే. మనం నడచి వెళ్తుంటే మన అడుగు క్రిందపడి ఎన్ని క్రిమికీటకాదులు మరణించటంలేదు. వీళ్ళూ అంతే. వీళ్ళెప్పుడూ ప్రభుత్వం దృష్టిలోకి వచ్చివుండరు. అందువల్ల వీళ్ళు మరణించినట్లు ప్రభుత్వం లెఖ్ఖలోకి ఎక్కివుండదు. ఇటువంటి తిండికి లేనివాళ్ళు మరణిస్తూనే వుంటారు. జాతీయ ఆదాయం పెరుగుతూనే ఉంటుంది. ఆ మాటకొస్తే వీళ్ళు తిండికి లేక మరణించటం వల్లే జాతీయ ఆదాయం పెరిగిందని కూడా మనం చెప్పుకోవచ్చు.

(సశేషం)




"అబ్బ! ఎంత మారిపోయింది కాలం! వీళ్ళుకూడా ఒక సంఘాన్ని ఏర్పరచుకున్నారు! చేపలు అంతా కలిసి పట్టటమేనట! ఒకేచోట నిలవచేయటం. అమ్మకంకూడా అంతే! వచ్చిన లాభంలో కొంతభాగం సంఘంలో వుంచి, మిగతాది అందరూ వాటాలుగా పంచుకుంటార్ట. బాగుంది..." ఇలా ఆలోచించుకుంటూ కూచున్న నన్ను వీరన్న వచ్చి...

"యీ రాత్రికి చేపలు పట్టటానికి సముద్రం మీదికి పోతున్నాం. మీరూ వస్తారా, మాతో?" అని ప్రశ్నించాడు.

వీరన్న ఆ సంఘంలో ఒక సభ్యుడు, యువకుడు, చదువు కొద్దో గొప్పో వచ్చు.

"అరె. యీ పూట రేడియో వినలేదూ, తుఫాను వచ్చే సూచన ఉన్నట్టు చెప్పారే" అన్నాను నేను.

"మరేం భయంలేదు. తుఫాను నుంచి మనల్ని మనం రక్షించుకోగలం" జవాబిచ్చాడు. వాళ్ళ పథకం కూడా చెప్పాడు. సంఘం తరఫున వున్న రెండు మోటారు బోట్లమీద వాళ్ళ సంఘ సభ్యులంతా బయలుదేరుతున్నారట. ఒక వందకు పైగా వలలు, యింకా చిన్న చిన్న చేతి వలలు, సరంజామాతో బయలుదేరుతున్నార్ట. అంతగా తుఫాను వచ్చే సూచనలు కనిపిస్తే, ముందుగా మేల్కొని మోటారు బోట్లమీద త్వర త్వరగా తిరిగి వచ్చేయొచ్చుట. నేను 'సరే' అన్నాను.

ఆ సాయంత్రం నేనూ, వీరన్న మోటరు బోట్ల దగ్గరికి జేరేప్పటికే పది పదిహేనుమంది బోట్లమీదికి హడావిడిగా వలలూ అవీ జేరవేస్తున్నారు. యిక బయలుదేరటానికి ఎంతో ఆలస్యం లేదు.

అక్కడున్న వాళ్ళందర్లోకి పెద్దవాడు రామయ్య. వయస్సు అరవై వుంటుంది. అంత వయస్సు వాడయినా క్షణం తీరిక లేకుండా పనిచేస్తూనే వున్నాడు మిగతా వారితోపాటు. వాళ్ళకీ వీళ్ళకీ పనులు పురమాయిస్తున్నాడు కూడాను. ఆ రామయ్యట, సముద్రంమీద వీస్తున్న గాలిని బట్టి చేపలు ఎటునుంచి ఎటుపోతున్నయో చెప్పగలట్ట. యీ వృత్తిలో నలభయ్యేళ్ళ అనుభవం అతన్ని ఉక్కుమనిషిగా చేసింది. వంటిమీద కండలేకపోయినా యింకా చేతుల్లో శక్తి పోలేదు.

యీ ముసలి రామయ్య కొడుకు భద్రమే యీ సంఘ నాయకుడు. నెమ్మదైనవాడు. నీళ్ళల్లో గంటల తరబడి మునిగి వుండగలడు. యీతలో దిట్ట.

యింకా అక్కడున్న ముఖ్యుల్లో ఎల్లమ్మ ఒకావిడ. ఆడదైనా సంఘంలో వుండి మగవాడితో కొంచెం కుడియెడంగా పని చేయగలదు నలభయ్యేళ్ళు వచ్చినా యిప్పటికూడా.

మేం బయలు దేరేటప్పటికి సముద్రంలో తుఫాను సూచనలేమీ లేవు. మా బోట్ల వేగానికి కలిగిన అలలు తప్ప, సముద్రం చాలా ప్రశాంతగా వుంది. అయినా నాకు లోపల భయం భయంగానే వుంది. సముద్రం నిండు చూలాలులా వుంది. ప్రసవపు నొప్పులు ఎప్పుడు మొదలవుతాయో...

నేను ముసలి రామయ్యను అడిగాను 'తుఫానుకు మీరు భయపడరా?' అని.

"మేం దేనికీ భయపడం" చుట్ట ముట్టిస్తూ జవాబిచ్చాడు. "అదీగాక యీ తుఫాను గాలులూ, సముద్రపు అలలూ వున్నాయి చూశారూ వొట్టి అర్భాటపు కుక్కలాంటివయ్యా. పిరికి వాళ్ళను తరుముతాయి. వాటికి భయపడకుండా ఎదురు నిలిచామంటే, మన దారికవి అడ్డు రావు."

"అంటే, మీ చేపలవాళ్ళ బోట్లు యింతవరకూ ఏ తుఫానువల్లా ప్రమాదానికి లోను కాలేదంటావా?" ప్రశ్నించాను నేను.

"కొన్ని సంవత్సరాలకు ఒక్కటి కూడా......" అంటూ వీరన్న ఏదో చెప్పబోతుంటే, రామయ్య మధ్యలోనే అందుకుని, వీరన్నవైపు తిరస్కార భావంతో చూస్తూ, 'కాని వీరన్నా! నువ్వు ఎప్పుడూ అజాగ్రత్తగా వుండకూడదుసుమా! మన జాగ్రత్తలో మనం ఎప్పుడూ వుంటూ వుండాలి. వాతావరణం చూస్తే యీ రాత్రికి ఏమాత్రమో మనని యిబ్బందిలో పెట్టేటట్టే వుంది యీ సముద్రం' అని వీరన్నను మందలించి — "తుఫానుకు భయపడవలసిన అవసరమేమీ లేదయ్యా. మన్ని మనం రక్షించుకోగలం దాన్నుంచి, ఒకవేళ వచ్చినా" అని నాకు ధైర్యం చెప్పాడు.

సూర్యుడస్తమిస్తున్నా యింకా అప్పటికీ వేడిగానే వుంది. అస్తమిస్తున్న సూర్యకిరణాలు సముద్రం మీద పడి సముద్రం ఎర్రగా కన్పిస్తోంది. మా పడవలు దక్షిణంగా ప్రయాణం సాగించాయి.

రామయ్య సముద్రపు నీళ్ళలోకి దీక్షతో చూస్తున్నాడు, వలలు ఎక్కడ వేయిద్దామా అని. సంఘ నాయకుడు భద్రం ఆకాశంవంక తదేక దృష్టితో చూస్తున్నాడు—వాతావరణం ఎట్లా వుందో నని. నేను రామయ్యలాగా నీళ్ళలోకి చూశాను. నీళ్ళలో నాకేమీ కనిపించలేదు. భద్రంలాగా ఆకాశంపైకి చూశాను. ఆకాశం నిర్మలంగా వుంది. ఒక తెల్లని మేఘంమాత్రం త్వరత్వరగా పరుగెత్తుతోంది. ఎక్కడికో!—నాకెందుకనో ఆ మేఘం'' 'తుఫాను వస్తోంది, జాగ్రత్త' అని శకునం చెప్పినట్లనిపించింది.

యింతలో బోటుమీద చిన్న వివాదం ఏర్పడింది. ముసలి రామయ్య అంటాడూ—యింకా కొంచెం లోతుకు పోయి అక్కడ వలలువేస్తే, చేపలు మామూలు కంటె ఎక్కువ పడ్తాయని.

సంఘనాయకుడు భద్రం, ఎల్లమ్మ తప్ప అందరూ అట్లాగే చేద్దామంటారు. భద్రం, ఎల్లమ్మా ఏమంటారంటే, తుఫాను వస్తే, చాపలమాట దేముడెరుగు, మన వలలు మనం తెచ్చుకునే సరికి తలప్రాణం తోకకి వస్తుంది. వలలు తెచ్చుకోలేక పోయామంటే




"ఈమధ్య మగవాళ్లు చాలామంది చచ్చిపోతున్నారుట''

"చావ కేంచేస్తారు, భార్యలు బొత్తిగా పుట్టింటి కెళ్ళడం మానేసి, పూర్తిగా రెస్టు లేకుండా చేసేస్తూంటే."

సంఘానికి నష్టం. అందుకని ఒడ్డుకి ఎంత దగ్గరగా వుంటే అంత మంచిదంటారు. ఒడ్డుకి దగ్గరగా వలలువేస్తే చేపలు పడవంటాడు రామయ్య.

ఎలాగయితేనే చివరకి రామయ్య మాటకే ఒప్పుకున్నారు అంతా. మా రెండు బోట్లూ ఒకదాని సరసన ఒకటి కొంచెం లోతుగా పోయి ఆగాయి.

మొదటివల వేశారు. అది సముద్రంలోకి పూర్తిగా మునిగి పోయింది. దాని ప్రక్కనే మరోటి, దాని నానుకొని ఇంకోటి—యిలావున్న వలలన్నీ వేసేశారు. వలలపైన వున్న బుడిపెలలాంటి కొయ్యచక్కలు తప్ప, నీటి పైకి ఏమీ

కనపడటం లేదు. నీటిలోపల ఆ వలలన్నీ ఒక వలయకారంగా ఏర్పడ్డాయట. అందులోపడ్డ చేప యింక తప్పించుకుని బయటికి పోలేదట.

అదెట్లాగో మరి, ఎంత ఆలోచించినా నా వూహకు అందలేదు.

యీపని అయ్యేసరికి బాగా చీకటి పడింది. యీ వలల్ని యిక్కడ వదిలేసి మేం మరొక రకమైన చేపల వేటకు బయలుదేరాం. యిది బలే గమ్మత్తుగా వుంది. రెండు బోట్లమీంచి రెండు ప్రక్కలకు ఒక్కోలైటు — ఎలక్ట్రిక్ లైటు లాంటిది, నీళ్ళలోకి ఫోకస్ చేశారు. ఆ లైటు వెలుతురికి చేపలు అకర్షింపబడి నీటిపైకి ఎగురుతున్నాయి. ఎగిరిన చేపను ఎగిరినట్లు చేతి వలల్లోకి పట్టున్నారు. నేనూ ప్రయత్నంచేసి చూశాను! ఒక చేతివల తీసుకొని. నాలుగైదు చేపలు నా దగ్గరలో ఎగిరితే ఒక్క చేపను పట్టుకొనేప్పటికి గగనమై పోయింది నాకు. విసిగిపోయి చూస్తూ కూర్చున్నాను. నేను ఆకాశం వంక చూశాను. నక్షత్రాలు లెక్కలేనన్ని వున్నాయి. అందులో కొంచెం బాగా మెరిసే నక్షత్రం వంక చూస్తున్నాను. ఏవేవో పిచ్చిపిచ్చి వూహలు...'ఆ నక్షత్రంలో కూడా యిలాటి సముద్రం, యిలా చేపలు పట్టే బోట్లు, ఆ బోట్లమీద జనం...వాళ్లుకూడా వీళ్ళంత వుత్సాహంగా చేపలు పట్టడం...''

ఇలా ఊహించుకుంటూ నన్ను నేను మరిచిపోయాను. చాలాసేపు ఉండి వుంటాను. ఎవరో తట్టి పిల్చేవరకు అలాగే యింకా ఏవేవో వూహించుకుంటూ వున్నాను. ఒక్కసారిగా ఉలిక్కిపడి బాహ్య ప్రపంచంలో పడ్డాను. వర్షం పడుతూ వుంది. యింతకు పూర్వం సముద్రంలో వేసిన పెద్దలైట్లు ఆర్పేశారు. చేతివలలన్నీ ఒకచోట పోగుచేశారు. చేతి వలలతో పట్టిన చేపలన్నింటినీ గంపల్లోకి ఎత్తేశారు. అబ్బ ఎన్ని చేపలు! రకరకాలవి. అవునుమరి, ఒకళ్ళా — అర గాదాయె, యింతమంది పట్టినవి!

చుట్టూ సముద్రం భీభత్సంగా వుంది. అలలు మా బోటుని ఎత్తెత్తి పడేస్తున్నాయి. ఒక్కొక్కసారి అలలు మమ్మల్నికూడా తాకుతున్నాయి. ఆకాశం దట్టంగా మబ్బుపట్టి వుంది. మధ్యమధ్య తళుక్కు తళుక్కుమని మెరుపులు. ఆ వెంటనే ఆకాశమే విరిగి మీదపడుతూ వుందా అన్నంత ధ్వనితో పిడుగు, ఇంతలో గాలికి—ఎవరో గొంతు నొక్కేస్తున్నట్లుగా — ఒక్కసారిగా ఆ ధ్వని తగ్గటం. మళ్ళా ఒక మెరుపు. మళ్ళా పిడుగు ధ్వని. యీసారి పిడుగు మీద పడుతున్నట్లుగానే అంతకంతకు ధ్వని పెరగటం. — వీటన్నిటితో నా గుండె బేజారై పోయింది. ఎందుకొచ్చానురా భగవంతుడా! మళ్ళీ ఒడ్డుకు చేరతానా

లేదా ? అని భయపడ్డాను. దీనికి తోడు కుండపోతగా వర్షం. తుఫాను గాలి! ఇక నా పరిస్థితి ఊహించుకోండి. సముద్రంమీదికి వెళ్ళటం అదే మొదటి సారి నాకు. ఆగాలికి ఎగిరిపోయి సముద్రంలో పడతానేమోనని భయం. దానికి తోడు అలల తాకిడికి బోటు యిటూ అటూ — ఎప్పటికప్పుడు బోటు తల క్రిందులయి పోతున్నట్లుగానే అనిపించేది నాకు — వూగులాట.

ప్రతి కెరటంతో పాటు మాబోటు అంతఎత్తుకు ఎగరటం, వెంటనే మళ్ళా దాంతోపాటు కిందకి రావటం. గాలిలో ఆకుల్లాగా, సముద్రంలో అలలకి మా రెండు మోటారు బోట్లు వూగిసలాడుతున్నాయి.

గాలి ఉధృతం పెరిగింది. ఒక పెద్ద కెరటం మా పడవమీదుగా వచ్చింది. ఆ విసురుకు నే నేమయ్యానో కొద్దిసేపటి వరకూ నాకు తెలియలేదు. ప్రపంచ మంతా గిఱ్ఱున తిరుగుతున్న ట్లనిపించింది నాకు. అప్పటికే ఒక గుటక వేయటం జరిగింది. సముద్రంలో మునిగి పోతున్నట్లు తెలుసుకున్నాను. బలమంతా ఉపయోగించి నీటిపైకి రావాలని ప్రయత్నించాను. నా వళ్ళు నాకే ఎంతో బరువనిపించింది. నీటి పైకి జేరానో లేదో యింతలో మరొక అల వచ్చి పడింది. మరో గుటక. అబ్బ! నీరు ఎంత వుప్పగా వుంది! మళ్ళీ నీళ్ళల్లో మునిగిపోతున్నాను. ఈ సారితో సరి అనుకున్నాను. కాని యింతలో సంఘ నాయకుడు భద్రం నన్ను పైకిలాగాడు. నేను బతికాను. కూడదని తెలిసి కూడా నా బరువంతా అతనిమీద వాల్చాను. అయినా అతను యీదుతున్నట్లు కనిపించలేదు. అతని నడుముకు కట్టివున్న తాడు బోటు మీద వాళ్ళు లాగుతున్నారు. యిద్దరం బోటుదగ్గరకి జేరాము. రామయ్య తన చెయ్యి అందించాడు నాకు. నేను ప్రయాస పడి పైకి ఎక్కకుండానే, అతనే పైకి లాగాడు. నలుగురూ జేరి అరికాళ్ళూ అరి చేతులూ రుద్దటం మొదలు పెట్టారు.

వీరన్న అన్నాడు, 'భద్రం నిన్ను రక్షించక పోయినా, యింకా సేపటికి



మహిళా అభ్యర్థి: "మీరు నాకు సపోర్టు చెయ్యాలి."

ఓటరు: "నా భార్యా పిల్లల్నే సపోర్టు చెయ్యలేక చస్తున్నాను; పైన మిమ్మల్ని ఎక్కడ సపోర్టు చేసేది."

మా పెద్ద చేపల వలల్లో పడి ఉండే వాడివి' అన్నాడు నవ్వుతూ. 'ఆ సంగతి నాకు తెలిస్తే త్వరగానే మునిగిపోయే వాడిని' అన్నాను నేనూ నవ్వుతూ.

రామయ్య, 'యింత ప్రమాదంలోంచి నువ్వు బ్రతికావంటే, ప్రపంచానికేదో మేలు చేయాల్సి వుంది నువ్వు. అందు కనే భగవంతుడు నిన్ను రక్షించాడు. ముందు ముందు నువ్వు బాగా సుఖపడ తావు' అన్నాడు.

గాలికొంచెం తగ్గింది. ఇంతలో ఎల్లమ్మ పలకరించింది, 'అలిసిపోయినట్లున్నావే?'

"అలవటం ఏముందిగాని మీతోవచ్చి మీకు సహాయ పడలేక పోగా, మిమ్మల్ని కష్టపెడుతున్నాను. నీటిలో రెండుసార్లు మునగటం వల్ల సముద్రపు నీరు తాగాను. కడుపుబ్బుగా వుంది, అంతే'' అన్నాను.

''అయితే కొంచెం చేపల సూప్ తయారు చేసి తీసుకొస్తానుండు" అని లేవబోయింది. ఆమెను అనే శ్రమ నాకు లేకుండానే రామయ్య కలిగించుకొని, ''యింటికి జేరనీ, నీ యిష్టంవచ్చింది చేసి పెడుదుగాని. గాలి కొన్ని క్షణాల సేపు మాత్రం తగ్గింది. మళ్ళీ ఉధృతంగా వస్తుంది చూడు యిప్పుడే, యీ లోపల మనం వేసిన వలలు బయటికి తీయాలి ముందు'' అన్నాడు.

బోటు మీద అంతా తడి తడిగా వుంది. కాలువేస్తే జారిపోయేట్లుంది. అయినా వాళ్ళు ఆ వలల్ని పైకి లాగటం మొదలు పెట్టారు. ఒక్కొక్క వల పైకి లాగటానికి ఆరుగురు కావాల్సి వచ్చారు. ప్రతివలనిండా చేపలే. అయినా నలుగురితో పని గనుక వలలన్నీ త్వర త్వరగా పైకి లాగేశారు. వెంటనే సంఘ నాయకుడు భద్రం, ''ఊఁ పోనీండి పడ వల్ని, త్వరగా పోనీండి'' అన్నాడు.

వెంటనే రెండు మోటారు బోట్లు స్టార్టయిన శబ్దం కొద్దిగా వినిపించింది. కాని మమ్మల్ని తరమటానికా అన్నట్లు గాలిహోరు ఒక్కసారిగా పెరిగింది. ఆ గాలిహోరుకు మోటారు ఇంజన్ల ధ్వనే వినిపించలేదు. మళ్ళా వర్షం, గాలి, దానితోపాటు సముద్రం పొంగు క్రిందటి సారికంటె ఎక్కువగా మొదలు పెట్టింది. క్రిందటిసారి అనుభవంతో — బోటును గట్టిగా పట్టుకుని మళ్ళా సముద్రంలో పడకుండా జాగ్రత్త పడ్డాను. యీసారి సముద్రంలో పడితే బోటుతో సహా పడాల్సిందే. మా మోటారు బోట్లు వెళ్ళగలిగినంత ఎక్కువ స్పీడులో ప్రయాణం చేస్తున్నయి.

ఎలాగయితేనేఁ ఒడ్డుకు చేరుకున్నాం. బతికి బయట పడ్డాం. మా బోటు చేరిన నాలుగైదు నిమిషాల్లో రెండో బోటు కూడా వచ్చి చేరింది. అందులో కొంత మంది నీళ్ళల్లోకి దూకి బోటుకున్న గొలుసుల్ని ఒడ్డున పాతిఉన్న కొయ్యలకు తగిలించారు. యిప్పుడు సురక్షితంగా వున్నాం మేము ప్రకృతినుంచి.

ముసలి రామయ్యా సహాయంతో టార్పాలిన్లు టాపుమీద వేశారు. ఇప్పుడు వానకూడా మామీద పడటం లేదు. ఒక్క గాలిమాత్రం మమ్మల్ని తాకుతూ ఉంది.

అంతా లోపల బోటులో వున్న పొడి గుడ్డలు తెచ్చి కట్టుకున్నాం.

ముసలి రామయ్య వచ్చి, "యింక హాయిగా నిద్రబోవచ్చు, తుఫాను తగ్గే వరకూ" అన్నాడు.

రామయ్య ముఖంలోకి చూశాను. అంత ప్రమాదంలోంచి బతికి బయటపడ్డ సూచనలేమీలేవు. చాలా ప్రశాంతంగా మామూలుగా వుంది అతని ముఖం. అవును మరి, అతని అనుభవంలో యిది యెన్నోదో? నాకయితే మొట్టమొదటిదీ కట్టకడపటిదీ గాని.

'యిప్పుడు నిద్రేవిటి, తెల్లవార వస్తుంటే' సంఘనాయకుడు భద్రం నవ్వుతూ అన్నాడు. అంతా నవ్వారు.

నేను నా వాచ్‌కేసి చూశాను. ఆశ్చర్యం! అది ఆడుతూనే వుంది. అయిదు గంటల ఇరవై నిమిషాలయింది. అవును మరి! యిప్పుడు నిద్రేవిటి?

కాని నాకు ఒళ్ళంతా నొప్పులుగా ఉంది. ఆకలి కూడా బాగా వేస్తోంది. అయినా నిద్ర వచ్చేట్లు వుంది.

యింక కాసేపు పడుకుందామని నడుం వాల్చబోతున్నాను. యింతలో ఎల్లమ్మ ఒక పెద్ద బాన నిండా జావ కాచి, అందులో నంజుకు చేపల సూపు తీసుకుని







ప్రత్యక్షమైంది దేవతలాగ. ఇంత తుఫానులో ఆమె కివి చేయటానికి సమయం ఎక్కడుందో? ఓపి కెట్లావచ్చిందో, ఏమో!

అంతా ఎగబడ్డారు. ముసలి రామయ్య వెనకపడ్డాడనా—అందరికంటె ముందతనే.

తన భాగం తీసుకుని యివతలగా వచ్చి. 'నేను చెప్పలా అంత ప్రమాదం లోంచి బయట పడ్డావంటే ముందుముందు నువ్వు బాగా సుఖపడతావని. దానికి నిదర్శనం యిది. లేకపోతే యింత వుదయమే నీకు యిటువంటి ఆహారం ఎక్కడ దొరుకుతుంది? ఎట్లా వుంది? రుచిగా లేదూ?' అని నా దగ్గర చేరాడు.

'నువ్వు యిటువంటి తుఫానుల్లో లోగడ సముద్రం మీద వున్నావా?' సూపు నంజుకుంటూ ప్రశ్నించాను.

రామయ్య విరగబడి నవ్వాడు. 'యిటువంటి తుఫానులనా అడుగుతున్నావు? నేను చూసిన వాటిల్లో యిది ఒనోఁ వంతు? నేను చెప్పలేదూ భయపడవలసిన అవసరం లేదని' అన్నాడు.

ఎంత గుండె నిబ్బరం. దిన దిన గండంగా వీళ్లు యిలా బ్రతకాల్సిందేనా. వీళ్లు సంఘంగా ఏర్పడి, యింకా యింత హంగామాతో బయలుదేరారు గనుక ఒడ్డుకు చేర గలిగాం గాని మామూలు నావలయితే ఎప్పుడో సముద్రం మింగి ఊరుకునేది. వీళ్ళకి ఏమాత్రం లాభం వుంటుందో?—యిలా ప్రాణాలు తెగించి పాటు పడ్తారు.

నా ఆలోచనలు పసిగట్టినట్టున్నాడు రామయ్య. 'కష్టపడందే కూడెలా దొరుకుతుందయ్యా. ఎట్టలేదన్నా యీరోజు మాకు తలకొక అరవై రూపాయలు పడ్తయి. పదిహేను రోజుల గ్రాసం. నేలమీద అంటావా నీ దగ్గర బలముంటే ఏ కూలో నాలో చేసి బ్రతుకవచ్చు. సముద్రం మీద నీ బలం ఒక్కటే పని చేయదు. చేపలు ఎక్కడుంటాయో తెలుసుకోవాలి. వాటిని పట్టుకునే ఉపాయం, తెలివితేటలూ వుండాలి. లేకపోతే యిన్ని చేపలు ఒక్క రాత్రిలో దొరుకుతయ్యా?

"తుఫానను చూసి భయపడితే పని జరుగుతుందా. చుక్కాని చేతిలో వున్నంతవరకు ఇటువంటి తుఫాన్లు ఎన్ని వచ్చినా ఏమీ చెయ్యలేవు. చుక్కానిని పట్టిన పట్టుమాత్రం విడువకూడదు...''

అంటూ రామయ్య చెబుతుంటే— ఎంత అనుభవంతో చెప్తున్న మాటలివి. మనం చేస్తున్నపని మధ్యలో విడవకూడదు. మనం చేసే ప్రతి పనికీ వర్తిస్తుంది యీ మాట. పట్టిన పట్టు వదలకుండా మన పని మనం చేసుకుంటే, మధ్యలో ఎన్ని కష్టాలొచ్చినా చివరకి జయం మనదే. కష్టాన్ని ఎదుర్కోవాలి. మన పని మనం సాధించుకోవాలి. మానవుడు సాధించలేని కార్యం వుంటుందా యీ విశ్వంలో.

[చైనీస్ లిటరేచర్—మాసపత్రిక నుండి].

# స్వేచ్ఛ అంటే ఏమిటి?

మన కృషికి సాధనాలుగా భగవంతుడు మనకు వివేక విజ్ఞానాలను ప్రసాదించాడు. కనుక ఈ సాధనాలను మనం స్వేచ్ఛగా ఉపయోగించుకునే విషయంలో జాగ్రత్త పడవలసి వుంది. స్వేచ్ఛ లేనప్పుడు మన విధిని సక్రమంగా నిర్వర్తించలేము. అందువల్ల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను రక్షించుకోవడం, వాటి నెదుర్కొనే శక్తులను అరికట్టడం మనబాధ్యతై వుంది.

స్వేచ్ఛ లేనినాడు నీతికి తావు లేదు. ఎందుకంటే మంచి చెడ్డలు; అభ్యున్నతి, అహంకారాలకు తేడాను గుర్తించని రోజున బాధ్యతనేదే వుండదు. స్వేచ్ఛ లేని రోజున నిజమైన సమాజానికి అస్తిత్వమే లేదు. సమాజంలో స్వేచ్ఛా జీవులకూ, బానిసలకూ సఖ్యతే వుండదు. ఆనాడు ఒకరు మరొకరిపై పెత్తనం చలాయించడమే కనిపిస్తుంది. ఒకరి జీవితాన్ని ప్రతిబింబించే వ్యక్తిత్వమనేది ఎంత పవిత్రమో స్వేచ్ఛకూడా అంత పవిత్రమైనదే. స్వేచ్ఛలేని రోజున ఈ జీవితం యంత్రంలా ఒట్టి అవయవాల కదలిక మాత్రమే అనిపించుకుంటుంది. స్వేచ్ఛను దుర్వినియోగ పరచడం సహజ విరుద్ధం. అంటే దైవనిర్ణయాన్ని కాదనడ మన్నమాట.



ఏవో మహత్తర శక్తులో, మహా సంపదో ప్రసాదించిన హక్కు అనే సాకుతో ఒక మనిషి మరొక మనిషిపై లేదా కులం, కుటుంబం పైన అధికారం చలాయించే చోట స్వేచ్ఛకు తావులేదు. స్వేచ్ఛ అనేది అందరికీ, అందరిపట్లా అవసరం. భగవంతుడు ఏ ఒక్క వ్యక్తికో సర్వాధిపత్యాన్ని అంటగట్టిపెట్టడు. భగవంతుడు ఈ భూమిమీద ఏ సర్వాధిపత్యాన్నయినా కట్టపెట్టదలిస్తే అది మానవత్వానికి—జాతికి లేదా సమూజానికంతటికీ ప్రసాదిస్తాడు.

కనుక నేనే సర్వాధికారినని ఎవరికి వారే అనుకోవడం అర్థంలేని విషయమవుతుంది. అయితే ఒకలక్ష్యాన్ని నిర్ణయించుకోవడంలో, ఆ లక్ష్యసాధనకు కృషిచేయడంలో సర్వజ్ఞత్వాన్ని ప్రదర్శించుకోవచ్చు. సర్వ మానవులకు తోడ్పడే పద్ధతుల్లో మన లక్ష్యమూ,

జోసెఫ్ మెజినీ

వుండాలి. కనుక — శాశ్వతమైన సర్వాధి పత్యమనేది ఎప్పుడూ లేదు; ఉండలేదు కూడాను. మనం ప్రభుత్వమని పేరు పెట్టుకున్న సంస్థ మార్గదర్శిని మాత్రమే. జాతి పురోగమనాన్ని త్వరితగతిని సాగించడానికి కొందరు వ్యక్తులకు అప్ప గించబడ్డ సంస్థమాత్రమే ఈ ప్రభుత్వం. కనుక ఏనాడైతే ప్రభుత్వం తనకప్పగించ బడ్డ బాధ్యతను నిర్వర్తించదో ఆనాడు దానికివ్వబడ్డ అధికారాలన్నీ ఆపబడాలి.

అందరి అభీష్టాన్ని నెరవేర్చడానికి నియమించబడ్డవాడే ప్రభుత్వ పాలకుడు. అలాంటి పరిపాలకుడు ఎన్నిక కావాలి. అంతేకాదు—అందరి స్వేచ్ఛా, స్వాతంత్ర్యా లకు భిన్నంగా ప్రవర్తించిననాడు తొలగిం చాలికూడాను. నీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను దుర్వినియోగపరిస్తేతప్ప ఇదివరకు చెప్పి నట్లు ఏజాతి, కుటుంబంగాని మరోదానిపై పెత్తనం చలాయించే హక్కెంతమాత్రం వుండదు. నీ ఇష్టానికి వ్యతిరేకంగా నిన్ను శాసించే వారున్నరోజున నీవు స్వేచ్ఛ ననుభవిస్తున్నానని ఎలా అంటావు?

భగవంతుడు నీకు ఆలోచించే గుణాన్ని ప్రసాదించాడు. దాన్ని ప్రక టించుకోకుండా ఆపడానికి ఎవరికీ హక్కు లేదు. అదే నీ మనస్సు—తోటి వారందరి మనసులాంటిది. తద్వారానే అభ్యున్నతి సాధ్యమవుతుంది. భావ ప్రకటనకు సంపూర్ణ స్వేచ్ఛ వుండాలి. దాన్ని అరికట్ట జూడడం క్రూరం. నేర్గాలను, అవినీతిని బహిరంగంగా ప్రేరేపించే వారిని మటుకు సమాజం శిక్షించవచ్చు. ఆలోచనలాగే శాంతియుత సహజీవనం పవిత్రమైనది. అలాంటి సహజీవనం అభ్యున్నతికి దారి తీసేది గనుక భగ వంతుడు ఆ మనః ప్రవృత్తిని ప్రసాదిం చాడు. అమార్గాన్నే వెళ్ళవలసి వుంటుంది.

భగవంతుడు ప్రసాదించిన జీవితాన్ని సార్థక పరచుకోవడం మన విధి.

మానవజాతి సౌఖ్యాన్ని అపేక్షిస్తూ వారి క్షేమంకోసం మరణించిన మహాత్ముని వాక్కులు మన మనస్సుల్లో ఎప్పుడూ ప్రతిధ్వనిస్తూనే వుంటాయి. ఆ మార్గాన నిరంతరం ప్రయనిస్తూ, భవిష్యత్‌కు పురోగమించడం మనధ్యేయం.

ఇతరులకోసం వదులుకొనని విధులను కొన్నింటిని పతివ్యక్తి నిర్వర్తించవలసి వుంటుంది. అయితే ఆవిధులను గౌరవించి సక్రమంగా నిర్వర్తించే బాధ్యత వుంది.

స్వేచ్ఛ అంటే అందరి అభిప్రాయాల పట్ల వ్యతిరేకతకాదు; జాతి ప్రయోజ నాలకు భిన్నమైన వాటికి మాత్రమే వ్యతి రేకత. నీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు భంగం కలగని సమాజాన్ని నెలకొల్ప డమే ధ్యేయంగా వుండాలి.

విధినిర్వహణకూ, సమాజ శ్రేయ స్సుకూ తోడ్పడే నీ స్వేచ్ఛ పవిత్రమైంది. నీ విజ్ఞానాన్ని సరియైన పంథాలో ఉపయో గించ ప్రయత్నించిన నాడు నీ స్వేచ్ఛకు భగవంతుడుకూడా తోడ్పడతాడు. ★

# వేదనా వాసుదేవము

నాయని సుబ్బారావు

ఆ కాలమ్మున దేవతల్ పలికిరయ్యా! పిల్వగానే, దయా
 సాకారాంబకులై వరాల్ గురిసిరయ్యా! వేడగానే, పృథి
వ్యాకాశాంతరమెల్ల త్వన్మయ రసవ్యాఖ్యాన సిద్ధార్థ భా
వా కీర్ణమ్ముగ పాదపాదమును బ్రహ్మానంద సంధానమై.

ఈ కాలమ్మున నారమాతత విమానేచ్ఛా విహారాఢ్యమై,
లోకా లోకము చుట్టుకుంచు కొనిరా, లోకమ్ము వైశాల్య మం
తా కొంచెమ్మయి, చిక్కనై వెలయుగా నారాయణ స్థానముల్,
నీ కై వారులు నీ వదృశ్య ఘుటికా స్వీతాంగులౌ చేలనో?

జ్ఞాన స్థానము నీవటంచు నెఱుగంగా లేని విజ్ఞాన దు
ర్మాన స్థానములై చెలంగు నరులున్మార్గ ప్రమాద ప్రచా
రాన న్యాదృశ దుర్జనత్వ జనితా హంకారత న్నిత్యశం
కా నాస్తిక్యము మీఱి చెండెదరుపో! నారాయణ స్థానముల్.

నీపీ గతి వికృతిం బడి
పోవగ దైవమవు, వికృత బుద్ధులు నర హిం
సా వేశితాంత రంగులు
భూవలయమ్మెల్ల దయ్యములు చెరలాడు౯.

ఆ దయ్యమ్ములు రీతిదయ్యములు గావయ్యా! ప్రపంచ ప్రభు
త్వో ద్దన్యత్వము పేర్చి, మానవత నిష్ఖ్యాతమ్ముగా, దానవ
(శ్రీ) దర్పోద్ధతి చాపజుట్టి సకలోర్వీం జంకకుండార్చు కా
మాది ప్రేరిత సర్వకల్మషకరీ పాత్ముల్, నరా కారముల్.

ఉన్నవి యంతర్వైరము
లన్నా! యాఱేగదయ్య! అర్బుద సంఖ్యా
సన్నాహ భైరవములై
చన్నేయివి, వీనితోడ చచ్చిన చావై!

భవిత వ్యార్థములెల్ల నీదు కరుణా ప్రాప్యంబులన్నా మెఱుం
గవు పామ్మి నరరూప భూతములు, రంగద్భంగ కల్లోలి తా
ర్ణవ సంకాశ తదంత రంగముల నిర్వ్యాపారమైడిందు మా
నవతా బీజము ప్రోదిసేయుము, పురాణ జ్ఞాన సస్యోదయా!

పాయక శూకకీటములు పట్టిన చిక్కుడుపాదు, శీర్ణమై
పోయిన యట్టులుండియు చివుళ్ళను నాకులు పూలు పిందెలుఁ
కాయలునై పునర్నవ వికాసము నందెడు, నీ మహామృత
(శ్రీ) యొసలారు తద్గత జిజీవిష యెంత యమోఘమో కదే!

పెంచుము మానవతా ని
ర్వంచిత శోభన ముదాత్తఫణితుల దివ్య
త్వాంచిత విపంచికలు సా
రించుము తంత్రీ! సమస్త హృదయము లందుఁ.

★




ఇంతకుముంధు మానవుని శరీరంలో వున్న కొన్ని భాగాలను గురించి తెలుసుకున్నాం. నిజానికి మానవ శరీర నిర్మాణం చిక్కు రొక్కులతో కూడుకొని వుంది. పైకి కనిపించే వేకాక, అనేక గజాల పొడవు వున్న పేగులూ, మైళ్ళ మీద మైళ్ళ పొడవు వున్న నరాలూ, ఇంచుమించు రెండు వందల ఎముకలూ, లెక్కపెట్టటానికి వీల్లేనన్ని కణాలూ శరీరంలో వున్నాయి. ఇన్ని వుండీ గజిబిజిలేదు. ఇవి వొకదానికొకటి సంబంధంలేని భాగాలు కావు. అటువంటి భాగాలతో కుట్టబడిన నిర్మాణం కాదు మానవ శరీరం. ఇవన్నీ సహజంగా వొక నిర్మాణానికి సంబంధించినవిగా కనపడతై.

ఈ వివిధ భాగాలు ఎలా కలిసి వొక శరీరం అయిందో ఇప్పుడు తెలుసుకుందాం! జీవకోటి మొత్తానికి సంబంధించిన పదార్థం ప్రొటోప్లాజం. ఈ పదార్థంవల్లే జీవకోటి ఉద్భవించింది. విశ్వం అంతటిలోకీ ఇది జటిలమైన పదార్థం. జీవకోటి చేసే పనుల కన్నిటికీ ఇది కర్త. ఇది, శారీరక భాగాలన్నిటిలోకీ చిన్నవైన కణాలలో వుంటుంది.

వొక కణంలో వున్న ప్రొటోప్లాజం రెండు భాగాలుగా విభజింపబడి వుంటుంది. అందులో వొకటి కేంద్రం, రెండవది దానిని చుట్టివుండేపొర. కేద్రం కోడిగ్రుడ్డు ఆకారంలో గుండ్రంగా వుంటుంది. ఇందులో వొకటి రెండు నల్లటి గుండ్రని పదార్థాలూ, క్రోమోజోమ్స్ అని పిలువబడే సన్నని దారాలూ వుంటై. గుణాలను పరంపరాగతం చేసే 'జెనే' వీటిల్లోనే వుంటుందని ఇంతకు ముందే తెలుసుకున్నాం. ఉత్పత్తి కణాలలోతప్ప మనిషిలోవుండే మిగిలిన కణాలన్నిటిలోనూ ఈ క్రోమోజోమ్స్

శాయన్న

వొకే స్వభావం కలవిగానూ, వొకే సంఖ్య గలవిగానూ వుంటై.

ఇక కేంద్రంచుట్టూ వుండే పొరను గురించి తెలుసుకుందాం. ఇది ద్రవ పదార్థం. ఈ పదార్థంలో అనేకరసాయినిక ద్రవాలు వుంటై. ఇవీ ఇందులో వుండే మరికొన్ని పదార్థాలు కలిసి, కణంలోకి వచ్చే ముడిపదార్థంలోకి అవుసరమైన రసాయినిక మార్పులను ప్రవేశపెడతాయని శాస్త్రకారులు చెపుతున్నారు

కణం వొక రసాయినిక ఫ్యాక్టరీ అని మనం చెప్పుకోవచ్చు. ఈ ఫ్యాక్టరీ బయటనుంచి ముడిసరుకును దిగుమతి చేసుకొని వాటిని క్రొత్త వస్తువులుగా మార్చి బయటకు ఎగుమతిచేస్తూ వుంటుంది.

ఇటువంటి కొన్ని కణాలు కలిసి ధాతువుగా తయారవుతై. కండరం ఇటువంటి ధాతువుల్లో వొకటి.

ఈ ధాతువుల్లో నాలుగురకాలు వున్నాయి. (1) శరీరం పై భాగాన్ని రక్షించేవి (2) కండరాలకు సంబంధించినవి (3) సంబంధం చేకూర్చేవీ, సహాయభూతంగా వుండేవీనూ (4) నరాలకు సంబంధించినవి.

ఈ ధాతువులు కొన్ని కణాలకు కేంద్రాలుగా, కూడగట్టుకున్న స్థావరాలుగా వుంటై.

ఇటువంటి ధాతువులు కొన్ని కలిసి అవయవాలుగా రూపొందుతై. కణాలు కొన్ని కలిసి ధాతువులయినట్లుగానే, కొన్ని ధాతువులు కలిసి అవయవాలు అవుతవి. కడుపూ, పేగులూ, గాలిగొట్టం, కార్జ్యము, హృదయం మొదలైనవి ఈ అవయవాలు. ఇవి శరీర పోషణకుగాను వొక్కొక్కటీ వొక్కొక్క కర్తవ్యాన్ని నెరవేరుస్తూ వుంటై.

ఈ అవయవాలలో అన్ని రకాల ధాతువులూ వున్నా, వొక్కొక్క అవయవములో వొక్కొక్క రకం ధాతువులు ఎక్కువగా వుండే అవకాశం వుందని శాస్త్రకారులు చెపుతున్నారు. ఉదాహరణకు ఉదరంలో కండర ధాతువులు ఎక్కువగా వుంటై. కార్జ్యం, మూత్రకోశం మొదలైన అవయవాల్లో ప్రత్యేకత గలిగిన మరొకరకం ధాతువులు ఎక్కువగా వుంటై. మెదడులో నరాలకు సంబంధించిన ధాతువులూ, గాలి గొట్టంలో సహాయ భూతంగా వుండే ధాతువులూ ఎక్కువగా వుంటై అనే సంగతి చెప్పనవసరం లేదనుకుంటాను.

మొత్తం మీద ఆయా అవయవాలు చేసే పనులనుబట్టి ఆయా రకాల ధాతువులకు వాటిల్లో స్థానం ఏర్పడుతుందని మనం చెప్పుకోవచ్చు.

పై ధాతువుల కలయికవల్ల అవయవాలు ఏవిధంగా ఏర్పడుతవో తెలుసుకున్నాం. ఇటువంటి అవయవాలు కొన్ని కలిసి వొక్కొక్క నిర్మాణంగా పరిణామం చెందినై. ఉదాహరణకు ఆహా

రాన్ని జీర్ణించటానికి పనిచేసే నిర్మాణాన్ని తీసుకుందాం. ఈ నిర్మాణంలో నోరూ, గొంతూ, కడుపూ, చిన్న పేగులూ, పెద్దపేగులూ, మలాశయం మొదలైన అవయవాలు పనిచేస్తూ వుంటై. ఇవన్నీ కలిసి ఆహారాన్ని జీర్ణం చేస్తయి.




శరీరంలో వున్న పదార్థాలు వొకదానినుంచి వొకటి ఏర్పడి, అంతా కలిసి వొక పెద్ద నిర్మాణం అయింది. ఈ నిర్మాణమే ప్రాణం కలిగిన జీవి. ఈ జీవినే మనం 'మనిషి' అంటున్నాం.



ఈ మనిషి అనే వాడిలో అనేక వస్తువులు వుంటూవున్నా, అన్నీ వొకదానికి వొకటి సంబంధపడే వుంటున్నయి. వొకదానికొకటి తోడ్పడుతూ, తమ కలయికలతో ఎప్పటికప్పుడు పెద్దవి అవుతూ వున్నయి. అందువల్ల మనిషిలోని ఏ వస్తువూ వృధాగా ప్రవేశపెట్టబడి వుండలేదు. అలా వుండటానికి వీల్లేదు. ప్రతిదానికీ వొక ప్రయోజనం వుండి తీరుతుంది.



అయితే జీవకోటిలో అవయవాల రూపు వాటి ప్రయోగాన్నిబట్టి మారుతూ వుండవచ్చు. నిష్ప్రయోజనమైన అవయవాలు హరించుకు పోవడం అవుసరాన్నిబట్టి క్రొత్త అవయవాలు పుట్టుకు రావడం జరగవచ్చు.

[సశేషం]



# సినిమా క్విజ్



పై ఐదు బొమ్మలూ ఐదు సినిమాల పేర్లు తెలియజేస్తవి.... ఏమిటవి ?

(జవాబులు 128 వ పేజీలో)



పాశ్చాత్య శాస్త్రవేత్తలు, మనస్సుకి అతీతంగా వుండే శక్తులను గురించి ఆలోచించలేదని చెప్పుకున్నాం. అంతే కాదు. ఈనాటి వరకూ మానసిక శక్తుల నన్నిటినీ కూడా వారు గ్రహించ లేదనే మనం చెప్పుకోవలసి వస్తుంది. వారు ఇంద్రియజ్ఞానాన్ని మాత్రమే అంగీకరించారు. అతీంద్రియజ్ఞానం అంటే వారికి అపనమ్మకం. అది భ్రమఅనో, ఇతరులను మోసం చెయ్యటానికి స్వార్థపరులు కొందరు సృష్టించిన వల అనో వారు అనుకుంటారు. అనుకొని అటువంటి జ్ఞానాన్ని నిరసిస్తారు.

పాశ్చాత్యశాస్త్రం భౌతికశాస్త్రం అవటమే దీనికి కారణం. అది పదార్థ విజ్ఞాన శాస్త్రం. అంటే అది తను సృష్టించ దలచిన సార్వజనీనిక సూత్రాలకు పదార్థ నియమాల మీదా భౌతిక దృష్టాంతరాల మీదా ఆధార పడుతుంది. వీటికి అందనివి లేవు అంటుంది.

అది మనస్సును అంగీకరించటానికే వెనుక ముందులు చూసింది. చివరికి తప్పనిసరైతే అంగీకరించింది. కాని దాని దృష్టిమాత్రం భౌతిక దృష్టే. అంటే పదార్థానికి సరిపోయే సూత్రాలే దీనికీ సరిపోతవని దాని ఊహ.

'మనస్సు అనేది వొకటివున్నా, అదీ పదార్థమే. అసలు వున్నది పదార్థం! అది పరిణామంచెంది మనస్సు కావచ్చు. పదార్థానికి వర్తించే సూత్రాలు మనస్సుకీ వర్తిస్తాయి, అనే ధోరణిలో వారు ఆలోచించారు. అలా వర్తించని గుణాలూ, భిన్నంగా వుండే గుణాలూ, ఏవన్నా మనస్సుకి వుంటే అవిలేనట్లుగానే భావించి తృప్తి పడ్డారు. అటువంటి లక్షణాలకు సంబంధించిన అనుభవాలు ఎవ్వరికయినా కలిగితే వాటిని భ్రమలక్రింద కొట్టివేసి తమ దృష్టి మలిన పడకుండా స్వచ్ఛంగా వుండేటట్లు చూసుకున్నారు.

---

రామానంద ఛటర్జీ

మన మనస్తత్వ శాస్త్రజ్ఞుల దృష్టి వేరు. మనవాళ్ళకు అనాది వస్తువు పదార్ధంకాదు — ఆత్మ. ఇదే అనేక రూపాలు ధరిస్తూవుంది. అది ధరించే ఏరూపమూ పూర్తిగా అదికాదు. దాని ఛాయలు మాత్రమే. అది ఈ రూపాలవల్ల బాధ పడదు. దాని ప్రభావం వీటిమీద వుంటుందిగాని, వీటి ప్రభావం దానిమీద వుండదు.

ఎప్పుడూ అది అదిగానే ఉంటుంది.

కాబట్టి మనకు కనుపించే రూపాలు వొక దాని నుంచి వొకటి పరిణామం చెందినట్టివి కావు. అన్నీ ఆత్మలో నుంచి పుట్టుకొొచ్చినవి. అందువల్ల వొక రూపం స్వభావాన్ని బట్టి ఇంకొొక రూపాన్ని కొలవటానికి వీల్లేదు. అన్నీ ఆత్మపర మైనవే అవడంవల్ల అన్నింటికీ వర్తించే గుణం వొకటి వున్నా, దేనికి వుండే ప్రత్యేకత దానికి వుంటుంది. అందువల్ల వొకదాని నియమాలు వేరొకదానికి యథాతథంగా పరిపూర్ణంగా వర్తించవు. దేని చేష్టలను బట్టి దాని స్వభావాన్ని నిర్ణయించు కోవలసిందే.

మన పూర్వీకులు ఈ విధంగా ఆలోచించారు. ఆలోచించి మనస్సుకు సంబంధించిన, అనుభవంలోకి వచ్చిన లక్షణాల నన్నిటినీ వొప్పివేసుకున్నారు. భౌతిక సూత్రాలనుబట్టి ఈ లక్షణాలు వుండటానికి వీల్లేదు అనే బెదరింపుకు వాళ్లు లొంగలేదు. ''భౌతిక సూత్రాలవల్ల ఈ లక్షణాలు వుండటానికి వీల్లేకపోతే పదార్ధానికీ మనస్సుకీ స్వభావంలోనే తేడా వుండి వుండాలి. ఇవి క్రొత్త శక్తులు అయి వుండాలి. వీటిని మానసిక శక్తులు అందాం," అన్నారు.

ఈ ధోరణిలో నడిచి, దూరదృష్టీ, దూరశ్రవణం మొదలైన శక్తు లన్నింటికీ, భౌతిక శక్తులంత దృఢంగానూ విశ్వసించారు మనవాళ్ళు. ''పదార్ధానికి ఈ శక్తులు లేవు. నాకూ లేవు. కాబట్టి అసలు వుండటం అసంభవం,'' అని ఏ భౌతికవాది అయినా అంటే, ''నాకు వున్నాయి. ప్రయత్నిస్తే నీకూ వస్తవి," అని వాళ్ళు సమాధానం చెప్పారు.

ఈ శక్తులు కండ్లకు రాక మనస్సుకి కనపడే శక్తులు. అంటే ఎవ్వరికివారు అనుభవంద్వారా తెలుసుకో గలిగినట్టివి.

ఏదో వొక నెపంతో అనుభవాలను యాదృచ్ఛిక సంఘటనలక్రింద జమకట్టి ఎక్కువకాలం బ్రతుకలేం. అనుభవాలు గుండెలమీద గ్రుద్దుతుంటే మనకు సంబంధం లేనట్లు ఎన్నాళ్ళు మన గలుగుతాం?

పాశ్చాత్య శాస్త్రవేత్తలు ఈ పరిస్థితినే ఎదుర్కోవలసి వచ్చింది. క్రమక్రమేణా అనుభవం వారిని లోబరచుకోజొచ్చింది. ఇందుకు రెండు ఉదాహరణలను క్రోడీకరిస్తాను.

జేమ్స్‌బ్రెడ్ అనే ఆయన పెద్దడాక్టర్. ఆయన మానసిక శక్తుల్లో నమ్మకం లేని

మనిషి. ఒకరోజు ఆయన ఒకప్రదర్శనం చూడ్డం తటస్థించింది. అందులో ఒక వ్యక్తి తన మానసిక శక్తితో ఒక యువతికి గుండుసూదులు గుచ్చినా బాధ లేకుండా చేశాడు. ఇది ఒట్టి గారడీ అనుకున్నాడు బ్రెడ్. తానే వెళ్ళి ఒక గుండుసూదిని గోటిలోకి గుచ్చాడు. ఆ యువతి ఏమాత్రమూ బాధ పడలేదు. నాటినుంచీ మానసిక శక్తుల్లో నమ్మకం ఏర్పడింది. నమ్మకం కలగటమే కాదు—వాటిని తనలో అభివృద్ధి పరుచుకుని, వైద్యంలో ఉపయోగించాడు.

ఓవెన్స్ కాలేజీకి చెందిన ప్రకృతి శాస్త్రోపాధ్యాయుడు డా॥ విలియం సన్ అనే ఆయన మరొక సంఘటన తెలియజేశాడు.

ఒక వ్యక్తి తన మానసిక శక్తిచేత ఒక యువతికి నిద్రమత్తు కలిగించాడు. యువతి నిజంగా నిద్రపోతుందా?—లేదా? అనే మీమాంశ వచ్చింది. నిద్రపోవటం అసంభవ మనుకున్నాడు, అక్కడేవున్న నేత్రవైద్యుడు విల్సన్. వెంటనే వేదిక ఎక్కి, ఆ యువతిని పరీక్షించి, నిద్రపోతున్నమాట వాస్తవమేనని తేల్చుకున్నాడు.

ఇటువంటి సంఘటనలు అనేకం తమ అనుభవంలోకి రావటంవల్ల ఇటీవల పాశ్చాత్య శాస్త్రవేత్తలు చాలా మారటం జరిగింది. డా॥ రైడ్, డా॥ ఎలక్జీ కేరల్ మొ॥ శాస్త్రవేత్తలు ఈ శక్తులను అనేక



"మీరు పోట్లాడుకున్నప్పుడు మెట్లు కింద కున్నవా? పై కున్నవా?"
"కిందనుంచి చూస్తే పైకున్నవి. పైనుంచి చూస్తే కిందకున్నవి."

పరిశోధనలు జరిపి ఋజువు పర్చారు. మనిషిలో ఇంతవరకూ తెలుసుకోలేని శక్తులు ఎన్నో ఉన్నాయని నిరూపించారు. ఈ దృష్టి వారిని క్రమ క్రమేణా మనకు సన్నిహితుల్ని చేస్తూ ఉండేది. మన పూర్వులు నడిచిన దారిన వీరు నడవటానికి ప్రయత్నిస్తున్నారని అనిపిస్తూవుంది. దారి ఒకటిగానే కనిపిస్తూంది కనుక — గమ్యస్థానం కూడా ఒక్కటే అయి వుండాలి... నేటి పరస్థితి ఈ విధంగా ఉండటంవల్ల మానసిక శక్తులను గురించి మనవాళ్లు చెప్పిన మాటలు నిజం కావచ్చుననే అభిప్రాయం ఎక్కువమంది ఆలోచనా పరులకు కలగడానికి అవకాశం ఏర్పడుతూ వుంది.

(సశేషం)

# విచిత్ర వానపాము

వానపాములు 7,000 రకాలు వుంటాయని శాస్త్రజ్ఞుల అంచనా. ప్రతి ఎకరా నేలలో రమారమి 50,000 వాన పాములవరకు వుంటాయి. ఇవి నీలం, ఆకుపచ్చ, గోధుమ రంగులలో వుంటాయి. కొన్ని రకాల వానపాముల పొడవు ఒక అంగుళానికి మించి వుండవు. కాని ఆస్ట్రేలియా, దక్షిణ అమెరికాలలో ఇవి 5 అడుగుల మొదలు 12 అడుగులవరకు వుంటాయి.



"ఆస్ట్రేలియాలోని వానపాము"

మొన్న నీమధ్యనే అమెరికన్ జంతు శాస్త్రవేత్త ఒకావిడ కొలంబియన్ యాండీస్‌లో 15,000 అడుగుల ఎత్తుగల కొండ దగ్గర 4 1/2 అడుగుల పొడవు, 2 1/2 అం॥ ల లావు గల వానపాము నొకదానిని కనుగొన్నది. దీనితల పాామువలె వెడల్పుగా వుంది.



# యువతీలోకం



## నరాల బలహీనత

మనం చిన్నప్పుడు బాగా ఎరిగివున్న స్త్రీలను కాపరానికి వెళ్ళినాక, గంపెడు పిల్లలను కని సంసారతాపత్రయం పడినాక, ఎప్పుడయినా చూడటం తటస్థిస్తే ఎంతో ఆశ్చర్యం కలుగుతుంది.

ఆ ఆశ్చర్యానికి కారణం వారిలో వచ్చినమార్పు వారు వివాహం కాకపూర్వం ఎంతో వుత్సాహంగా వుండటం, జీవితం పట్ల ఎంతో సద్భావం కలిగివుండి ఆనందాతిశయంతో నిండి వుండటం మనం ఎరుగుదుం. అటువంటివారిని ఇప్పుడు చూసేటప్పటికి నిస్పృహకూ, నిరాశకూ ఆట పట్టయి వుంటారు.

ఈమార్పుకి అనేక కారణాలు వుండవచ్చు. రకరకాల బాధ్యతలతో నిండివున్న కుటుంబ భారాన్ని మొయ్యలేక వా రలా అయిపోయి వుంటారు. చిన్న చిన్న విషయాలకే కసురుకోవటం, అనవసరంగా ఇతరుల మీద కేకలు వెయ్యటం చేస్తూవుంటారు. అంతేకాదు ఇతరులను తేలిగ్గా అపార్థం చేసుకోవటం, ప్రతిదానికీ వులికిపడి భయపడటం వారి ముఖ్యగుణాలుగా కనుపిస్తాయి.

వారితో కాసేపు కూర్చుంటే జీవితం అంటే మనకు కూడా కంగారు పుడుతుంది. పిల్లలు కాస్త కనుమరుగైతే ఏమయిపోతారో అని వారికి భయం. భర్త ఇంటికి రావటం ఆలస్యం అయితే ఏ కారుక్రింద పడ్డారో అని వారికి భయం. ఇతరులతో మాట్లాడటానికి భయం.

వారి భర్తలతో మాట్లాడితే. "ఏం జరిగిందో ఏమిటో తెలియదు. ఇటీవల వొట్టి అనుమాన స్వభావపుది అయింది" అంటాడు. "ప్రతిదానికీ ఉద్రేకపడుతుంది. అరుస్తుంది" అంటాడు.

ఇదివొక జబ్బేల్ల డాక్టర్లకు చూపిస్తే ఈజబ్బుకి ఏక పేర్లు చెపుతారు. ఆ పేర్లు చాలా పెద్దవిగానూ, విచిత్రంగా ధ్వనించేవిగానూ వుంటై. కాని మామూలు భాషలో చెప్పుకోవాలంటే ఇదినరాల బలహీనత.

నరాల బలహీనత ఇతరత్రా ఆరోగ్యం చెడటంవల్లా, మానసిక భౌతిక ఆరాటాల వల్లా వస్తుంది. ఆరోగ్య వంతు

వసుమతీ రామారావు

లకు కూడా ఆరాటాలు వుంటై. ఈరో జుల్లో ఆరాటంలేని మనిషి అనేవాడే వుండడు. అది నిజమే. కాని ఈ జబ్బు లక్షణంగల మనిషికి ఆరాటం అకారణంగా వుంటుంది. కనీసం ఉత్ప్రేక్షించు కున్నదై వుంటుంది. అకారణంగా వచ్చే ఈ భయానికి పునాది ఏ చిన్నతనంలోనో వుంటుంది. ఇందుకు వొక పత్రికా రచయిత జీవితాన్ని ఉదహరించాడు రాబర్ట్ వో్బ్రియన్.

ఈ రచయిత తన తల్లి మరణం విని పూర్తిగా చెదిరిపోయాడు. తల్లిమీద ప్రేమ ఉండటం, తత్ఫలితంగా ఆమె మరణానికి విచారపడటం సహజమే. కాని ఈ రచయిత రియాక్షన్‌లో వైపరిత్యం ఏదో వున్నట్టుగా కనుపించింది. అతని పరిస్థితుల్లో అంత చెదరవలసిన అవసరం కనుపించలేదు. మరి అలా ఎందుకు జరిగింది? వో్బ్రియన్ చెపుతున్నాడు.

"ఆ రచయితను, పసితనంలో వొంటరిగా ఇంట్లో విడిచిపెట్టి తల్లిదండ్రులు బయటకు వెళ్తూవుండేవారు. అలా వెళ్ళినప్పుడల్లా అతను విపరీతమైన భయానికి లోనవుతూండేవాడు. ఆ భయం అతనిలో నిగూఢంగా వుంది. నరాలను పట్టుకొని వుంది. ఇప్పుడు తల్లి మరణించి తనను శాశ్వతంగా విడిచిపెట్టి పోయింది. ఈ సంఘటన నరాలను పట్టుకొని వున్న అతని చిన్ననాటి భయాన్ని కదిపింది. దానితో అతను అవుసరానికి మించిన భయానికిలోనై కుప్పకూరగా కూలాడు."

ఈ విధంగా కొన్ని సంఘటనలు మరుగునఉన్న ఏస్ప్రహాలనో కదిపి మనిషిని భయోత్పాతంలో ముంచి ఎత్తటం కద్దు.

నరాలు చిట్లటానికి ఇదొక కారణం. ఇందుకు ఇంకొక ముఖ్యకారణం కూడా వుంది. అది మనలో వున్న రక్షణ విధానాలు, అంతకు ముందే శిధిలం అయి వుండటం.

మనశరీరం తన్నుతానుకాపాడుకోటానికి కొన్ని రక్షణ విధానాలను సృష్టించుకొని అపాయం వచ్చినప్పుడు వాటి మీద ఆధారపడుతుంది. అటువంటి రక్షణ విధానాలు ముందుగానే శిధిలం అయి వుండటం వల్ల బయటనుంచి వచ్చి తగిలే ఆఘూతాలకు నరాలు తేలికగా చిట్లుతై.

ఇటువంటి రక్షణ విధానాలలో ముఖ్యమైంది హేతువాదం. అంటే మనలో వున్న ప్రతి బలహీనతకూ వొక కారణం చెప్పుకొని సర్దుకు పోవటం; సంతోషించటం. ఉదాహరణకు ఒక త్రాగుబోతును తీసుకుందాం. అతను పైవర్గాలలో కలిసి మెలిసి వుండటానికి గాను త్రాగుడు అవసరమని సర్దిచెప్పుకుంటాడు. అంతేకాదు. ఈ విధంగా ఏర్పడ్డ పరిచయాలు తాను చేస్తున్న వ్యాపారానికి అవసరమనీ, అందుకుగాను తాను

త్రాగుతున్నాననీ చెప్పుకొని వొక భ్రమను కల్పించుకుంటాడు. ఈ రక్షణ విధానం ద్వారా కల్పించుకున్న భ్రమలతో తన్ను తాను రక్షించుకుంటూ వుంటాడు.

తన్ను తాను రక్షించుకోటానికి ముఖ్యమైన మార్గం మరొకటి వుంది. అది ఆవేశాలను వేరు దారికి త్రిప్పటం. మనకు మనభర్త మీద కోపం వస్తుంది. భర్త మీద కోపం చూపలేంగదా! మరి ఆ కోపాన్ని మనం భరించలేని స్థితిలో వుంటాం. ఏదో వొక విధంగా దానిని బయటకు పంపితే తప్ప మనకు స్వాస్థం చిక్కదు. ఆ కోపాన్ని మనకు ఎదురు తిరగలేని పిల్లలమీద చూపుతాం. దాన్తో నరాలు సడలి మన మనస్సులు శాంతిస్తయి.

మరొక విధానం మనలను ఎదుర్కొన్న సమస్యయొక్క వునికినే అంగీకరించకపోవటం. ఆ సమస్య లేదు అనుకుంటాం. తప్పినంతవరకు దాని బాధ నుంచి తప్పుకు తిరుగుతాం. సమస్యను అచైతన్యంలోకి నెట్టి, మరచిపోతాం.

ఈ రక్షణ విధానాలు అదృష్టవంతుల పట్ల వాళ్ళ జీవితాలు ముగిసేవరకూ వుపయోగిస్తయి. మరణానంతరం ఏమవుతుందీ అనేది వేరే ప్రశ్న. కాని దురదృష్టవంతులకు ఈ విధంగా జరగదు. ఆరాటాలనూ, భయాలనూ భరించలేక ఈరక్షణవిధానాలు తుత్తునియలు అవుతై. అప్పుడు వ్యక్తి వాటికి లోబడి వూరుకుంటాడు. నరాల బలహీనతవల్ల కుప్పకూరగా కూలిపోతాడు.

వేగం ఎక్కువైన ఈనాటి మన సంఘంలో ఈ పరిస్థితి ఎక్కువగా మనలను ఎదుర్కొంటూ వుంది. ఈ జబ్బు ఎక్కువ అవుతూవుంది. బాధలనూ, ఆరాటాలను ఈ సంఘంలో స్త్రీ ఎక్కువగా దిగమింగి బ్రతకవలసిన అవుసరం వుంది. గనుక స్త్రీ ఈ బాధ ఎక్కువగా అనుభవిస్తూవుంది. స్త్రీలు నరాల రోగులుగా వుంటున్నారు.

అయితే ఈ జబ్బు లక్షణాలు ముందుగానే తెలియటంవల్ల కాస్త జాగర్త తీసుకుంటే, ఈ అపాయాన్నుంచి మనలను మనం కాపాడుకోగలుగుతాం.

ఎక్కువగా పని చేసేవారికి విశ్రాంతి మేలును చేకూరుస్తుంది. మనో వ్యాధితో సతమత మయ్యేవారికి ఇతర కుటుంబ సభ్యుల సానుభూతి ఉపయోగపడుతుంది. నరాల బలహీనతను నయంచేయవచ్చు. కాని అసలు రాకుండా చేసుకోవటం అన్ని విధాలా మంచిది. అనుమానం రాగానే తన బాధను వున్నది వున్నట్లుగా ఆప్తులకు చెప్పుకుంటే బరువుతీరి అనారోగ్యానికి గురిఅయ్యే అవకాశం తగ్గుతుంది. వొక పనివల్ల ఆరాటం హెచ్చితే కాస్త సేపు దానిమీదనుంచి దృష్టిమరల్చటానికి ఏ సినిమాయో చూడటం మంచిది. అన్నిటికన్నా జీవితాన్ని తేలికగా చూడగలగటం ముఖ్యం. ఈ మనస్తత్వం ఈ జబ్బుకి పెట్టనికోటా, త్రవ్వనిఅగడ్తానూ.

# నిసమైన దేశభక్తి



నీవు దేశభక్తుడువు కావాలని వుందా ? ఉంటే ఐకమత్యమే దానికి ఆధారం. ప్రతివారూ ఐకమత్యం కావాలనే అంటుంటారు. కాని అనేక శక్తులు అనేక రకాలుగా పనిచేస్తూ ఉంటాయి. అనేక మనస్సులు—అనేక చేతులూ రకరకాలుగా పని చేస్తూ వున్నాయి. మీరు నిలబడినచోటనే ఉండండి. ఒకే దృష్టితో నడవండి.

దేశం చిన్న ఉద్దేశాలు గల పెద్ద వ్యక్తులవల్ల బలపడదు. పెద్ద ఉద్దేశాలు గల చిన్న వ్యక్తులవల్ల మాత్రమే బలపడుతుంది. ప్రజలు అధికారంకోసం తహతహ లాడుతూంటారు. అందరూ ఏకమైతే ఎంత అధికారాన్ని సంపాదించ గలుగుతారో ఊహించండి.

మీదేశాన్ని, ప్రజలను ప్రేమించండి. ఏకీభావాన్ని పెంపొందించుకోండి. మీకూ ప్రజలకూ మధ్య ఎటువంటి ఉల్లిపర పొరు ఉండకూడదు. సమిష్టి జీవితం కోసం మీ వ్యక్తి జీవితాన్ని అర్పణ చేయండి. మీరు ముందుకు నడవండి— దేశం అనుసరిస్తుంది. 'నేనే భారత దేశాన్ని' అనే భావం మీ ప్రతి అణువుకూ కలిగేట్లు ప్రవర్తించండి.

''భారతదేశమే నా శరీరం. కన్యాకుమారి — నా పాదాలు. హిమాలయాలు నా శిరస్సు. నా శిరోజాలనుంచి గంగానది ప్రవహిస్తోంది. బ్రహ్మపుత్రా—సింధునదులు నా చేతుల్లోంచి ప్రవహిస్తూన్నవి. వింధ్య పర్వతాలు నా వడ్డాణం. నేనే హిందూదేశాన్ని. దాని తూర్పు పడమరలు నా చేతులు. ప్రజలను నా కౌగిలిలోకి తీసుకో గలందులకు నేను నా చేతులను చాచాను. నేను విశ్వాన్నంతా ప్రేమించ గలను.

అది నిలబడి అనంతంలోకి చూస్తూ ఉంది. నా చైతన్యమే విశ్వాత్మ. నేను నడుస్తూంటే భారతదేశమే నడుస్తుందని పిస్తుంది నాకు. నా ఉచ్ఛ్వాస నిశ్వాసలు భారత దేశానివే. భారతదేశం నా ముఖతా మాట్లాడుతూంది. నేనే భారత దేశాన్ని— నేనే శంకరుడినీ — నేనే శివుణ్ణినీ?

ప్రతి వ్యక్తికీ ఇటువంటి భావం కల గాలి — నిసమైన దేశభక్తి యిదే. దేశ భక్తి పరాకాష్ఠ నందుకోవటమంటే ఇదే. ఇదే వేదాంతం కూడా.

స్వామి రామతీర్థ

# పిల్లలు జాగర్త

కుటుంబ జీవితం విషయంలో తలిదండ్రులు లక్ష్యపెట్టని ముఖ్య విశేషం వొకటివుంది. అదేమిటంటే తాము పిల్లలతో మాట్లాడే వైఖరీ, పిల్లలు వింటూవుండగా వొకరితో వొకరు మాట్లాడుకునే వైఖరీనూ.

పిల్లలను గురించి పరిశోధనలు జరిపిన డాక్టర్ జేమ్స్ బొసార్డ్ అనే ఆయన ఇది మంచిపనికాదని ఉద్ఘాటించాడు. కుటుంబంలో తరచూ జరిగే సంభాషణ యొక్క ప్రభావం పిల్లలమీద చాలా ఎక్కువగా వుంటుందని ఆయన విశ్వాసం.

మామూలుగా భోజన వేళలో నలుగురూ జేరతారు. సంభాషణ ప్రారంభం అవుతుంది. తెలియకుండానే ఎవరికి వారు అందులో పాల్గొంటారు. ఇటువంటి సంభాషణలను బొసార్డ్ రికార్డుచేసి ప్రతి కుటుంబానికీ సంభాషణా రీతి వొకటి వుంటుందని నిర్ధారణచేశాడు.

వీటిల్లో ముఖ్యమైన పద్ధతి ఆయన పరిశోధనల ప్రకారం ఇతరులను విమర్శించటం. ఎక్కువ కుటుంబాల సభ్యులు భోజనాలదగ్గర కూర్చొని తమకు తెలిసిన వారినందరినీ విమర్శిస్తూ వుంటారు. ఇదేమంత మంచిపని కాదని బొసార్డ్ అభిప్రాయం.

ఇది వ్యతిరేకదృష్టి. జీవితాన్ని ఈ దృష్టితో చూడటం మంచిదికాదనీ, ఇటువంటి సంభాషణ పిల్లల చెవులన పడటం వారి భవిష్యత్తుకు మంచిదికాదనీ బొసార్డ్ అభిప్రాయపడ్డాడు.

ఇటువంటి వాతావరణంలో పెరిగిన పిల్లలు కలుపుగోట్టుతనాన్ని కోల్పోయి సంఘానికి వ్యతిరేకులుగా తయారౌతారు. ప్రజాకంటకు లవుతారు.

బొసార్డ్ పరిశోధనలు జరిపిన మరొక కుటుంబంలో, ఆ కుటుంబ సభ్యులకు సంఘంమీద వున్న వ్యతిరేకత, చీటికీ మాటికీ గిల్లి కజ్జాలు పెట్టుకోవటంగా పరిణమించింది. ఈ దృష్టిని కూడా పిల్లలు తమకు తెలియకుండానే జీర్ణించుకుంటారు. అయితే "ఈ దృష్టి యొక్క

శ్రీమతి మనోరమ

పర్యవసానం వారి వివాహాలయిం తర్వాత గాని బయటపడదు'' అన్నాడు బొసార్డ్.

వివాహం అయిన పిదపగాని గిల్లి కజ్జాలు పెట్టుకునేవారిబుద్ధి విజృంభించదు. అప్పుడు వారి కుటుంబ జీవితం నరకం అవుతుంది.

ఇటువంటి కుటుంబాల వల్ల పిల్లలకు జరిగే అపకారం పైకి స్పష్టంగా కనుపిస్తుంది. అలా పైకి కనుపించకుండా పిల్లలను పాడుచేసే రీతులు కొన్ని వున్నాయి.

అవి ప్రదర్శనాభిలాష కలిగిన కుటుంబాలు. ఈ కుటుంబ సభ్యులు చాలా తెలివిగా మాట్లాడుతారు. వారి హాస్యోక్తులకు మనం ముగ్ధులం అవుతాం. అయితే ఈ ప్రయత్నం తమ తెలివిని ప్రదర్శించుకోటానికి జరుగుతుంది గనుక ఈగుణం పిల్లలకు పట్టుపడి, వాళ్ళ జీవితాలను పాడుచెయ్యటం మాత్రం ఖాయం. వీళ్ళు నాటకాల్లోని పాత్రలుగా మాట్లాడి, ప్రవర్తించి జీవితంపట్ల వుండవలసిన సహజ దృష్టిని కోల్పోతారు. ఎప్పుడూ పదిమంది దృష్టిని ఆకర్షించాలనే ప్రయత్నంలో వుండి హాస్యాస్పదులు అవుతారు. ''వాగుడుగాళ్ళు''గా పరిగణించబడతారు. వసపిట్టలౌతారు.

అంతేకాదు. ఎప్పుడైతే పదిమంది తమ మీద దృష్టిని కేంద్రీకరించరో, అప్పుడల్లా వాళ్ళు తమను లెక్కచెయ్యడంలేదని బాధపడి విపరీతార్థాలు తీసి స్నేహాలను చెడగొట్టుకుంటూ వుంటారు. ఇతరులను సరిగా అర్థం చేసుకోటానికీ, సద్భావం వృద్ధి చేసుకోటానికీ ఈ దృష్టి గొడ్డలిపెట్టు.

అయితే మంచి పద్ధతి ఏది? దీనికి ఈ విధంగా సమాధానం చెప్పాడు బొసార్డ్.

కుటుంబ జీవితంలో పిల్లల అభివృద్ధికి పనికివచ్చే సంభాషణా విధానానికి 'నిర్వచనా విధానం' అనినామకరణం చేశాడు ఆయన.

ఈ విధానం ప్రకారం కుటుంబ సభ్యులు వ్యక్తులను గురించీ, సంఘటనలనుగురించీ అతి నిగ్రహంతో చర్చిస్తారు. హుందాగా, వొక ఆదర్శాన్ని మనస్సులో పెట్టుకొని, దానితో కొలిచి మాట్లాడుతారు. అవసరం అయినప్పుడు హాస్యరసంతో మనస్సులను రంజింపజెయ్యటానికి వారు వెనుదీయరు.

అంతేకాక పిల్లలకు అనేక విషయాలు తెలిసేటట్లు చేస్తారు.

ఈ రీతివల్ల పిల్లలు బాగుపడుతారు.

మనం అనుసరించే విధానాలు అపాయకరమైనవి అని తెలిసినప్పుడు, వాటిని తేలిగ్గా మార్చుకోవచ్చుని కూడా బొసార్డ్ అభిప్రాయ పడుతున్నాడు. అలా మార్చుకునే అవకాశమే లేకపోతే ఈ పరిశీలన వల్లా, ఈ జ్ఞానంవల్లా ప్రయోజనం ఏముంటుంది గనుక? ★




ప్రతి వ్యక్తి జీవితంలోనూ, అతను మర్చిపోలేనిది, విడమర్చి యితరులకు చెప్పలేనిది—ఒకవేళ చెప్పినా యితరులు వేరుగా అర్థం చేసుకొని, అతనికి విలువకట్టేది—ఏదో రహస్యముంటుందని నా నమ్మకం. అలాంటి రహస్యాలు కల్గి ఉండటం మానవునకు సహజమేమో ! అదే మానవ జీవితంలోవున్న మహోన్నత, ఉత్కృష్టతాలేమో !

మొన్నీ నడుమ, మా ప్రక్క యింటివారమ్మాయి "సుగుణ" మాటల సందర్భంలో, ఆ

అమ్మాయి భర్తను గురించి చెప్పటం జరిగింది. అక్కా, అక్కా, అంటూ నాతో, ఎంతో కల్సిమెల్సి ఉంటుంది.

"అప్పుడప్పు డెందుకనో అక్కా, నాకు చచ్చిపోవాలనిపిస్తుంది".

"ఏమిటమ్మా, ఆ శ్మశాన వైరాగ్యం"

"నిజంగానే అక్కా" అంటుండగానే అదొక రకంగా మారిపోయింది సుగుణ మొఖం.

"అదేమిటి సుగుణా. నీ కేమైనా పిచ్చా...నీకేమి తక్కువ ? శ్రీమంతుల ఏకైక బిడ్డవు...కొంపతీసి, మా మరిది గారిపై కోపంరాలేదుగదా !" అన్నాను సుగుణను సంతోషపెట్ట ప్రయత్నిస్తూ.

"నా కంత అదృష్టం లేదక్కా....నే నసలంత అదృష్టవంతురాలను గాదు" అన్నది ఏడుస్తూ.

సుగుణభర్త తల్లితరపు చుట్టం. అత నదొక రకమైన వ్యక్తి. సుగుణకు యిష్టంలేకపోయినా, తల్లి పోరు వల్ల అమాయకుడైన తండ్రిని, వాళ్ళంతా కల్సి ఏమైనా చేస్తారేమోననే భయంతో, తన కొరకు కాకపోయినా, తన తండ్రికొరకు వివాహమాడినట్లు వెక్కి, వెక్కి, ఏడుస్తూ చెప్పింది సుగుణ. కిలకిలా నవ్వుతూ, ఎంతో అందంగా ఉండే ఆ అమ్మాయి హృదయంలో అంతబాధ యిమిడుందని ఎవ్వ రనుకొంటారు ? ఆ బాధ, వ్యధ, రగిలి, జ్వాలై వెర్రితలలు వేస్తే ఎవ రార్పగలరు ?

నా వివాహం అయి మూడు సంవత్సరాలైంది.

నా భర్త రాము, నేనూ, యీ మూడు సంవత్సరాలనుండి, పాలు తాగుతున్న పిల్లలలా జీవిస్తున్నామనిపించింది. నిజానికి ఈ జీవితంలో ఎవ్వరు సుఖపడుతున్నారు ? సున్నావచ్చిన వాడికన్నా, ఒక్కమార్కు వచ్చినవాడు మెరుగట. అంతే యీ జీవితం కూడాను. రాము, ఎంతో సౌమ్యుడు. మంచివాడు. మంచి వాడని నే ననటమేగాదు, అయిన వారు, కానివారు, ఎరిగున్నవా రందరూ, అదే మాటంటారు. ఆఫీసులో వారి క్రింద పని చేసేవారు, పైవారు, అందరూ రామంటే ఆదరాభిమానాలు చూపిస్తుంటారు. ఎంతో గౌరవమిచ్చి ప్రేమిస్తుంటారు. అతనిలో ఏమి గొప్పతన ముందని వాళ్ళంతా అతనంటే, అంత ఆప్యాయంగా ఉంటా రనిపిస్తుంది నాకు. "ఓ_రామూ ? నీ చిరునవ్వుతో లోకాన్ని మోసపుచ్చ గలవుగాని, నన్ను మాత్రం గాదు సుమా ! నీవు చెప్పకపోయినా, ఆ నవ్వులో అవ్యక్తమైన బాధ, వ్యధ యిమిడున్నవని నాకు తెల్సు" అని అనాలని నా కప్పుడప్పుడు అనిపిస్తుంటుంది. మే మిద్దర మెంతో సరదాగా, నల్గురూ తలంచినట్లెంతో అనురాగపు టానందాలతో బ్రతుకుతున్న మా సంసారంలో, ఏదో లోటున్నట్లు నా కన్పించుచుతూంటుంది. మానవుడు తనను

ప్రేమించే వ్యక్తినిగాక మరొక వ్యక్తిని ప్రేమించుతుంటా దనుకొంటా. అందు వల్లనే జీవిత మింత క్లిష్టసమస్యగా తయారైందేమో!

రాము తనకు తాను చెప్పకపోయినా మా అత్తవారి పొరుగింటావిడ చెప్పగా అతని విషయాలు కొన్ని తెల్సుకో గల్గాను.

''రాము కుటుంబం ఒకప్పుడు బాగా వున్న కుటుంబం. వ్యాపారంలో నష్టాలు వచ్చి, బాగా చితికిపోయింది. వాళ్ళ యింటికి, రెండు మూడు యిళ్ళవతల వాళ్ళకు దూరపు బంధువులు, బాగా వున్న వారు, ఉంటూండేవారు. వాళ్ళకు 'సరూ' అనే ఒకమ్మాయి ఉండేది. సరూ ఒక్కగా నొక్క కూతురు. ఎర్రగా, అందంగా, ఎంతో చలాకీగా వుండేది. రాము, సరూ కలిసిమెలిసి చదువుకొంటూ ఉండేవారు. ఆ రెండు కుటుంబాలవారు వాళ్ళిద్దరూ భార్యభర్తలై, ఎంతో ఆనందంగా ఉంటా రనుకొంటూ వాళ్ళను చూచుకొని మురిసి పోతూండేవారు. తరువాత పై చదువుకు రాము పట్నం వెళ్ళాడు. సరూని చదువు మాన్పించి, యింటివద్దనే హిందీ, సంగీతం చెప్పిస్తుండేవారు. అలారోజులు గడచిపోతుండగా, మా మామగార్కి వ్యాపారంలో బాగా నష్టంవచ్చి, కుటుంబం పూర్తిగా చితికిపోయింది. సరూకు యితర సంబంధాలు చూస్తున్నారని తెల్సి




"కొత్తగా రిలీజవుతున్న సినిమాకి టికెట్లు కొన్నాను."
"అయితే బట్టలేసుకోడం మొదలెట్టనా''
"ఆ తప్పకుండా మొదలెట్టు టికెట్లు రేపటికే"

ఒకనాడు మా మామగారు వెళ్ళి సరూ తండ్రి నడుగుతానన్నారట. రాము వద్దని ఎంతగానో చెప్పాడట కూడాను. మా అత్తగారూ, మా మామగారూ సరూ అంటే ఎంతో ప్రేమగా వుండటంవల్ల రాము మాట వినక వెళ్ళి అడిగారట. వారు; పోయిన తరంలో వాళ్ళ కుటుం బంలోని ఆడపిల్ల నొకరిని మా మామ గారి కుటుంబంలోనే యిచ్చి వివాహం చేశామనీ; పెళ్ళైన సంవత్సరంలోనే పెళ్ళికొడుకు చనిపోయాడనీ, అందు వల్లనే సరూకు బైట సంబంధం చేయ దలచామనీ, చెప్పారట.

ఆ తరువాత కొద్దికాలానికే ''సరూ''కు పెళ్ళి బ్రహ్మాండంగా జరిగింది. దుర

దృష్టవశాత్తూ సంవత్సరం తిరగకముందే సరూ భర్త గుండెజబ్బుతో చని పోయాడు. అటు తరువాత సరూ తండ్రి వాళ్ళ ద్వారా వీళ్ళ ద్వారా సరూను వివాహమాడ మని రాముకు రాయబారాలు పంపాడట. రామూ మొదట్లో తనసలు పెండ్లి చేసుకో దలచుకొనలేదనీ, తరువాత సరూని చేసుకొనననీ చాల గట్టిగా చెప్పాడట. సరూకు కూడ బైటనుండి రెండు మూడు సంబంధాలు వచ్చినా, ఆమె ఒప్పుకొన లేదట. మా పెళ్ళైన రెండు నెలలలోనే ననుకొంటాను సరూ ఆత్మహత్య చేసుకుంది.

"ఉండి ఎవ రనుభవించారు చెప్పు? ఆ పిల్ల ఉసురు పెట్టుకున్నారు'' అంటూ యింకేవేవో ఆవిడగారు అన్నది. ఆ తరువాత వూరుకొనలేక మా చిన్న మరదలను పిల్చి చాటుగా ''సరూ వదిన నెరుగుదువా ?'' అని అడిగా అదొక రకంగా.

''ఓ! సరూ వదినె ఎంత అందంగా ఉంటుందనుకున్నావు ? చాల మంచిది'' అంటూ ఆ పదేళ్ళ పిల్ల నా బాధను గ్రహించకుండా పరుగెత్తుకొని పోయింది.

''నేను మాత్రం కాదా?'' అని అడుగు దామనుకొన్నా. కాని సిగ్గుతో, బాధతో, వ్యధతో అడుగలేకపోయాను. ఏదో కొద్దిగా పరిచయమున్న మా మరదలే, సరూ అంటే అంత యిదిగా ఉంది గదా, యిక రాము కెలా వుండుండాలి? ప్రేమించు కొన్నారు. పెళ్ళి చేసుకొని ఆనందంతో కాలం గడపాలని ఊహించు కున్నారు. అటువంటి ఎన్నో కలలుగన్న రామూహృదయానికి తగిలిన గాయాన్ని ఎవరు మాన్పగలరు ?

నాకు ఆ హృదయంలోను, 'సరూ' వుండవల్సిన యీ యింటిలోను ఎలాంటి స్థాన ముంది ? ఇటువంటి ఆలోచనలతో సతమత మౌతుంటాను. మరీ రాము ప్రక్కన పరున్నప్పుడు,అత నేమీ ఎరుగ నట్లు ఎంతో ఆప్యాయంగా, ప్రేమతో కబుర్లు చెబుతూన్నప్పుడు, 'సరూ' గుర్తు కొచ్చి అదొకరకంగా బాధ పడుతుం టాను. నా స్థానంలో సరూ వుండటం జరిగుంటే రాము యింకెంత సంతోషా నందాలతో వుండేవాడో ననుకొం టాను. వెంటనే నే నెచ్చటున్నదీ, నా స్థితీ గుర్తుకు రావటంతో అతని గాయాన్ని రేపుతానేమో ననే భయంతో, తెచ్చి పెట్టుకొన్న నవ్వుతో నా పాత్ర నిర్వ హిస్తుంటాను.

నా గత జీవితం గూర్చి తెల్సి రాము కూడా నా లాగే బాధపడుతూ, ఆలో చిస్తూంటాడేమో!

* * *

"రవి ఎంతో మంచివాడు. ఎర్రగా, సన్నగా, బారుగా ఉండేవాడు. అతని కళ్ళె ప్పుడూ దేనికొరకో వెతుకుతున్నట్లుం

దేవి. అతనూ, నేనూ రెండు సంవత్సరాలు సహాధ్యాయులం. అప్పుడే మా యిద్దరకూ స్నేహం ఏర్పడింది. క్లాసు వక్తృత్వ పోటీలలోనూ, అనేక యితర కార్యకలాపాలలోను మేమిద్దరం పాల్గోంటూ వుండేవాళ్ళం. అతను పరిచయం కానివాళ్ళ ముందేమీ మాట్లాడేవాడు కాదు. అన్నింటికీ 'ఊ' కొడుతుండేవాడు. చివరకు మాత్రం తను చేయదల్చుకొన్న దేదో చేసి ఊరుకొనేవాడు. పరిచయం వున్న నాబోటి వారితో, ఎంతో సరదాగా వుంటూ వుండేవాడు. అతని కెదురుగా కబుర్లు చెప్పుకొంటూ కూర్చొంటే కాలం తెలియకుండానే గడచి పోతూండేది.

అతనూ, ఉన్న కుటుంబంలోనే పుట్టాడు. ఒక్కగా నొక్క కొడుకు. ఎప్పుడూ నీటుగా, శుభ్రంగా ఉండి, కులాసాగా కాలం గడపటమంటే అతనికి తగని సరదా. అతనికి కూడా నా మాదిరి గానే, చల్లని గాల్లన్నా, వానజల్లన్నా మహా యిష్టం. ఒకటి రెండుసార్లు, నేను వాతావరణం చల్లగా వున్నప్పుడు, బీచివెంట నడుస్తూవుంటే అతను తన కారులో వచ్చి బీచివెంట నడుస్తూవుండగానూ, కారులోనే కూర్చొని, ఏదో పుస్తకం చదువుకొంటూ వుండగానూ చూశాను. అలాంటి సమయంలోనే, ఒకనాడు మొదటిసారిగా మా యిద్దరికీ పరిచయ మయ్యింది. ఆ పరిచయమే విడిచి వుండలేని స్నేహానికి దారి




"చూశారూ! ఆ అమ్మాయి నన్ను ముక్కు లేని ముఖం అంటూ పోతుంది. ఎంత పొగరు!"
"అయితే అది చెప్పింది నిజమా, కాదా అని నన్నడుగుతున్నారా?"

తీసింది. ఆ స్నేహమే, నా జీవితాన్ని మానని గాయంగా చేసింది. నావలె, అతనుకూడా ఆ చల్లని వాతావరణం కొరకు తహతహలాడతాడనీ ఎంతో ఆహ్లాదాన్ని పొందుతూంటాడనీ తెలుసుకొన్నప్పుడు నేనెంతో ఆనందించాను. అభిరుచులొక్కటైన వ్యక్తులు కల్సినప్పుడు, వారి స్నేహం భవిష్యత్తును గుర్తించక, పరిస్థితులను లెక్కచేయక, నానాటికీ వృద్ధిపొంధట మనేది అతి సహజమైన విషయ మనుకొంటాను.

మా నాన్నకు, అమ్మకు, చదువు మీదెంతో అభిమాన ముండటంవల్ల, నా అభీష్టానుసారంగా, నేను చదువుకొనటానికి వారు ఒప్పుకొన్నారు. నేను కూడా వాళ్ళిచ్చిన అవకాశాన్నీ, స్వేచ్ఛనూ అర్థంచేసుకొని, హద్దుపద్దుల

లోనే నడుస్తూవుండే దాన్ని. కాని రవి విషయంలో మాత్రం అలా వుండలేక పోయాననే చెప్పాలి. నాకూ, రవికీ వున్న సంబంధం, అమ్మకూ, నాన్నకూ తెలుసునో లేదో నాకు తెలియదు. నే నెప్పుడూ చెప్పనూలేదు. వాళ్ళు నన్నడగనూలేదు. మాది ఉన్న కుటుంబం కాకపోయినా, కూటికీ, గుడ్డకూ కరువు వాసిన కుటుంబం మాత్రం కాదు.

క్రమేణా రవికీ నాకూ చాల స్నేహం ఏర్పడింది. దాదాపు, ఎప్పుడూ మేమిద్దరం కలిసే వుంటూ వుండేవాళ్ళం. చల్లగావుంటేసరి, బీచికిగానీ, షికారుకుగానీ వెళ్ళటానికి రవి తయారు. ఒక్కొక్కసారి, అలా బీచిలో కారును పార్కుచేసి, చెరొక పుస్తకం తీసి చదువుతూ, మాట్లాడకుండా గంటలు, గంటలు గడుపుతూండేవాళ్ళం. క్లాసులు కూడ ఎగగొట్టుతూ వుండే వాళ్ళం. చివరికి రవిని గనుక, ఒక్కరోజైనా, చూడకపోతే నా మనస్సు పరిపరి విధాలుగా పోతూవుండేది. అతని ఆరోగ్యం బాగుండలేదేమోననీ, ఏక్సిడెంట్ ఏమైనా జరిగిందోమోననీ భయపడుతూ వుండేదాన్ని.

రవికి కారు చాల వేగంగా డ్రయివు చేయటం యిష్టం. అప్పుడు నేను భయపడుతూంటే, తాను నవ్వుతూండేవాడు. లోలోన నాకు చాల భయంగా వున్నా వీలయినంతవరకు పైకి కనిపించకుండా కూర్చునేదాన్ని. ఒకటి రెండు సార్లు, మే మలా మెరీనాలో వెళ్ళుతుండగా, ఏక్సిడెంట్ జరిగినంత పని అయ్యింది. అత నలాంటప్పుడు నవ్వుతూ "ఏమిటి శశీ భయంగా వుందా ? జీవితం పైన అంత మమకార మెందుకు?" అనేవాడు. సరదాగా, కులాసాగా, నిశ్చింతగా కాలం గడుపుతూండే వ్యక్తి నోటినుండి, అలాంటి మాటలు విన్నప్పుడు నా మనస్సులో అనేక భావాలు పరుగులెత్తేవి.

ఒకరోజు ఏదో మాటల సందర్భంలో నా స్నేహితురాలు రమ నాకు రమ్మనమని ఉత్తరం వ్రాసిందనీ, నేను వాళ్ళింటికి వెళ్ళుతాననీ రవితో అన్నాను.

"రమా — ! — ఆమె నీ రూమ్ మేట్ కదూ ?... శేఖరు భార్య గదూ ?" అని అడిగాడు రవి.

"అవును. నీకెలా తెలుసు?"

"నాకు వారిద్దరూ తెలుసు శశీ. రమను మొదట నాకు యిస్తానన్నారు" అన్నాడు నవ్వుతూ.

"మరెందుకు చేసుకోలేదు?"

"లేదు......అంతే......"

కొంతసేపు యిద్దరిలో ఎవ్వరమూ, మాట్లాడలేదు. నేను రమనుగూర్చి ఆలోచిస్తున్నా.

రమ పోయిన సంవత్సరం నా రూమ్ మేట్. పెళ్ళి అవటంతో చదువుకు స్వస్తి చెప్పింది. అప్పుడు రవికూడా రమను

గూర్చే ఆలోచిస్తున్నాడేమో, నాకు తెలియదు. అలా ఆలోచిస్తున్నాడనే నేను అనుకున్నాను.

కాసేపటికి రవి తలెత్తి "శశీ ఒక్క విషయం అడుగుతాను నిజం చెబుతావా?'' అన్నాడు నెమ్మదిగా.

ఏమడుగుతాడోనని నేను భయపడ్డ మాట మట్టుకు నిజం. అనదలచుకొన్న మాట చాలగట్టిగా, ఖచ్చితంగా, అని వేయటం రవికి అలవాటు. ''నన్ను పెళ్ళి చేసుకోవటం నీకు యిష్టమేనా?'' అని అడుగుతా డనుకొన్నాను. తడబడుతూ ''అడుగు...చెబుతా,'' అన్నాను.

''రమ సుఖపడుతుందనా, నీ ఉద్దేశ్యం ?''

"ఎందుకు సుఖపడదు? ఇద్దరూ చదువు కొన్నవారే. డబ్బుకు డబ్బూ వుంది'' అన్నాను ఎంతో తేలికపడ్డ హృదయంతోనూ, ఒక విధమైన నిరుత్సాహంతోనూ.

''అక్కడే పొరబడుతున్నావు శశీ. ఎదో చదువుకొన్నంత మాత్రాన, మానవునిలో పశుత్వం పోయి, అమరత్వం వస్తుందంటావా? అజ్ఞానికి అహంకారం అలంకారమట. అందులో డబ్బుంటే సరి, కన్నూ మిన్నూ కన్పించనే కన్పించవు" అని కొంతసేపు వూరుకొని, ''రమ విషయం నాకంతగా తెలియదుగాని, శేఖరు విషయం నాకు పూర్తిగా తెలుసు. నేను కూడా ఆ భాగ్యవంతుల తెగకు చెందిన వాడనేనని నీకు తెలుసునా, శశీ?



"అదేమిటిరా వెధవ, ఈ వయసులో సిగరెట్ల నేర్చుకుంటున్నావ్ ?"
"ఏదైనా నేర్చుకోవటానికి ఇదే మంచి వయసని మీరే చెప్పారుగా."

డబ్బూ, చదువు సంధ్యలూ వుండటం వేరూ, తోటి మానవుని అర్థం చేసుకో గల్గటం వేరు. నిజంగా నీవు వాళ్ళ మాటలు వింటే, యీ కాలంలో కూడా ఇలాంటి వాళ్ళున్నారనీ, చదువుకొన్న వారు కూడా, ఇలాంటి ఆలోచనలు కలిగి వుంటారా అనీ నీవు ఆశ్చర్యపోతావు. తామే గొప్పనుకోవటం, ఎదుటి వారిని చాలా తేలికగా చూడటం వాళ్ళకు అల వాటు. వాళ్ళు నూతిలోని కప్పలలా బ్రతుకుతారు శశీ.

శేఖర్ కూడా అంతే. నీవు అక్కడికి వెళ్ళినప్పుడు, నీ స్నేహితురాలు, సర దాగా వుండే నీ ప్రాణసఖి రమ ఇప్పుడు పంజరంలోని చిలుక అనీ, స్వంత ఉద్దే

కాలు, కోర్కెలూ లేకుండా యాంత్రి కంగా కాలం గడపే జీవచ్ఛవమనీ నీవే తెలుసుకొంటావు'' అన్నాడు చాల ఆవేశంగా.

మేము అంత కలిసి వుంటున్నా, అతని మనోభావాలను ఆసాంతం తెలుసుకొనటానికి నేను వెనుకాడు తుండేదాన్ని. అందుకని చెబుతూంటే వింటూ కూర్చునేదాన్ని. ఆ రోజులలో అట్లా వుండటం, అతనంటే గౌరవం వల్లనో, ప్రేమవల్లనో, భయంవల్లనో మరెందువల్లనో యిప్పుడు చెప్పలేను.

రమను గురించి అంత ఆవేశంగా అతను చెప్పిన తరువాత నే నేమీ అడుగనూ లేదు, అతను విడమరచి చెప్పనూలేదు.

నేను రమ వద్దకు వెళ్ళి రెండు రోజులున్నాను. రమ నోటితో చెప్పకపోయినా ఎంత నిస్సారంగా జీవితం గడుపుతుందో తెల్సుకొన్నప్పుడు చాల విచారించాను. తరువాత కలుసుకొన్నప్పుడు, ఎందుకనో గాని రవి రమను గూర్చి అడగలేదు, అతని మాటలలో ఎంత సత్యముందో నేను చెప్పనూలేదు. కాని అతను అడగనందుకు నాకు మాత్రం చాలా ఆశ్చర్యం వేసింది.

ఆనాడు మేము గడపిన మధుర క్షణాలు, మాట్లాడుకొన్న అనేక విషయాలు, అన్నీ నాకు గుర్తున్నాయి. గతాన్ని తల్చుకొంటూ వుండటం, ఆలోచించుకోవటం, బాధపడటం, మానవ నైజం. దానినుంచి కూడా ఒక రకమైన వూరటనూ, సుఖానుభూతినీ పొందటం కద్దు. ఎవరి విషయ మెలావున్నా, నా విషయంలో మట్టుకు అది ముమ్మాటికీ నిజం. అవన్నీ తలచుకున్నప్పుడు చాల సిగ్గుగా కూడా ఉంటుంది.

నేను, అనేకసార్లు రవి నా స్వవిషయాలను గూర్చి అడుగుతాడని ''నన్ను పెండ్లి చేసుకొంటావా శశీ'' అని సూటిగా ప్రశ్నించుతాడని ఆశించుతూ వుండే దాన్ని. అటువంటప్పుడు ఎలా సమాధానం చెప్పాలా, అని భయపడుతుండే దాన్ని. కాని అనేక యితర విషయాలు నిర్మొహమాటంగా చెప్పి, అనేక విషయాలు సూటిగా అడిగే స్వభావంగల వ్యక్తి, యీ నా విషయంలో మాట్లాడే వాడు కాదు. ఎందుకలా వుంటుండేవాడో ఇప్పటికీ నాకు అర్థం కాలేదు.

ఒకసారి మా క్లాసువాళ్ళంతా కలిసి బృందావన్ గార్డెన్సుకు వెళ్లాము. రెండు రోజులు అక్కడే మకాం వేశాము. ఆ రెండు రోజులూ వొకఎత్తు. నా జీవిత మంతా ఒక ఎత్తు. ఆ రెండు రోజులూ మేమిద్దరం, దాదాపు అందరినీ వదలి, వేరుగా తిరుగుతూ వుండేవాళ్ళం. ఆ రెండు రోజుల్లో మేమిద్దరం ఒకరికొకరం వూహించుకోలేనంత దగ్గరయ్యాము. అది మంచికి జరిగిందో, చెడుకు జరిగిందో నాకు తెలియదు.

అయితే నేను యీనాటికీ పశ్చాత్తాప పడటం లేదు.

ఆ రోజు పౌర్ణమి. వెన్నెల పిండి ఆరబోసినట్లున్నది. అందులో వసంత కాలమవటంవల్ల, మేము ఆశించినట్లు, ఆ రాత్రి ఎంతో చల్లగా, నిర్మలంగా హాయిగా, ఆహ్లాదంగా వుంది. మేము అక్కడి 'లాన్' పై కొంచం దూరంగా, ఒకరిప్రక్క నొకరం పరున్నాము.

మానవుని జీవితంలో అనేక సంఘటనలు అనుకోకుండానే జరుగుతుంటాయి. మన మెన్నోసార్లు చాలా జాగ్రత్తగా ఆలోచించి, అట్లా ప్రవర్తించాలి, యిట్లా నడుచుకోవాలి, అట్లాంటి ప్రశ్నలకు యిట్లాంటి సమాధానా లివ్వాలి, అని పరీక్షకు వెళ్ళే విద్యార్థినిలా, యుద్ధానికి తయారై వెళ్ళే సైనికునిలా ఎన్నో అనుకోవచ్చు. కాని ఆ క్షణం వచ్చినప్పుడు అన్నీ మర్చిపోతాము. ఆవేశంతో, మైకంలో మనం అనుకోనివే చేసి వేస్తాము. మరో క్షణంలో దాని పర్యవసానాన్నిగూర్చి ఆలోచించటం—పశ్చాత్తాపమే ననండి, సిగ్గు పడటమే ననండి—జరుగుతుంది.

ఆనాడున్నంత దగ్గరగ, నా హృదయంలో రవి ఏనాడూ లేడు. అలాగే నేను కూడా అతని హృదయానికి చాలా దగ్గరకు జరిగినట్లు తలచాను. ఎలా అడగ్గల్గానో నాకు తెలియదు. అలా




"అదేమిటిరా! కొశ్చెన్ మార్కు ఫేస్ పెట్టావు షేక్‌హ్యాండ్ ఇవ్వగానే."
"మొత్తానికి పశువుల డాక్టరుగ సార్థకం చేసుకున్నావురా బాబూ! నవనాడులు కుంగిపోయాయి"

అడిగినందుకు ఇప్పటికీ నా ధైర్యానికి నేనాశ్చర్యపడుతుంటాను కాని అడిగాను.

"రవీ, నిన్నొక్కవిషయం అడుగాలనుంది...నీవు వేరుగా తలచకపోతే..."

"అడుగు శశీ, నీ కెందుకంత భయం నేనంటే? నేనూ మానవుడనే గదా. పైపెచ్చు నీకు సన్నిహితుడ్ని"

"అదిగాదు రవీ......"

"అడుగు శశీ. భయమెందుకు? నేను నిన్ను అడగటంలేదూ?"

"నీవు అప్పుడప్పుడూ ఏదో విచారంగా వుంటుంటావు. నిన్ను చూస్తే, నీ జీవితంలో విపరీత సంఘటన ఏదో జరిగినట్టుందని నా కనుమానం......"

''నీ కలాంటి అనుమాన మెందు కొచ్చింది శశీ?''

''వసుదా, నీవు చాలా సరదాగా, కులాసాగా, నిశ్చింతగా జీవితం గడపదల్చుకొనే వాళ్ళల్లో వొకడవు. కాని అప్పుడప్పుడూ నీవు జీవితాన్నిగూర్చి ఎంతో విరక్తిగా మాట్లాడుతూ వుంటావు. అప్పుడు సరదాగా, నవ్వుతూవుండటం గతాన్ని మర్చిపోవటానికి నీవు ఆడుతున్న నాటకమని, నాకు అనిపిస్తూ వుంటుంది'' అన్నాను చాల నిర్భయంగా.

"అవును శశీ,'' అని కొద్దిసేపాగి మళ్ళీ చెప్పసాగాడు రవి.

''మా అమ్మకు, నాన్నకు నేనొక్కడనే కొడుకుని.వాళ్ళు చాల భాగ్యవంతులు కూడాను. అందుకనే భాగ్యవంతులన్న నాకు చాల హేయంగా వుంటుంది. మా వూళ్ళో మా కొక పది ఎకరాల తోట ఉంది.దానిలో మేము వేసవికాలంలోనూ, అప్పుడప్పుడు ఇతర కాలాల్లోనూ వెళ్ళి ఉండటానికి వొక యిల్లు కూడా వుంది. మా తోటప్రక్కన ఉన్న మరొక తోటలో ఒక పేద కుటుంబం కూడా వుంటుండేది. వాళ్ళకు ఒకే ఒక కూతురు. చాల అందంగా వుండేది. ఆ అమ్మాయి పేరు లలిత. నేను ఆ యింటిలో వున్నంత కాలం, ఆట పాటలతో, కలిసి మెలిసి మేమిద్దరం కాలం గడుపుతుండే వాళ్ళం. వయస్సుతోపాటు, మేము ఒకరికొకరం దూరమయ్యాం. అంతకన్నా, నాకు లలితకు ఎలాంటి సంబంధమూ లేదు. కాని నేను లలితను వివాహమాడ దల్చుకొన్నాను.

ఒకనాడు నా ఉద్దేశ్యం లలితకు చెప్పినప్పుడు, ఆమె చాలసేపు ఏమీ సమాధానం చెప్పలేదు. సిగ్గువల్లనేమో నను కొన్నాను. నేను చాల మూర్ఖుడ్ని శశీ, ఆమెకు యిష్టమో, కాదో, ఖచ్చితంగా చెప్పమని చాల కోపంగా అడిగాను.

''రవీ, అదెలా సాధ్యం?'' అన్నది నెమ్మదిగా.

"ఎందుకుగాదు? నా పెళ్ళి నా యిష్టం నీకూ యిష్టమైతే సరి'' అన్నా ఎంతో ఆవేశంతో.

''రవీ మనం కష్టాలను కొని తెచ్చుకుంటున్నాము"

''అంటే...నీ ఉద్దేశ్యం?''

''నీవు కలవారి బిడ్డవు. నేనా కూటికీ గుడ్డకూ కరువాసినవాళ్ళ పిల్లను...... అలాంటప్పుడు ... అదెలా సాధ్యం?'' అన్నది.

నాకు కోపం వచ్చింది.

''నీకు యిష్టంలేకపోతే, యిష్టంలేదని చెప్పవచ్చుగా. ఎందుకిదంతాను? నాదే తప్పు. నన్ను క్షమించు. నీవు మంచి వాడ్ని చేసుకొని హాయిగా వుండు'' అంటూ అక్కడనుంచి బయలుదేరాను.

''రవీ?'' అంటూ లలిత పిల్చింది.

వెనుకకుతిరిగి లలిత దగ్గరకువెళ్ళి చూద్దునుగదా,ఆమెకన్నీరుకారుస్తూవుంది.

నేను ఏనాటికీ ఆ క్షణాన్ని మర్చిపో లేను శశీ. వేదాంతిలా భవిష్యత్తును సూచిస్తూ, ఎక్కువ చదువులేకపోయినా, లలిత చెప్పిన మాటలు, నా మూర్ఖత్వానికి కారణంగా కన్నీటితో నిండిన ఆమె కండ్లు, పశ్చాత్తాపడి మేము చేసుకొన్న బాసలు, మరువాలనుకొన్నా మరువ లేకుండా వున్నాను.

తరువాత ఒకనాడు మా అమ్మ నా పెళ్ళి విషయం తెచ్చింది. నేను మా అమ్మతో స్వేచ్ఛగా మాట్లాడ గలను గనక నా మనస్సులోని ఉద్దేశ్యాన్ని ఆమెకు చెప్పాను.

* * *

కొంతకాలం తరువాత నేను మళ్ళీ మా వూరు వెళ్ళేటప్పటికి లలిత తండ్రి చనిపోయాడనీ, మా తోట ప్రక్కనున్న ఎకరంపొలం మాకు అమ్మి, లలితా, వాళ్ళమ్మా, ఎక్కడకో వెళ్ళిపోయారనీ తెలిసింది. దానికంతకూ మా నాన్నే పుణ్యం కట్టుకొన్నాడట. ఊళ్ళో లలితకూ, నాకూ సంబంధ ముందనీ, లలిత తల్లే స్వార్థం కొద్దీ మాయిద్దరకూ సంబంధం ఏర్పరచిందనీ పుకార్లు పుట్టాయట. అవి భరించలేక, ఆ తల్లీ కూతురు అభిమానం కొద్దీ అక్కడ నుండి వెళ్ళి పోయారట.

దీనిలో మా నాన్న ఎలాంటి పాత్ర వహించి వుంటాడో నేను నీకు వేరుగా చెప్పనవుసరంలేదు. తదనంతరం ఒక నాడు మా నాన్న నన్ను పిలిచి రమను వివాహమాడమని అడిగారు. నేను చేసు కొనననని ఖచ్చితంగా చెప్పాను. అసలు ఆయనముందు నిల్చోని మాట్లాడటమంటే నాకిష్టముండదు. తోటివాళ్ళను పురుగులుగా చూచేవాళ్ళల్లో మా నాన్న ఒకరు. నిజానికి రమ అయితే యిష్టా, అయిష్టాలు, నాకేమీలేవు. అసలు రమను నేను బాగా ఎరుగను కూడాను. మా నాన్న అడగటంవల్ల, మరొక ఆలోచన లేకుండా, ప్రతీకారబుద్ధితో అన్నట్లు, కాదన్నాను.

తరువాత రమకూ, శేఖర్‌కూ వివాహం జరిగింది. మా నాన్నగారికి చాల కోపం వచ్చింది. ఆయనంటే మా యింట్లో అందరకూ హడలే. ఇహ ఆయనగార్కి కోపం వాస్తే చెప్పనే అవుసరంలేదు. ఆయన పట్టరాని కోపంతో, నన్ను తిడుతూ, నా అజ్ఞానానికీ, తెలివి తక్కువ తనానికి విచారిస్తూ, అంతస్థులు, కుటుంబ గొప్పతనం గూర్చి చెపుతూ లలితనూ, లలిత తల్లినీ దూషిస్తూ నీతి బోధలు చేశారు.

నేను నా కోపాన్ని అణచుకొందామని చాలా ప్రయత్నించాను. కాని రగులుతున్న నా హృదయం ఒక్కసారి గుప్పు మన్నది. మా తాతలు ఏ అంతస్థు నుండి ఏ అంతస్థుకు వొచ్చారో గుర్తుకు తెచ్చుకోమనీ మధ్య వొచ్చిన ముద

నష్టాలవల్ల గతాన్ని మర్చిపోవద్దనీ ఏదేదో నా నోటికి వచ్చినట్లు వాగాను.

అయనకు ఎదురుగా నిలబడి సమాధానం చెప్పినవాళ్ళు ఇంతవరకు ఎవ్వరూ లేరు. తన అహంకారం దెబ్బ తినటం వల్లనైతేనేమి, తను కలలో కూడ తలంచని విధంగా నేను సమాధానమివ్వటంవల్లనైతేనేమి, మా నాన్నగారు దెబ్బతిన్న బెబ్బులిలా లేచారు. కొడతారేమో అనుకొన్నాను. నేనూ ఏదోఒకటి తేల్చుకోటానికి భయపడకుండా నుంచున్నాను. వారు లలిత కుటుంబం ఎంత నీచకుటుంబమో ఏకరవు పెట్టటం మొదలుపెట్టారు. నేను భరించలేక పోయాను. ఆయనగారు కొద్ది నెలలక్రితం మా తోటలోనున్న చావిట్లో చేసిన పని గుర్తుకు తెచ్చాను. అంతే కాలితో నేలను గట్టిగా తన్నుతూ, నోటికొచ్చినట్లు తిడుతూ, "నీవు నా కొడుకువుగాదు... నా కడుపున పుట్టలేదు. నా యింట్లో నుండి పో." అని కేకలువేసి అంగలు పంగలువేసుకొంటూ బైటకి వెళ్ళిపోయారు.

ఇది జరిగి దాదాపు సంవత్సరమయింది. అప్పటినుంచీ యింతవరకూ నేను మా యింటికి వెళ్ళలేదు. మా తాతగారు అంటే మా అమ్మ నాన్నగారి యింటికి మట్టుకు వెళ్ళుతుంటాను. అక్కడే మా అమ్మను అప్పుడప్పుడూ కలుసుకొంటుంటాను.

ఆమె చిక్కి శల్యమయ్యింది. ఎప్పుడూ ఏడుస్తూనే వుంటుందట. మా తాతగారే నా కిప్పుడు డబ్బు యిస్తున్నారు. నా కాళ్ళ మీద నేను నిలబడి నా బ్రతుకేదో నేను బ్రతకాలని వుంది. అ సుదినం ఎప్పుడొస్తుందో.

అప్పుడప్పుడూ నేనూ, మా నాన్నగారూ, యిలా వుండటం బాగాలేదనిపిస్తుంది. మా నాన్నకూ నాకూ ఎలాంటి మనస్పర్థలూ లేవనీ, ఒక తరానికి మరొక తరానికి, ఆశయాలమధ్య కల్గిన సంఘర్షణే ననీ అనిపిస్తుంది. నిజానికి నా విచారమల్లా మా అమ్మనుగూర్చే. ఆమె కొరకే యింకా నేను బ్రతికున్నాను కూడాను. ఆమె నెప్పుడూ చూడాలని ఉంటుంది.——'' అంటూ, ఎంతో ఆవేశంలో చెప్పాడు.

తల్లిమాట వచ్చినప్పుడల్లా, అతని గొంతుక గాద్గదికమవటం నేను గమనిస్తూనే వున్నాను. అతని కళ్ళవెంట ఆ సమయంలో నీళ్లు కూడ కారివుండాలి.

నేను అతని మొఖంలోనికి చూడాలనుకొని కూడా చూడలేక పోయాను. కొంత సేపటికి అతను నాకు దగ్గరగా జరిగి కూర్చొని, నా రెండు చేతులూ పట్టుకొని "నన్ను అసహ్యించుకొంటున్నావా శశీ?" అని అడిగాడు, గద్గద స్వరంతో.

నేను ఏమీ మాట్లాడలేదు.

"శశీ నా హృదయంలో వున్న బాధ ఇంతవరకూ నేనెవరికీ చెప్పలేదు.

ఎవ్వరికీ చెప్పకూడదనుకొన్నాను కూడా. నీకు మాత్రం చెప్పాలనుకొంటూండే వాడిని. కాని నీ వేవిధంగా తీసుకొంటావో ననే భయంతో, యిన్నాళ్ళ నుండి నాకు నేనుగా చెప్పలేకపోయాను. ఈ ప్రపంచ ములో నాకేముంది? ఎవరున్నారు? అటు అమ్మా...'' అం టుం డ గా, అతని కన్నీటి చుక్కలు నా చేతులమీద పడ్డాయి. నా కళ్ళుకూడా కన్నీటితో నిండాయి. గొంతుకు ఏదో అడ్డుపడినట్లు మాట్లాడ లేక పోయాను.

* * *

ఆ తరువాత రవి ఒకనాటి సాయం కాలం వచ్చి బైటకు వెళ్ళి కాస్త కాఫీ త్రాగి, మెరీనాలో కూర్చొని పిచ్చాపాటి మాట్లాడుకోవచ్చు రమ్మన్నాడు.

నేను అతని మాటలకు వెంటనే సమాధానం చెప్పలేదు. చాలసేపు ఆ విషయం, యీ విషయం గూర్చి మాట్లా డుతూ కూర్చున్నాము. నాకు ఆనాడు బైటకు వెళ్ళటం ఎందుకు యిష్టంలేదో యీనాడు చెప్పగలనేమో! అతను నాకు, రావటం యిష్టంలేదని గ్రహించుంటాడు. నేను కూడ మాట్లాడుతూనే కారణం కొరకు వెదుకుతున్నాను. మాటల మధ్య లోనే "నీకు యీనాడు నాతో బైటకు రావటం యిష్టంలేదుగదూ. నేనొక పాపి నని నాకూ తెల్సు. నేను చనిపోతే నీ వేడుస్తావా శశీ?'' అంటూ సమా ధానం కొరకెదురుచూడకుండానే దబదబా బైటకు వెళ్ళి కారులో చాల విసురుగా కూర్చొని వెళ్ళిపోయాడు. నేను బిత్తర పోయి, వ్యాకులపాటుతో అతను వెళ్ళిన దిక్కుకే చూస్తూ నిల్చొన్నాను. మరొక క్షణంలో—రవికారు చాలా వేగంగా బైటకు వెళ్ళింది. ప్రక్కనుండి లారీ వచ్చింది—కెవ్వుమని పరిగెత్తాను. ఏముంది.? ... రవి రక్తంలో మునిగి వున్నాడు. ఆఖరిసారిగా కళ్ళుతెరచి "శశీ......అమ్మా......'' అన్నాడు.

అంతే రవికి నాకు ఋణం తీరి పోయింది. రవికి యీ ప్రపంచానికి ఋణం తీరింది. నా జీవితంలో ఆ అధ్యాయం ముగిసింది. దీనికి కారణం?.. ...ఎవరు?...నేనే...ఆ పాపం నాకు కొట్టకుండా పోతుందా?......పోదు.





చిత్ర పరిచయ పోటీకి

# 'నా కాలేజీ అనుభవాలు'

'లైమైంది...అన్నానికి రావే ?

..................

ఇవాళ కాలేజీ లేదా ?

..................

ఇట్లా ఏడుపు మొహం వేసుకొని కూర్చునేదానవు నీకు కాలేజీ ఎందుకు ?' ...అమ్మ సాధింపు ప్రారంభించింది.

అన్నదంటే అనదూ మరి. క్రొత్తగా మొట్టమొదటి సారిగా కాలేజీకి వెడుతూ ఎంతో వుత్సాహంగా వుండవలసిన దానిని పరిక్ష హాలులోకి వెళ్ళే విద్యార్థిని లాగా గుండె టక టకా కొట్టుకుంటుంటే పరధ్యానంగా కూర్చున్నానంటే...నాతో హైస్కూలులో చదివిన వాళ్ళందరూ మిగతా వూళ్ళు వెళ్ళి అక్కడ చేరారు. అదీ గాక అప్పుడు college చదువంటే ఒక idea లేక పోవటమే అసలు భయానికి కారణం. మాకంటే కొంచెం సీనియరు అయిన వాళ్ళందర్నీ ఏదో గొప్పగా వూహించుకొని "అమ్మో వాళ్ళలాగా మనం కావటానికి చాలా కాలం పడుతుంది" అనుకొని కాసేపు (మొదటి వారం రోజులు మాత్రం) "ఆ...మనం మాత్రం ఇంత కంటె బాగా చదివి class, వీలైతే University First తెచ్చుకోలేమా ?" అనే ఒక రకమైన భరోసా, ఇన్ని అనుభూతులతో మొదటి నెలరోజులు గడిపాము. college life లోని సంఘటనలు (మంచివైనా, చెడువైనా) జీవితానినే సరిదిద్ద గల్గేవీ, కళంకాన్ని ఆపాదించేవిగా వుంటాయి.

ఇక మేష్టర్ల సంగతి చూస్తే గంట కొట్టినా శృంగార కావ్యాన్ని వివరించి, వర్ణించి చెప్పేవాళ్ళు కొందరైతే (మాది కో-ఎడ్యుకేషన్ లెండి) అసలు క్లాస్ లోకి వచ్చీరావటంతోనే ఆడవాళ్లు తప్ప వేరొక తెగ ఏదీ లేదనుకొన్నట్లుగా వాళ్ళకేసి తిరిగి కూర్చుని వాళ్ళకే పాఠాలు వప్పచెప్పి పోయేవాళ్ళు కొందరు వుంటారు. ఇవన్నీ సరదా క్రింద తీసుకొనవలసిన విషయాలు.

ఇక మేమున్నామంటే (క్రొత్తగా చేరాం కనుక) ఎవరన్నా ఏమన్నా మాట అంటేచాలు, మోహం ఇంత చేసుకొని ఆరోజంతా పాఠం వినకుండా కాలేజీ నుంచి త్వరగా బయటపడేవాళ్ళం. ఎప్పుడైనా కొంచెం టైము దొరికితేచాలు ప్రపంచంలో ఎవరికీ లేని సమస్యలన్నీ (ఇలాటి మమ్మల్ని ఏడిపించే లాటివి)

---

కె. హేమ, బి. ఏ.

మాకే వున్నా యెంతగా బాధపడి వాళ్ళని నాలుగు తిట్టి వచ్చేసేవాళ్ళం. తరువాత తరువాత అదంతా అలవాటు, సరదా క్రింద మారి Body Guards రాని రోజున అదొక వెలితిగా అనిపించేది. కాని ఇప్పుడనిపిస్తోంది నిజంగా బాధ పడవలసిన పెద్ద పెద్ద సమస్యలు అనేకం వుంటే కేవలం అంత తేలికైన చిన్న విషయాలని పెద్దగా వూహించుకుని బాధ పడ్డామేమిటా అని ?

అన్నిటికంటె వింతయిన అనుభవం ఒకటున్నది. మా గ్రూపులో కొందరం మంచి కథలంటే (మనస్తత్వాన్ని చూపే లాంటివి) చెవికోసుకునే వాళ్ళం. మాలో కొందరు పత్రికలకి వాళ్ళ కథలు పంపి విసుగుపుట్టిన వాళ్ళు కూడా కొంద రున్నారు. అంతా అయిన తరువాత ఆఖరి రోజున ఫొటో పార్టీనాడు ఒక ప్రఖ్యాత రచయిత మా క్లాస్‌లోనే వున్నాడనీ, అతను Pen name తో కథలు వ్రాస్తూంటా డనీ, అతన్ని introduce చేసినప్పుడు విని మేమెంత బాధపడ్డామో చెప్పలేను. కనీసం కొద్ది కాలానైనా సామాన్య మైన ఈ ఆలోచనల నుంచి బుద్ధి మళ్ళించి, ఉత్సాహంగా, ఎంతో ఆసక్తిగా విజ్ఞాన విషయాలు మాకు బోధించే లెక్చరరుతో, అటువంటి రచయితలతో మా పరిచ యాన్ని వృద్ధి పరచుకొన్నట్లయితే కొంతైనా బాగుపడేవాళ్ళ మనిపిస్తుంది. కాని అప్పుడు ఇవన్నీ జ్ఞప్తికిరాని ఒక వింత కాలం. కుమారి జీవితంలో నుండి శ్రీమతిగా మారినపుడు ఎన్నో క్రొత్త బాధ్యతలు వచ్చి పెద్ద వాళ్ళైనట్లు ఎట్లా అనుభూతి కలుగుతుందో, అటువంటిదే హైస్కూలు జీవితం నుండి కాలేజీకి మారినపుడు కల్గుతుంది. ఈత రానివాడు నీళ్ళలో దిగి కొంతసేపు తంటాలుపడి ఒడ్డుకి వచ్చి స్థిమితంగా కూర్చుంటే ఎట్లావుంటుందో అలాగే కాలేజీ వదలి వెళ్ళిన తర్వాత ప్రతి Student కి కలిగే అనుభూతి. కాని కొందరి విషయంలో దీనికి పూర్తి వ్యతిరేకంగా వుంటుందను కుంటాను.

ఏమైనప్పటికి మాకు కాలేజీ జీవితం అనుకున్నంత భారమూ, కష్టమూ అని పించలేదు. మళ్ళా కాలేజీ విద్యార్థినై ఇంకా చదువుతే బాగుంటుం దనిపిస్తుంది ఇప్పుడు. అందుకనే వెనుకటి రోజులు మరువు రానివి, మరువలేనివి.



---

## సినిమా క్విజ్ - జవాబులు

1. బాలరాజు 2. పల్లెటూరి పిల్ల 3. కీలుగుఱ్ఱం
4. అన్నాచెల్లెలు 5. బొమ్మల పెళ్ళి




మనుష్యుడిలో జగత్తు గురించి, జీవితం గురించి అనాదిగా రెండు దృక్పథాలు పనిచేస్తూ వస్తున్నయ్.

1. జగత్తు, జీవితం, ఈ రెండూ దుఃఖ మయం. శీతోష్ణాల మధ్య సుఖ దుఃఖాల మధ్య, జనన మరణాల మధ్య మనుష్యుడు సుఖపడే దేముంది? కాబట్టి సాధ్యమైనంత వరకూ తనలో తాను ఉండగలుగుతూ, నిర్దుష్టమైన భావ స్థాయిలో స్థిరపడటం— (ఇందుకు మంచి ఉదాహరణ భర్తృహరి.) ఇది మామూలుగా సన్యాస దృక్పథం.

2. ఇదంతా నిజమే. కాని, మనుష్యుడు కేవలం కీలుబొమ్మ కాదు. తనను బాధించే శరీరాన్ని, పరిసరాలను, మనస్సును నిర్మాణాత్మకంగా మార్చు కొనగలిగే శక్తిగూడా మనిషికి వుంది. ఏది జగత్తును సృజిస్తోందో ఆ జ్ఞానమయమహిమాన్విత శక్తి మనుష్యుడిని సృజించటమే కాక, మనిషిలో అతని భవిష్యత్—పరిణామాన్ని నడిపే జీవాత్మక శక్తిగా కూడా సాక్షాత్కరించి వుంది; ఆ పరమ శక్తితో మానవుడి శారీరక మానసిక శక్తిని ఏకంచేయ గలిగామా, లంఘించ గలిగామా, జోడించ గలిగామా, అప్పుడు మనుష్యుడు సృజనాత్మక జీవి కాగలడు. శరీరం, మనస్సు, బైట ప్రకృతి— వీటి పరిమితులను అతిక్రమిస్తూ, మృత్యువుకు, అజ్ఞానానికి అతీతమైన శక్తిని అనుభవించగలడు అని— ఇది యోగ దృక్పథం. (పతంజలి ఇందుకు ఒక ఉదాహరణ) సన్యాసంలో జగత్తుతో విడిపోవటం ప్రధాన లక్ష్యం. యోగంలో జగత్తును వశంచేసుకొని, శరీరాన్ని వశం చేసుకొని, మనస్సును వశం చేసుకొని, వాటిని మానవునిలో గర్భితమై వున్న ఈశ్వరేచ్ఛకు వాహనాలుగా, సాధనాలుగా చేసుకొనటం.

కృష్ణదాస

ఓ విధంగా చూస్తే, బహుశః ముందు సన్యాసమార్గం తట్టివుండవచ్చు. అడుగడుగున దుఃఖాన్ని ఖిందించే జీవితాన్ని, జగత్తును అందు కతీతమైన ఒకానొక ఆనందశక్తికి లొంగదీసుకొన గలమనే ధైర్యం ముందు వుండి వుండక పోవచ్చును. ఇలా సన్యాసమార్గాన్ని అనుసరిస్తున్నా జగత్తు వుండనే వుంటోంది. శరీరమూ ఉండనే ఉంటోంది. కాగా వాటి బాధించే ధోరణీ కూడా వుంటూ వుంటుంది. కాకపోతే సాధకుడు కావాలని స్వయంగా బాధలు తెచ్చుకొనక పోవచ్చుకాని, అంతకు పూర్వమే శరీరంలో వుండి వుంటూవున్న ముల్లు కెలక వేస్తూనే వుంటుంది. శీతోష్ణాలు, సుఖదుఃఖాలు, జననమరణాలు—ఈచక్రం నిర్విరామంగా తిరుగుతూనే వుండె. మరి ఈ బాధకు ముక్తి మృత్యువేనా ? కాని పునర్జన్మ వుంటుందేమో? సృష్టికి మూలం సంకల్పం కాబట్టి, కోరికలను నిశ్శేషంగా సంయమాగ్నితో దహించేసుకుంటె, ఇక జన్మ కూడా వుండదు. కాబట్టి జన్మకు మూలమైన కోరిక అనే ప్రవృత్తిని చంపుకుంటె, ఇక జన్మ వుండదు. అనగా ఈ దుఃఖమయ భూమిపై జీవించవలసిన అవసరం వుండదు.

ఈ విధంగా జన్మ—విముక్తి సన్యాస మార్గపు లక్ష్యంగా వుంటుంది. కాని శారీరిక పదార్థమూ, జగతీ పదార్థమూ... ఇదంతా మార్పు లేకుండా, యథా ప్రకారంగానే వుంటుంది.

ఈతాత్త్వక ప్రశ్న ఇలా వుండగా, తక్షణ సమస్య ఒకటి సన్యాసిని ఎదుర్కొంటోంది. శరీరానికి తాను లొంగక పోవచ్చుగాని, తనకు శరీరం లొంగటం లేదు. అనగా దాని ధోరణి దానిదే. వ్యాధి, బాధ, వార్ధక్యం, మృత్యువు—ఇవి సన్యాసినీ వదలటంలేదు. వాటికి లొంగని ఆంతరంగికమైన చేతనా శక్తి సన్యాసికి, జ్ఞానికి ఉన్నమాట నిజమే. కాని వాటిని అతను నిర్మూలించటం లేదు. వాటి దారిన అవి, అతని దారిన అతను వెళ్తున్నారు. ఈ జీవిత—బాధను ఏదో జ్ఞాన—శక్తితో భరిస్తూ వుండవలసిందేనా ? మృత్యువు తర్వాత జ్ఞానానికి పునర్జన్మ బాధ లేదనుకుందాం. కాని మృత్యువు వరకూ తప్పనట్లేనా ?

ఈ జిజ్ఞాసలోంచే అనంతర ఘట్టం ఆరంభమైందనుకోవచ్చు. అదే యోగం. మృత్యువు వరకు కూడా ఈ శరీర—బాధను, జగత్—సంక్షోభను, జీవిత—దుఃఖాన్ని భరిస్తూ, చూస్తూ వుండనక్కర్లేదు. ఇప్పుడే, ఈ జీవితంలోనే, ఈ శరీరంలోనే దాని మూలతత్వాన్ని మార్చవచ్చు. శరీరం మనిషిని లొంగదీసుకుంటె, మనిషీ శరీరాన్ని లొంగదీసుకో గలడు. సన్యాసి ఏ జ్ఞానాన్ని అయితే బుద్ధిలో నింపుకొని, ఘనీభవించుకొని, మానసిక శరీరక వాంఛలకు లొంగ

కుండా, వివేకంతో వుండగలుగుతున్నాడో, ఆ జ్ఞానాన్నే శరీరంలోకూడా, నర నరాన, ప్రతి రక్తకణాన కూడా నింపుకొని, ఘనీభవింపుకుని, ఆరాటపడే, దుఃఖపడే, జబ్బుపడే తత్వం నుంచి శరీరాన్ని విడుదల చేయగలగవచ్చు అని తట్టింది అనుకుందాం. ఎందుకంటే జీవితమే ముందు భోగమయ జీవితాన్ని నేర్పింది. ఆ తర్వాత సన్యాసమార్గాన్ని చూపించింది. మళ్ళీ యోగమార్గాన్నీ చూపుతోంది.

బాధను భరించ గలగటం మానవుడి విజయంలో మొదటి ఘట్టం. బాధను అతిక్రమించి, బాధా-తత్వాన్నే రక్త మాంసాల్లోంచి, మనస్సులోంచి నిర్మూలించి, వాటిలో, అనగా రక్తమాంసాల్లో, మనస్సులో సృజనాత్మకమైన శక్తిని, బలాన్ని, ఆనందాన్ని ప్రవేశపెట్టి, స్థిరపరచి, చైతన్యవంతం చేయటం రెండవ ఘట్టం. ఈ రెండో ఘట్టం సిద్ధించనంత వరకూ సాధకుడికి ఆత్మ-త్వం లభించ వచ్చుగాని, ఈశ్వర-త్వం, విశ్వ-త్వం లభించవు. అనగా అతనికి పూర్ణత్వం సిద్ధించదు.

జీవితమే సాధకుడిని ప్రశ్నిస్తుంది. బలాత్కరిస్తుంది. దారి చూపుతుంది. బాధ నిజమే. కాని అలా అని బాధనుంచి తప్పుకొన్నంత మాత్రాన లాభం ఏముంది? ఆ బాధను కల్గించే అంశాలను అన్వేషించు, పసికట్టు. ఇదే సన్యాసీ చేస్తున్నాడు. కాని ఆ జిజ్ఞాస-జాలునే ఇచ్ఛా-శక్తిని కూడా వదులు. అప్పుడు బాధను, దుఃఖాన్ని కలిగించే అంశాల స్వభావ స్వరూపాలు కూడా మారతయ్. ఈ పని యోగి చేస్తాడు.

అనగా శరీర-నిర్మాణం జ్ఞాన-అధికారానికే (సన్యాస మార్గం) కాక, జ్ఞాన-ప్రభావానికి కూడా అనువుగా ఏర్పడి వుందన్నమాట. సర్వమూ జ్ఞానపు సృష్టియే అయినప్పుడు, ఆయా స్థాయిల పరిణామ వ్యత్యాసాలు ఎలా వున్నా, ప్రతిదానిలోనూ జ్ఞాన ప్రభావానికి స్పందించి, మారే తత్వం ఉందన్న




"కోడిపలావ్ కావాలని ఆర్డరిచ్చి గంట అయింది. ఇంకా ఎంతసేపు కూర్చోవాలయ్యా?"

"ఇంకో ఆయన వచ్చి, కోడిపలావ్‌కి ఆర్డరిచ్చేదాకా ఉండాలి. మీ ఒక్కరికోసం కోడిని కొయ్యడం కుదరదండి."

మాట. సన్యాసి అన్వేషించిన జ్ఞాన సత్యాన్నే యోగి సృష్టి సత్యంగా కూడా గుర్తించాడు. జ్ఞానం వేరు, జగత్తు వేరు కాదు యోగికి. అంటే పరస్పర విరుద్ధం కావు. అలాగే మనిషి, వాడి శరీరమూ పరస్పర విరోధులు కారు. కాగా శరీరం అతని ఉత్తమ భావసిద్ధికి సాధనంగా, ప్రతి-బింబంగా రూపొందగలదు.

సన్యాసికి ధ్యానయోగంలో జ్ఞాన మూలం శిరస్సులో, మెదడులో ఉన్నట్టు స్ఫురిస్తుంది. ఆ ప్రాంతంలో అతను జ్ఞాన-శక్తిని ఎలా నింపుకో గలిగాడు? జ్ఞాన-యోగంవల్ల అంతే. మెదడులోంచి లేచే లోపభూయిష్ఠమైన ఆలోచనా తరంగాలను వెళ్ళగొట్టి, ఆలోచనా శక్తిని జ్ఞానంతో ఏకం చేసుకుంటాడు.

కాని ధ్యానం మామూలు జీవితాన్ని స్తంభింప జేస్తేనేగాని సాధ్యం కావడం లేదు. కాగా, ధ్యానంలో మనస్సును, నిశ్చయించుకొన్న భావానికి ఆ పరిమిత సమయంలో జోడించుకో గలగటం చేతనవుతోందేగాని, ఆ తర్వాత మనస్సులో మళ్లీ పాత గజిబిజి తలెత్తుతూనే వుంటుంది. సన్యాసి వాటి మూలాన్ని తరచడు. యోగి వాటి మూలానికి వెళ్ళి, అక్కడ జ్ఞాన-జ్వాలను రగిలిస్తాడు. పాంచ భౌతికంగా, మానసికంగా అక్కడ ఏర్పడ్డ అజ్ఞానపు మోసను జ్ఞానజ్యోతితో ఛేదించి, అక్కడ తన ఇచ్ఛాశక్తికి పట్టాభిషేకం చేసుకుంటాడు.

మానవుడి స్వంత అభిప్రాయాల పటుత్వం సడలగానే, మెదడును ఎటు పడితే అటు ఆడిచ్చేశక్తి ఈ మూలానికి వుంది. శరీరంలోని ఈ మూలం అంతకు పూర్వం జరిగిన పరిణామ స్థాయికి అనుగుణంగా ఏర్పడి వుంటుంది. దానితో సన్యాసి జోక్యాన్ని వదులుకున్నాడు. అలా అని ఆ మూలం నిర్జీవమైపోదు. దాని తరంగాలను అది లేపుతూనే వుంటుంది.

సన్యాస మార్గంలో సంపూర్ణత్వం లభించటం లేదని అనుభవించిన సాధకుడు మెదడులోనే తన జ్ఞానశక్తిని సొంతం స్తంభింప జేయక, ఆ మెదడును సంచలింపజేసే ఈ మూలాన్ని అన్వేషించటం మొదలుపెట్టాడు. మెదడు, వెన్నెముక, వాటి జాలునే పోగా, నాభికి సమీపంలో అతనికి ప్రాణశక్తి అంతా చుట్టలు చుట్టుకొని వున్నట్లు అనుభవం అయింది. ఇదిగో ఈ మూలశక్తి స్వభావం మారనంత వరకూ, సిద్ధి సంపూర్ణంగా లభించదని తెలుసుకున్నాడు. ఇక్కడ అజ్ఞానం గడ్డకట్టుకొని వున్నది. ఇక్కడ జ్ఞానదీపం సూర్యకిరణంగా ప్రకాశించ నంతవరకూ, సాధకుడు రెండుగా చీలి వుంటాడు. బుద్ధి అతనిది. శరీరం అతనిది కాదు, అనగా అతని మాట వినదు. పరిణామంలో ఏర్పడిన మెదడుకు దానంతట అదే ఈ మూలాన్ని మేల్కొలిపి, స్వాధీనం

చేసుకొనే శక్తి లేదు. మిగతా జీవ-కార్య కలాపాలన్నిటికి మానవుడి ఇచ్ఛా శక్తి ఎలా అవసరమో, దీనికి కూడా, అంటే మెదడులోని జ్ఞానానికి ఈ మూలాన్ని జోడించటానికి కూడా మానవుడి ఇచ్ఛా శక్తి అవసరం.

పదార్థంపై భావ ప్రభావాన్ని సోకేట్టు చేసి, మార్పులు తేచ్చే సృజనాత్మక సామర్ధ్యం ఇచ్ఛాశక్తికి వుంది. నువ్వాకే విషయాన్ని తెలుసుకోవచ్చు. కాని దానిని ఇచ్ఛించనిదే, అది నీకు అనుభవంకాదు. ఈశ్వరుని సృజనాత్మకశక్తి ప్రతి మనిషిలోనూ ఈ ఇచ్ఛాశక్తి రూపంలో ప్రచ్ఛన్నమై వుంటుంది. ఇచ్ఛాశక్తిని కేంద్రీకరిస్తాడు యోగి- జ్ఞానశక్తిని ఇచ్ఛాశక్తిగా మార్చుకొని. ఈ మూలంలో చుట్టలు చుట్టుకొని వున్న పాములా వుండే పరిణామగ్రస్త శక్తి అప్పుడతని ఇచ్ఛాశక్తి తరంగాలకు మేల్కొంటుంది. సూర్యుడి ఉదయ కాంతికి నిద్రలోంచి మనుష్యుడు లేచినట్లే, శిరస్సులోని జ్ఞానభాస్కరుడి (బహ్మము) ఇచ్ఛాకిరణాలకు, పరిణామ బద్ధమై, నిద్రాణమై వున్న ఈ ప్రాణశక్తి మేల్కొంటుంది. అనగా శరీరానికి, మనస్సుకు ఒక నిర్ణీత గమనాన్ని, శీలాన్ని, స్వభావాన్ని నిర్దేశించే మూల ప్రాణశక్తి తననే, తన గమనాన్నే, తన స్వభావాన్నే నిర్దేశించే జ్ఞానశక్తిని గుర్తించి, నిలువునా తోకపై లేచి,



"ఒసేవ్ ! నీకు మతిగాని పోయిందేవిటే....! ?
అలా ఆఫీసు అకౌంట్ పుస్తకాల మీద ఏకంగా కూలబడ్డావ్.."
"పీటలు చేయించేదాకా కూర్చోవాల్సొస్తుంది యిహ పుల్లలు కొనకపోతే .... .... కుంపట్లో కూడ వాడాల్సొస్తుంది... :"

వెన్నెముక ద్వారా మెదడులో ప్రవేశిస్తుంది. అనగా జ్ఞాన తప్తమవుతుంది.

అనగా మనిషిని బాధించి, వేధించే జన్మాంతర్గత కల్మశం ఈ యోగాగ్నిలో భస్మమవటమే కాక, అతనికి ఈశ్వర తేజస్సుతో తన శరీరాన్ని, జగత్తును శాసించుకో గలిగిన యోగబలం కూడా వస్తుంది. యోగబలం రానంతవరకూ, సిద్ధి సంపూర్ణం కాదు. కాగా అది పరిణామానికి అవసరం. స్వంత బలప్రదర్శనానికి కాదు.

నేటి దుర్బల శరీరం ఉత్తమ పూర్ణ మానవుడికి తగిన రూపంగా వుండాలంటే, దాని రక్తకణాల్లో, నరాల్లో కొత్త మార్పులు రావాలి. ఈశ్వరేచ్ఛతో

జీవేచ్ఛను మిళితం చేసుకున్నప్పుడే, శరీరంలోని అణువణువు యొక్క ప్రస్తుతపు పట్టు సడలి, ప్రతి రక్తకణాన మృత్యువు కతీతమైన శక్తి స్థిరపడుతుంది.

వెన్నెముక దిగువ భాగాన వుండే ఈ మూల శక్తికి పేరు కుండలిని. ఇది సర్పాకారంలా వుంటుందని ఆ పేరు. మన్ను తిన్న పాములా వున్నాడేం అని అంటూవుంటారు జడుడిని చూసి. పాములా బుస కొట్టుతున్నాడంటారు. వాడు తోక తొక్కిన తాచులా అయ్యాడని అంటారు. పాము ఉపమానంలోని అంతరార్థం బహుశః ఇదేనేమో!

అయితే మనలో సర్పం ఒక్కటే కాదు ఉంది. పాములవాడు కూడా ఉన్నాడు. హృదయంలోంచి వేణువును, నాగస్వరాన్ని వినిపిస్తాడు. లేచిన సర్పం శిరస్సును తాకుతుంది–మట్టిపెళ్ల నక్షత్రాన్ని తాకినట్టు!

తన ఆదర్శాలకు తగ్గట్టుగా ప్రవర్తించలేకపోవటం అనేది నిత్యకృత్యం అని మనస్సు మేల్కొన్న ప్రతివాడూ గుర్తిస్తాడు. జీవితం ముందు తానెంత దుర్బలుడో గుర్తిస్తాడు. శరీరం, మనస్సు ఒకప్పుడు జడంగా వుంటయ్. ఒకప్పుడు పరవళ్ళు తొక్కుతయ్. సుడిగాలులు లేస్తయ్. ఒకప్పుడు అయాచితంగా, ప్రసన్నంగా వుంపై. ఇలాంటి దృశ్యాన్ని చూసే కేవలం ప్రేక్షక దశ పోవాలి. మనుష్యుడు ఈ మార్పులు చెందే శక్తిని అన్వేషించి, గుర్తించి, దానిని పట్టుకోవాలి. దానికి ఏకత్వాన్ని, యోగాన్ని, ఈశ్వర–బాంధవ్యాన్ని అలవర్చాలి. అప్పుడు అనుక్షణం నిండుగా, సంపూర్ణంగా జీవిస్తాడు.

వివిధ ఆసనాలు, ముద్రలు ఈ కుండలిని తమోగుణ బంధనలోంచి లేపి, మనిషిలో గుప్తమైవున్న ఈశ్వరేచ్ఛతో ఏకం చేయటానికే. ఇందుకై సంపూర్ణ నైతిక శక్తి అవసరం. ఇందుకే అహంకార రాహిత్యం అవసరం. ఈ కుండలినీ శక్తి ఈశ్వరుని పరిపాలనకు వశమైతేనే, అది నీకు లోపరహితమైన అనుభవాన్ని సమకూరుస్తుంది. అలా కాక నీ స్వంత కోరికలతో దాన్ని లేపితే, అది నీకే చుట్టలు చుట్టుకొని, నిన్ను కాటు వేస్తుంది. జీవనమార్గంలో దాని కాటు తినే చాలామంది కుంటుతారు. అలాకాక, దానిని పరమేశ్వరునికి సమర్పిస్తే, ప్రపంచం ఒక మహాసర్పంగా కన్పించినా, దాని పడగపై కన్పిస్తూవుంటయ్ శ్రీకృష్ణ పాదాలు. అవే మన పాదాలకు అడుగుజాడలు.

(సశేషం.)



# ఆల్బర్ట్ ఐన్‌స్టియన్

"ఫెర్మీ, స్జీలార్డ్‌లు కృషిచేసి, కను గొని, రచనలు చేసి నాకు పంపిన వ్రాతప్రతులను చదివిన మీదట మూల ద్రవ్యమైన యురేనియమ్ నుంచి బ్రహ్మాండమైన ఒక కొత్త శక్తి అచిర కాలంలోనే ప్రభవించగలదని దృఢంగా నమ్ముతున్నాను. దానితో తయారు చేసిన బాంబు ఏదైనా ఒక నౌకాస్థలం మీద పేలిస్తే, అది ఆ రేవునేగాక పరిసర ప్రాంతాన్నంతనీ ధ్వంసం చేయగలదు"— అని ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన విజ్ఞాన వేత్త, ఆల్బర్ట్ ఐన్‌స్టియన్ అమెరికా అధ్యక్షుడు రూజ్వెల్టుకు 1939 వ సంవత్సరంలో ఉత్తరం వ్రాస్తూ ఉల్లేఖించాడు.

తరువాత ఆరు సంవత్సరాలకు 1945 ఆగస్టు 6 వ తేదీని ఈ రకం బాంబు ఒకదాన్ని జపాన్‌లోని హిరోషిమా నగరం మీద పేల్చారు. దానివల్ల అరవై వేల మంది జనం చచ్చిపోయారు. లక్షమంది క్షతగాత్రు లయ్యారు. రెండు లక్షలమందికి నిలవడానికి నీడ లేకుండా పోయింది. పెద్ద పెద్ద భవనాలు ఆరువందలు బుగ్గి బూడిదా అయిపోయాయి. కొద్ది రోజులకే మళ్ళీ నాగసాకీ నగరంమీద ఇలాంటిదే ఇంకొక బాంబు పడ్డది. దానితో జపాను ప్రభుత్వం లొంగిపోయింది. రెండో ప్రపంచయుద్ధం సమాప్తమయింది.

'ద్రవ్యాన్ని శక్తిగానూ, శక్తిని ద్రవ్యంగానూ మార్చగలం' అని 1905వ సంవత్సరంలోనే ఐన్‌స్టియన్ తీర్మానించాడు. ఆ సిద్ధాంతాన్ని ఆధారంచేసుకునే ఈ ఏటమ్‌బాంబు తయారయింది. 'ద్రవ్యరాశిని సృష్టించడంగాని, నశింపు చెయ్యడంగాని జరుగని పని' అని తత్పూర్వపు వైజ్ఞానిక సిద్ధాంతం. కాని ఐన్‌స్టియన్ వేసిన లెక్కలు $E=mc^2$ అని సామాన్యంగా కనపడే గణిత సమీకరణానికి పునాదివేశాయి. అంటే కాంతి యొక్క వేగవర్గమును ద్రవ్యరాశిచేత హెచ్చిస్తే వచ్చునది శక్తికి సమానమన్నమాట. (శక్తి = ద్రవ్యరాశి × వేగపురేటు × వేగపురేటు).

ఆల్బర్ట్ ఐన్‌స్టియన్ 1879 మార్చి 14వ తేదీని దక్షిణ జర్మనీలోని అల్మ్ అనే పట్టణంలో జన్మించాడు. అతని ఒకటో యేట మ్యూనిచ్ పట్టణంయొక్క పరిసరగ్రామానికి అతని కుటుంబం తరలి వెళ్ళింది. ఆల్బర్ట్ తండ్రి ఒక విద్యుద్రసాయన కర్మాగారానికి అధిపతిగా ఉండేవాడు. ఆల్బర్ట్ పినతండ్రి

ఒకాయన ఇంజినీరుగా తరిఫీదు అయి ఈ కర్మాగార నిర్వహణలో వారి కుటుంబానికి సహాయం చేస్తూ వారితోనే ఉండేవాడు. ఆల్బర్ట్ తల్లికి సంగీతం అంటే ఇష్టం—ముఖ్యంగా బీథోవెన్ అంటే. సంగీతం మీద ఉన్న ప్రేమ ఆల్బర్టుకి అతని ఆరవయేట ఫిడేలు మీద పాఠాలు నేర్పించడానికి పురికొల్పింది. మొదట అతనికి అంతగా ఇష్టం లేక పోయినా రానురాను మొజార్టు పాటల మీద అభిరుచి కలిగింది. చిన్నతనంలోనే కలిగిన ఈ సంగీతాభిలాష జీవితాంతం వరకు ఉండి తీరిక వేళల్లో సంతోషంగా గడపడానికి అవకాశం కల్పించింది.

ఆల్బర్ట్ చిన్నప్పుడు బ్రహ్మాండమైన తెలివైన వాడిలాగ కనపడలేదు. మాటలే ఆలస్యంగా రావడంవల్ల అతని తల్లి దండ్రులు అతను పెద్ద మొద్దబ్బాయి అవుతాడేమోనని భయపడేవారుకూడా. చిన్నప్పటినుంచీ అతనివయసు కుర్ర వాళ్లతో కలిసి ఉండేవాడు కాడు. చేయకుండా సోమరిలాగా కూర్చుని ఏవేవో పగటి కలలు కంటూ ఉండేవాడు. శరీర శ్రమ అతనికి సరిపడదు. ఆట లాడేవాడుకాదు. సైనికులంటే అసహ్యం. మ్యూనిచ్ నగరంలో తరుచూ సైనిక ప్రదర్శనాలు జరుగుతూ ఉండేవి. చాలా మంది యువకులు ఎంతో ఉత్సాహంతో చూచేవారు. ఆల్బర్ట్‌కు మాత్రం సైనిక కవాతులంటే ఇష్టం ఉండేదికాదు. మానవులు యంత్రాల్లాగా పనిచేయడం అతనికి గిట్టేదికాదు.

ఐన్‌స్టియన్ పినతండ్రి అతనికి గణిత శాస్త్రం మీద ప్రేమను కలిగేటట్లు చేశాడు. ఏదైనా సమస్యని పరిష్కరించ డానికి బీజగణితం (algebra) ఎంతో సహాయం చేస్తుందని తెలియజెప్పాడు. అది వొక ఖులాసా అయిన శాస్త్రం. మనం వొక జంతువును వేటాడవలసి వుంటే దానికి తాత్కాలికంగా X అని పేరు పెడతాం. దానిని పట్టుకునే వరకు వెంటాడతాం. అని ఆల్బర్ట్ బుర్రలోకి ఎక్కించాడు. ఐన్‌స్టియన్ యొక్క యువక హృదయానికి రేఖా గణితం (Geometry) సదభిలాష కలిగించింది. సమస్యా పరిష్కారానికి ఉపయోగించే సాధనాలు — నిర్దుష్టమైన భాష, ప్రతి నిర్వచనానికీ ఇవ్వవలసిన రుజువు వాక్యాలూ, అందుకు సంబంధించిన తర్క వితర్కమూ, హేతువులూ మున్నగునవి —అతనిని ఆనంద చకితుణ్ణి చేశాయి.

ఐన్‌స్టియన్ బాల్యంలో అతనికి సంభవించిన సంతోష సంఘటనలు రెండు. మొదటిది అతని అయిదో యేట అయస్కాంతతత్వ దిక్సూచి (magnetic compass) బహూకరింపబడినప్పుడు. రెండవది అతని పన్నెండో ఏట యూక్లిడ్స్ జామెట్రీపుస్తకం కానుకగా వచ్చినప్పుడు అత నన్నాడు "ఈ పుస్తకం చిన్న తనంలో చదివి, అర్థం చేసుకుని జీర్ణించు

కొనని యువకుడు వైజ్ఞానిక సిద్ధాంతాన్వేషకుడు కాజాలడు'' అని.

పాపం అతని 15వ యేట మ్యూనిచ్‌లో తండ్రి వ్యాపారానికి అంతరాయం వచ్చింది. వెంటనే అతను ఇటలీలోని మిలాన్ నగరానికి కొత్త వ్యాపారం నిమిత్తం వెళ్లాడు. అప్పటికి ఇంకా ఆల్బర్ట్ మ్యూనిచ్‌లోనే డిప్లమా కోసం చదువుతున్నాడు. ఐన్‌స్టియన్‌కి స్కూలు భరించరానిదైంది. గణిత శాస్త్రంలో అతడు అందరికంటే అగ్రగామిగా ఉండే వాడు. ఇతర విషయాలలో వెనుకబడి ఉండేవాడు. బట్టీ పట్టే చదువు అతనికి పడేదికాదు. అతను గణితశాస్త్ర జ్ఞానంలో గొప్పవాడు అయినప్పటికీ భాషా జ్ఞానం లోనూ, జీవశాస్త్రజ్ఞానంలోనూ వెనకబడి ఉండేవాడు. పోలీటెక్నిక్ విద్యాధికారి అతని గణితశాస్త్రంలోని శక్తియుక్తులకు ఆశ్చర్యపడి ప్రవేశ పరీక్ష పూర్తిచేయ డానికి ఏర్పాటు చేశాడు. ఇక్కడి తరిఫీదు మ్యూనిచ్ స్కూలుకి భిన్నంగా ఉంది. వల్లెవేయడం, బట్టీపట్టడం లేదు. విద్యార్థులు స్వంతంగా ఆలోచించుకో డానికి అవకాశాలు ఉన్నాయి. ఉపా ధ్యాయులు సమర్థులు. వారు విద్యార్థులతో తర్కించడానికి ఒప్పుకునే వారు. ఇక్కడి పాఠశాల చదువు ఐన్‌స్టియన్‌కు తన జీవితంలో మొదటి సారిగా ఎంతో ఆనందాన్ని కలుగజేసింది. ప్రవేశ పరీక్ష పూర్తిచేసి జూరిచ్ ఫెడరల్ పోలీటెక్నిక్ స్కూలులో ప్రవేశించాడు.

జూరిచ్‌లో ఉండగా పదార్థ విజ్ఞాన శాస్త్రోపాధ్యాయుడుగా పని చేయాలని సంకల్పించుకొని తదనుగుణమైన పాఠాలు అభ్యసించాడు. స్విస్ పౌరసత్వం లభించింది.

1905వ సంవత్సరంలో పేటెంట్సు ఆఫీసులో పని చేస్తూనే ఏటమ్‌బాంబు తయారుచేయడానికి ప్రాతిపదిక అయిన సాపేక్షత్వ సిద్ధాంతం (Theory of Relativity) సూత్రీకరించాడు. అప్పటి వరకూ, పదార్థ విజ్ఞానశాస్త్ర మంతా అప్పటికి రెండు వందల సంవత్సరాలకి పూర్వం సూత్రీకరింపబడి, చాలా సమస్యలను విడదీయగలిగిన న్యూటన్ యొక్క గతినియమ సిద్ధాంతం (Newton's Law of Motion) మీదనే ఆధారపడి ఉండేది. దీనిలో కొన్ని చిక్కులు రానారంభించాయి. ఒక విమానం మీదనుంచి అది పోవు వైపునకే ఒక రాకెట్టును విడిచిపెట్టినట్టయితే దాని వేగము, రాకెట్టు వేగమూ విమాన వేగమూ కలిసినంత ఉంటుంది. కాంతి విషయంలో న్యూటన్ సిద్ధాంతాన్ననుస రిస్తే, చూచువాని వైపు కాంతి ఉత్పత్తి కేంద్రం ప్రయాణం చేసినప్పుడు కాంతి యొక్క వేగము ఎక్కువగా ఉంటుంది. ఉత్పత్తి స్థానము ఇతరత్రా ప్రయాణం చేస్తే కాంతి వేగం తగ్గుతుంది. అన్నా పోలిస్‌లో అమెరికా నేవల్ అకాడమీలో ఉపాధ్యాయుడుగా ఉన్న విజ్ఞానవేత్త

మైకేల్‌సన్ అనేవాడు కొన్ని ప్రయోగాలు చేసి కాంతి వేగ నిర్ణయం న్యూటన్ నియమావళికి అనుగుణంగా లేదని విశదీకరించాడు.

మైకెల్‌సన్ అభిప్రాయాను గుణంగా ఆలోచించి ఐన్‌స్టీయన్ ఒక నిర్వచనం తయారుచేశాడు: "కాంతి ఉత్పత్తి కేంద్రం యొక్క వేగము ఎంత ఉన్నప్పటికీ కాంతి ప్రేక్షకునికి సాపేక్షముగ ఒకే వేగముతో ప్రసరించును. ప్రేక్షకుని గతితో సంబంధములేదు." అనే ఈ నిర్వచనాన్ని కాంతి యొక్క వేగ నిత్యత్వ సూత్రం అంటారు. (The principle of the Constancy of speed of light).

ఈ ప్రవచనములో ఐన్‌స్టీయన్ యొక్క అఖండమైన మేధాశక్తి గోచరమౌతుంది. ఆశ్చర్యకరమూ, నమ్మనశక్యమూ అయిన పరమసత్యాలు అందులోనుంచి ఉద్భవించాయి. దీనిని బట్టి ఒకచోట స్థిరంగా ఉన్న గడియారం కంటె ప్రయాణం చేస్తున్న గడియారం స్లోగా తిరుగుతుందని అతని ఊహ.

ఈ వేగనిత్యత్వ సూత్రాన్ననుసరించే, ఐన్‌స్టీయన్ ద్రవ్యాన్ని శక్తిగాను, శక్తిని ద్రవ్యంగానూ మార్చవచ్చుననే సిద్ధాంతాన్ని తయారుచేసినట్టు ఏటంబాంబు తయారీ సందర్భంలో ఇదివరకే చెప్పాడు. ప్రథమంగా, ఈ సిద్ధాంతం సూర్యుని శక్తి యొక్క మూలాన్ని విశదంచేసింది. సూర్యుడు తన ద్రవ్యాన్నే ఇంధనంగా చేసుకుని ఉంటే, ఎప్పుడో చల్లబడిపోయి ఉండేవాడు. కాని ఐన్‌స్టీయన్ ప్రతిపాదించిన ($E=mc^2$) ద్రవ్యాన్ని శక్తిగా మార్చవచ్చుననే యీ సూత్ర ప్రకారమే ఇంతవరకూ ప్రకాశించడమేకాక సూర్యుడు ఇంకా కొన్ని కోట్ల సంవత్సరాలవరకూ కాంతి ప్రసారం చేయగలుగుతాడు.

ఐన్‌స్టీయన్ 1909లో జూరిచ్ విశ్వవిద్యాలయంలో ప్రత్యేక పండితుడుగా పనిచేశాడు. తరవాత ప్రేగ్‌లోని జర్మన్ విశ్వవిద్యాలయంలోనూ పనిచేశాడు. తదుపరి మళ్లీ జూరిచ్‌లోనూ అనంతరం బెర్లిన్‌లోని కైజర్ విల్‌హెల్మ్ ఇన్‌స్టిట్యూట్‌లోనూ పనిచేశాడు.

ఐన్‌స్టీయన్ ఏటంబాంబును తయారుచేసినందుకు ఎంతో విచారించాడు. జపాను ప్రజల మీద ఈ భయంకర మారణాస్త్రాన్ని ప్రయోగించకుండా, దాని శక్తిని మాత్రం జపాను ప్రభుత్వానికి నిరూపిస్తే చాలునని ఆశించాడు. కాని అలా జరగలేదు. పరమాణుశక్తి మానవ శ్రేయస్సుకి మాత్రమే ఉపయోగించాలి అని ఆశించాడు.

ఈ విశ్వాన్ని పాలించే విశ్వపరిపాలన సూత్రాలను సులభం చేసే కృషిలో ఉండగా, 1955వ సంవత్సరం ఏప్రియల్ 8న ఐన్‌స్టీయన్ కాలంచేశాడు. "భగవంతుడు జూదం ఆడడు" అని ఆయన అన్నాడు.



# ప్రశ్నావేదిక??

జవహర్, మెడికల్ స్టూడెంట్ - విశాఖపట్టణం

గతనెల 'యువ'లో 'పనిలేని మంగలి' రచయితలు, చలం - అష్టగ్రహకూటమిపై విమర్శించారు, కొన్ని అపోహలు అనవసరంగా పెట్టుకుని. నిజం తెలిసివుంటే ఇట్లా రాయనూరాయరు, రాసి దొరికి పోనూపోరు.

చలానికీ - అష్టగ్రహకూటమికీ సంబంధమేలేదు. చలం ప్రచారం చేయించిన విషయం, 'సౌరిస్ హృదయంలో అవతరించి దర్శన మిచ్చిన ఈశ్వరుడు' చెప్పిన ప్రళయం. ప్రళయం వస్తేనేం రాకపోతేనేం, ఈశ్వరుడు చెప్పింది విశ్వసించడం ధర్మం. ఎందుకంటే ఈశ్వరుడు నిజం కనక. ప్రళయం రాలేదంటే, ఏమో ఎందుకు ఆపారో ఈ ప్రమాదాన్ని !

చలంగారిపై ఆరోపించిన విషయాలన్నీ ఉత్తకుళ్లు ఏడుపు, ఇట్లా పత్రికారణ్యరోదనమవుతోంది. ఏనాడు ఆయన్ని అర్థం చేసుకున్నారు గనక. ముందు ఆ అర్హత కావాలి.

జవహర్ గారూ, మీరీ ఉత్తరం 'ఉత్తరాల శీర్షికకి' అని వ్రాసి పంపారు. అందువల్ల సమాధానం ఇస్తున్నాను. లేకపోతే చదువుకొని నవ్వుకొని వూరుకునే వాణ్ణి.

మీరు అష్టగ్రహకూటమిని గురించి చెప్పింది ఈశ్వరుడు గనక, దాని తప్పు వొప్పుల బాధ్యత ఈశ్వరునిదేగాని చలంగారిది కాదనీ, అందువల్ల చలంగారిని విమర్శించడంలో మేము తప్పు చేశామనీ (మీ భాషలో కుళ్లు ఏడుపు) వ్రాశారు.

తరువాత ఈశ్వరుడు చెపితే మాత్రం, ఆయన తప్పు చెప్పాడో వొప్పు చెప్పాడో తెలుసుకోకుండా చలంగారు ఎందుకు ప్రచారం చేశారని మేము అడుగ గలమనే వుద్దేశంతో, 'ప్రళయం వస్తేనేం రాక

పోతేనేం ఈశ్వరుడు చెప్పింది విశ్వసించటం ధర్మం. ఎందుకంటే ఈశ్వరుడు చెప్పింది నిజం గనుక' అని వ్రాశారు.

ఎంత అన్యాయంగా ఆలోచిస్తున్నారండీ! ఈశ్వరుడే చెప్పివుంటే అది నిజమే అవుతుంది. అంతవరకూ నేనూ అంగీకరిస్తాను. ఈ తర్కాన్ని అనుసరించి, ఇప్పుడు అనుకున్నది నిజం కాలేదు గనుక ఆ చెప్పింది ఈశ్వరుడు కాదనే అనుకోవలసి వస్తుంది గదండీ.

అయితే చలంగారు చెప్పాలని అబద్ధం చెప్పారని నేను అనటంలేదు. ఆధ్యాత్మిక సాధనలో అనేక భ్రమలు కలుగుతూ వుంటాయనే సంగతి సాధకులందరికీ తెలిసిన విషయమే. సాధకుడు గమ్యస్థానం దగ్గరిస్తున్న కొద్దీ దుష్టశక్తులు అనేకం విజృంభించి, అనేక రూపాలు ధరించి అతనిని భ్రమ ప్రమాదాలకు లోనుజెయ్యటానికి విశ్వప్రయత్నం చేస్తాయి. ఈ శక్తులు తామే భగవంతునిగానూ, తమ ధ్వనులు భగవంతుని కంఠ స్వరాలుగానూ భ్రమింప జెయ్యగలవు కూడాను. ఇటువంటి దుష్టశక్తులు ఏసుక్రీస్తూ, బుద్ధుడూ మొదలైన వారిని మోసం చెయ్యటానికి ప్రయత్నించాయని చరిత్ర చెపుతూనే వుంది అయితే వారు ఈ దుష్టశక్తులను నమ్మక వాటితో పోరాడి, జయించి సిద్ధులయ్యారు. చలంగారు మాత్రం వాటిని నమ్మి మోసపోయారు.

మిగిలిన విషయాలు ఎలావున్నా, ప్రళయం రాలేదనీ, మనం ఇంకా బ్రతికే వున్నామనీ మీరు నాతో అంగీకరిస్తున్నందుకు సంతోషం. మీరు అంగీకరించారు గనక సరిపోయిందిగాని, అలా అంగీకరించక మనం అష్టగ్రహకూటమి రోజుల్లో జలప్రళయంలో చిక్కుకొని చచ్చిపోయామనీ, మాయలో చిక్కుకొని బ్రతికి వున్నామని అనుకుంటున్నామనీ, అంటేమాత్రం చేసేది ఏముంది చెప్పండి !

చివరికి మీరు 'ఏనాడు ఆయన్ని అర్థం చేసుకున్నారు గనుక' అని విచారించారు. ఏది ఏమయినా ఈ విచారం మాత్రం అనవసరమండీ.

ఆంధ్రదేశం ఆయన్ని ఎప్పుడూ సరిగ్గానే అర్థం చేసుకుంది. అర్థం చేసుకోందల్లా ఆయన భక్తులే.

సరే, నేను వ్రాసిన వ్యాసాన్ని గురించి మీ ఉత్తరంతోపాటు 'యువ' పాఠకులు చాలా ఉత్తరాలు వ్రాశారు. అందులో మీ పరిచయం నిమిత్తం వొక నమూనా ఉత్తరం ఇక్కడ ప్రచురిస్తున్నాను-

శ్రీ 'యువ' ఎడిటరుగారికి—నమస్తే.

ఫిబ్రవరి మాసం యువ యిప్పుడే చేతికందినది. చలంగారి అష్టగ్రహ కూటమి–స్కేరు–ను గురించి వ్రాసి పుణ్యము కట్టుకున్నారు. వారి pamphlet లో మరో వింత వున్నది. ఈ ప్రమాదం గురించి ప్రజలు వ్రతాలు, యజ్ఞాలు, దైవారాధనలు జరిపినంత మాత్రాన రక్షింపబడరు. చలంగారి కుమార్తె–ఈశ్వరుడని పిలువబడుతూవుంది. ఆ యీశ్వరుడిని ఆశ్రయించిన వారుమాత్రమే రక్షింపబడుదురనీ ప్రకటించిరి. మద్రాసులో వారి ముఖ్య దూతలు యింటింట చాటి – తెలివిగల పురుషులు అధైర్య పడనందున వారి యిండ్లలో ఆడవారితో చెప్పి భయపెట్టి కల్లోలము గలుగజేసిరి. వారి మాటలో సత్యములేదు. దేశక్షేమముకే యీ మార్పు అని చాలా మందికి మాబోంట్లు చెప్పవలసి వచ్చినది. ఇలాంటి చీడ పురుగులు – మరల తలయెత్తకుండగా చర్యతీసుకోగలిగిన మీకు అందరమూ కృతజ్ఞులము.

భవదీయుడు
కె. టి. శేషయ్య
మద్రాసు

* * *

*ఎ. వి. వి. నరసింహరాజు, పాలకొల్లు*

ఓటరు ఎటువంటివాడై వుండాలని మీ ఉద్దేశం?

తన శ్రేయస్సు తనకు తెలిసినవాడై వుండాలి.

* * *

సి. హెచ్. వీరభద్రయ్య, జగ్గయ్యపేట

మీరు ఎడిటోరియల్‌లో కాంగ్రెస్‌కి సపోర్టు చేశారు ? ఎందుకని ?

అధికారంలోకి వస్తే కాంగ్రెస్‌కంటే తక్కువ తప్పులు చేసే పార్టీ, ఇంకొకటిలేదు గనక.

* * *

యస్. ఆర్. గుళ్ళపల్లి, హైదరాబాద్

విశ్వభారతి ఎప్పుడు స్థాపించబడింది ?

పందొమ్మిదివందల నాలుగులో.

దీని స్థాపనలో రవీంద్రుని అభిప్రాయం ఏమిటి ?

రవీంద్రుని అభిప్రాయం 'విశ్వభారతి' అనే పేరులోనే స్పష్టపడుతూ వుంది. భారతీయ సంస్కృతిని పునఃప్రతిష్ఠ చెయ్యాలనీ అలా పునః ప్రతిష్ఠ చెయ్యబడిన ఆ సంస్కృతి విశ్వ సంస్కృతిగా విరాజిల్లగలదనీ ఆయన అభిప్రాయం

* * *

హెచ్. రామన్‌గౌడ్, గుంటకల్

జనవరి యువలోని ఆగస్టు 8 అనే కథ సినీనటుడు యస్. వి. రంగారావుగారు రచించిందేనా అండి ?

అవునండీ. అక్షరాల ఆయన రచించిందే.

* * *

పురంద్ర, వేములవాడ

ప్రస్తుతపు తెలుగు సాహిత్యాన్ని గురించి మీ అభిప్రాయం ఏమిటి ?

ప్రసవ వేదనలో వున్నది.

* * *

కె. వి. స్వామి, వేములవాడ

వ్రాసిపెట్టిన గీత అలా వున్నప్పుడు దేవుడు అంటారెందుకండీ ?

ఆ గీతను వ్రాసి పెట్టింది దేవుడు గనుక.

*ఆల్ ఫ్రెడ్, పత్తికొండ, కర్నూలు జిల్లా*

ఈ ఎలెక్షన్ ఫలితంగా ప్రతిపక్షంవారి పరిపాలనే నిజమైతే దేశం ఎలా వుంటుందంటారు ?

అధికారంలోకి వచ్చేపార్టీని బట్టిగదండీ వుండేది. ఏదైనా మీ ప్రశ్నకు సమాధానం ఆలోచించటమే భయంగావుంది.

*    *    *

*కె. జి. నాగరాజగుప్త, హోసూరు*

రాజాజీ స్వతంత్రపార్టీ స్థాపించడంలో వారి ఉద్దేశం ఏమిటంటారు ?

కాంగ్రెస్‌ని పడగొట్టటమేనని ఆయన పదే పదే చెపుతున్నాడు గదండీ ఆయన మాట నమ్మటం మంచిది.

*    *    *

*యస్. యన్. కాట్రగడ్డ, విట్టలవానిపాలెం*

''ప్రజాస్వామిక వేత్తల ప్రశంసలకు పాత్రురాలయిన ప్రజాస్వామిక దేశం ఏది ?

బ్రిటన్.

*    *    *

*లోలుగు అప్పాజీ, రాజమండ్రి*

ఇతర దేశాలతో సరిహద్దు సమస్యలను పరిష్కరించుకున్న చైనా మన దేశంతో చేసుకోక పోవటానికి కారణం ఏమిటంటారు ? వారివాదన బలహీనత ? లేక మన ప్రభుత్వ పెడసరితనమా ?

మంచి మనస్సులలో ఇటువంటి అనుమానాలు రేకెత్తగలందులకు చైనా ఇతర దేశాల సరిహద్దు సమస్యలను పరిష్కరించుకున్నది అని అనిపిస్తూవుంది.

ఏదయినా దలైలామా వున్నది మన దేశంలోనేగాని ఇతర దేశాల్లో కాదుగదా !

*    *    *

*యం. హైమవతి, గుంటూరు.*

నెహ్రూ, విదేశాంగ రాజనీతి విఫలమయిందని రాజాజీ వంటి నాయకులు అంటున్నారు. మీ ఉద్దేశం ఏమిటి ?

అటువంటి నాయకులతో నేను ఏమాత్రం ఏకీభవించను. ఈనాటికి మనం మన కాళ్ళమీద నిలువ గలగటానికీ, 'నేను భారతీయుణ్ణి' అని సగౌరవంగా చెప్పుకోగలగటానికీ మన ప్రధాని విదేశాంగ రాజనీతే కారణమని నా దృఢ విశ్వాసం.

మన దేశం వున్న పరిస్థితుల్లో ఇతరులు మనమీదకు దాడి చెయ్యకుండా వుండటం, ప్రపంచంలో ఎక్కువ మిత్రులను పోగు జేసుకోవటం గదా ముఖ్యం. ఆ పని నెహ్రూ రాజనీతి అత్యద్భుతంగా సాధించిందని నేను అనుకుంటున్నాను.

స్వరాజ్యం వచ్చిన రోజుల్లో జిన్నా నాయకత్వం క్రింద పాకిస్తాన్ వేరు రాజ్యంగా ఏర్పడిన సంగతి మీకు తెలిసిందే. పాకిస్తాన్ మహమ్మదీయ రాజ్యం అని జిన్నా ప్రచారం. ఆ ప్రచారం వల్ల మహమ్మదీయ రాజ్యాలన్నీ ఏకమయ్యే అవకాశం ఆనాడు వుంది. అలా ఏకమయ్యి వుంటే మనం ఇరకాటంలో పడివుండే వాళ్ళం. నెహ్రూ విదేశాంగ నీతి దేశాన్ని ఈ ఆపదనుంచి రక్షించింది. సూయజ్ తగాదాలో అరబ్ రిపబ్లిక్‌ని సమర్ధించటం, ఇండొనీషియా ప్రజోద్యమాన్ని ప్రజల వాంఛలనూ సమర్ధించటం మొదలైన తెలివిగల పనులు నెహ్రూ చెయ్యటం వల్ల ఇప్పుడు పాకిస్తాన్ ఏకాకి అవటం ప్రత్యక్షంగా కనుపిస్తూనే వుంది. మనకు దగ్గరలో వున్న పెద్ద పెద్ద మహమ్మదీయ దేశాలన్నీ మనకు స్నేహంగా సన్నిహితంగా వుండటం నెహ్రూ గొప్పతనమూ, ఆయన విదేశాంగ నీతికి విజయ చిహ్నాము అని నేను అనుకొంటున్నాను.

చైనా మన భూమిని ఆక్రమించుకున్న పిదప నెహ్రూ విదేశాంగనీతి వల్ల పాకిస్తాన్‌కి పట్టినగతే చైనాకు పట్టింది. ఇప్పుడు ప్రపంచంలో చైనాను 'రామరామ' అంటున్నవారు లేరు. చివరకు ఈ తోటి కమ్యూనిస్టు దేశమైన రష్యాకూడా చైనాతో పొత్తును వొదిలించుకునే స్థితికి వచ్చింది. నెహ్రూ విదేశాంగ నీతి ఘనతకు ఇంతకంటే నిదర్శనం ఏంకావాలి. పాకిస్తాన్‌కివలె చైనాకూడా నేడు ప్రపంచంలో ఏకాకి.

తోటి కమ్యూనిస్టు రాజ్యం కూడా దాని చర్యలను సమర్థించక పోగా నానాటికీ వ్యతిరేకం అవుతున్నట్లు నిదర్శనాలు కానవస్తున్నాయి.

ఈలోగా మన దేశం క్రమక్రమేణా బలపడుతూవుంది.

*   *   *

*యం. మనోహరరెడ్డి, ఇందుర్తి*

కృష్ణమీనన్ కమ్యూనిస్టే అంటారా ?

కాదు. సోషలిస్టు.

నెహ్రూ కృష్ణమీనన్‌ని వెనుక, వేసుకురావటం ఎందుకండీ ?

నెహ్రూకూడా సోషలిస్టు గనుక.

*   *   *

*టి. మల్లేశ్వరరావు చౌదరి, నందికొండ*

నేడు దేశంలో ప్రబలుతున్న అవినీతికి ఏమన్నా మందు వుందంటారా ?

వుంది.

వుంటే ఏమిటంటారు ?

ఎవరికి వాళ్ళం, ఈ క్షణంనుంచి, సంఘంలో నీతిగా బ్రతికే వాళ్ళని గౌరవించటం.

*   *   *

*ఎ. కళ్యాణి, తెనాలి*

యువ దిన దినాభివృద్ధి చెందాలని నా అభిలాషండీ. దీనికి మీరేమంటారు ?

భగవంతుడు మీకు వాక్శుద్ధిని ప్రసాదించాలని ప్రతిరోజూ కోరుకుంటూ వుంటాను.

*   *   *

*వి చలపతిరావు, వీశాపురం*

అష్టగ్రహకూటమి వాదోపవాదాలవల్ల మనం నేర్చుకున్న దేమిటండీ ?

దేనినీ గ్రుడ్డిగా నమ్మగూడదని నేర్చుకున్నాం.

కొంతమంది, మానవులకు ఇంకా అపకారం జరగవచ్చు అనే అంటున్నారండీ ?

గ్రుడ్డిగా నమ్మడంలో వున్న చిక్కే ఇది దానికి వొక హద్దంటూ వుండదు. జీవిత పర్యంతం వెంట పడుతూనే వుంటుంది. ★

# గతమాసం చిత్ర పరిచయ పోటీ



బహుమతి పొందిన వ్యాఖ్యా :

" ఎదుటివారి గుట్లు ఎరిగిన నేమాయె
నెలచివరి దినమున నిధులు సున్న"

పంపినవారు : ఎమ్. రామక్రిష్ణయ్య, విజయవాడ-3

---

చిత్ర పరిచయ పోటీకిగాను వేయబడిన బొమ్మకు సరియైన వ్యాఖ్య వ్రాసినవారికి పదిరూపాయల విలువగల పుస్తకములను బహుమతిగా పంపుతాము. ఇంగ్లీషు కాప్షన్ పనికి రాదు. వ్యాఖ్య ఈ నెల 15 వ తేదీలోగా యువ సంపాదకునికి చేరాలి.

# చీకటి గదులు

సీరియల్

## గోపీచంద్

ఆరోజే దమయంతి అన్నగారు, గోపాలాన్ని చాటుగా పిలిచి బంధువులందరికీ టెలిగ్రాములు ఇప్పించాడు మరనాటికల్లా. ఆయన స్వగ్రామమైన మేడూరునుంచి బంధువులే కాక ఇరుగు పొరుగు అమ్మలక్కలు కూడా వచ్చారు. అవాడకట్టు అందరికీ దమయంతి తలలో నాల్కలాగు వుండటమే అందుకు కారణం. కోడూరునుంచి కృష్ణస్వామి పెద్ద అన్న సోమశేఖరం గారూ, చెల్లెలు రుక్మిణమ్మా మొదలైన వారందరూ వచ్చారు

ఎవ్వరు వచ్చి ఏం లాభం ? శోభనాచలపతిగారు వచ్చినప్పటినుంచీ, ఇంట్లోవున్న మిగిలిన వాళ్ళే కాకుండా, దమయంతి సైతం తన్ను తాను మోసం చేసుకోవటం మానివేసింది. అంతకుముందు ఎవ్వరూ దమయంతి జబ్బును గురించి వున్నది వున్నట్లు చెప్పుకునేవారు కాదు. మిగిలిన వారికి యదార్థం లీలగా ఏ మనస్సు పొరలలోనో మెదలుతూ వుండేదిగాని దమయంతి మాత్రం తెలిసి తెలిసి కుత్రిమ వాతావరణాన్ని ప్రోత్సహిస్తూ వుండేది. ఏ కారణం వల్లోగాని శోభనాచలపతిగారు ఆ ఇంట్లో అడుగు పెట్టటంతో ఈ వాతావరణం చురకత్తితోవలె ఛేదించబడింది.

ఆయన ముఖంమీద గుడ్డ వేసుకొని ఏడుస్తుంటే దమయంతి కూడా ఆపుకోలేక ఏడ్వటమే దీనికి కారణం కావచ్చు.

నిజానికి దమయంతి అప్పుడు చచ్చిపోతాననే భయం కొద్దీ ఏడ్వలేదు. ఆమెకు ఆ భయం ఎప్పుడూ లేదు. ఒకప్పుడు తాను ఏదన్నా అయితే ఈ కుటుంబం ఏమవుతుందో అనే తాపత్రయం వుండేది. ఇప్పుడు అదీ లేదు. ఇక ఎందుకు ఏడ్చినట్లు అంటే ఏకోదరుడైన అన్న ఏడుస్తుంటే అతని బాధను చూడలేక ఏడ్చింది. మొత్తానికి ఆ ఏడ్పు అంతకముందు సత్యాన్ని కప్పుతున్న ఉల్లిపర పొరను తుడిచివేసింది. ఆక్షణం నుంచీ ఆ ఇంట్లోవున్న వాళ్ళందరు దమయంతి ప్రమాద స్థితిలో వుందని అంగీకరించటమే కాక, పరామర్శించటానికి వచ్చిన వారికి వున్నది వున్నట్లు చెప్ప నారంభించారు. అంతకుముందు 'ఇవాళ కొంచం నయమేనమ్మా' అనీ, 'వొక వారం రోజుల్లో లేచి నడవ వచ్చని డాక్టరుగారు చెప్పారు' అనీ, 'తీసివేసినట్టు పొమ్మంటే పోతుందా అమ్మా ? దానికి రోజు రావొద్దూ' అనీ అంటూవుండే రత్నమ్మగారు కూడా 'ఏమోనమ్మా, ఏమికానుందో అన్నిటికీ ఆ పరమాత్ముడే వున్నాడు' అని కన్నీరు పెట్టుకుంటూ చెప్ప మొదలిడింది.

ఇక దమయంతి సంగతి చెప్పనే అవుసరం లేదు. ఆమె మాటల్లో ఈ విషయం ప్రస్తావించక పోయినా, ఆమె ప్రతి కదలికా, చూపుల ప్రతి అంచూ, ఆమె సెలవుతీసుకునే ప్రయత్నం మీద వున్నదనే సంగతి స్ఫురింపజేసేది

ఇక కృష్ణస్వామి గారి సంగతి చెప్పనే అవుసరం లేదు. అకస్మాత్తుగా జీవితాదర్శం పోగొట్టుకున్న వ్యక్తికివలె ప్రవర్తించే వారు. ఏం చెయ్యాలో ఏం చెయ్యగూడదో, ఏం మాట్లాడాలో ఏం మాట్లాడగూడదో ఆయనకు తెలిసేది కాదు

ఇంట్లో జరుగుతున్న పనులన్నీ చూస్తూ మెదలకుండా కూర్చునే వారు. అయినప్పటికీ దమయంతికి జబ్బు నయం కాదనే భావం ఆయన నమ్మలేక పోయారు. ఎవ్వరెన్ని అనుకున్నా 'ఏదో జరుగుతుంది ఆమె మామూలు మనిషి అవుతుంది' అనే నమ్మకం ఆయనను విడిచిపెట్ట లేదు.

"ఇంతకుముందు కంటే కొంచం నయం అనుకుంటాను" అనేవారు గోపాలంతో.

గోపాలం ఏమనగలడు? "అవును నిజమే" అనేవాడు.

"కాలు కొంచం ఇంతకుముందు కదిలింది" అనేవారు

"నిజమే" అనేవాడు గోపాలం.

"చూపుల్లో తెలివి కనుపిస్తూ వుందికదూ?"

"అవును"

"ఏ జబ్బయినా బాగా హెచ్చిగాని తగ్గదు" అని తనకు తాను సమాధానం చెప్పుకునే వారు.

శోభనాఛలపతిగారు వచ్చిన రోజు సాయంకాలాని కల్లా ఆమెలో మార్పు కనిపించిన మాట నిజమే. మాటిమాటికీ రత్నమ్మగారినీ కమలనూ పిలిచి ఇంటి సంగతులు మాట్లాడుతూ వుండేది. ఇంటిసంగతులు అంటే ఆ పూట వండబోయె కూరల దగ్గరనుంచీ మాటాడేది. కమల అత్తవారి ఇంటిదగ్గర విషయాలన్నీ గుచ్చిగుచ్చి అడిగినట్లు అడిగి తెలుసుకుంటూ వుండేది. కృష్ణస్వామి గారు ఆమె మంచం దగ్గరకు రావటానికి జంకి అటూ ఇటూ తిరుగుతుంటే, చిరునవ్వు నవ్వుతూ పరియాచకాలు ఆడుతుండేది.

"ఈ కుంటిదాన్ని ఏం చేద్దామా అని ఆలోచిస్తున్నారా?" అని అడిగేది.

"కుంటి కులాసం, ఇంటికి మోసం" అనేది.

"కుంటిదాన్నయినా ఈ ఇంటిమీద పెత్తనం చెయ్యటం మానుకోను. మంచం మధ్య కూర్చొని పెత్తనం చెలాయిస్తాను" అనేది.

"అలాగే చెయ్యి ఈ ఇంట్లో నీ పెత్తనం కాదనేవాళ్లెవ్వరున్నారు? "అనేవారు కృష్ణస్వామి గారు.

"కాదనే వాళ్లు లేకేం? వున్నారు. కాని పాపం సాగక వూరుకుంటున్నారు. సాగితే ఈపాటికి ఈ ఇంట్లోనుంచి బయటకు సాగనంపేవారు కూడాను" అనేది.

కృష్ణస్వామిగారు ఆమె తనని గురించే అంటూ వుందని తెలిసి నవ్వుకునేవారు. "అవునవును. నీ నోటికి జడిసి మంచిగా వుంటున్నాం" అనే వారు

"నే టి అ వ స రా లు"




"ఆమె అంత పెద్ద సినిమాయాక్టర్ గందా అయ్యగారితో ఈమెకేమి పనొచ్చింది?''
''అయ్యగారికే ఆమెతో పనొచ్చింది. ఈ రోజు మీటింగ్ ఉందిగా, జనాన్ని రాబట్టేందుకు పదివేలిచ్చి పిలిపించారు.''

---

అందర్లోకి ఆమె గోపాలంతోనే తక్కువగా మాట్లాడేది. అతను విడువకుండా ఆమె కాళ్ల దగ్గర కూర్చొని వుండేవాడు. ఆమె మగతగా పడుకొని వున్నంత కాలం పడుకొని వుండేది. కాస్త తెరిపిన పడగానే, గోపాలంతో వొంటరిగా వుంటే ఏం మాట్లాడవలసి వస్తుందోనని ఎవ్వరినో వొకరిని పిలిచేది. ఏదో మాటలు పెట్టుకొని కూర్చునేది.

గోపాలానికి కూడా మాట్లాడటానికి ఏమీ కనపడేదికాదు. ఆమెకు ఏదన్నా జరిగితే, ఈ ప్రపంచంలో తనకు మిగిలేది ఏమిటో అతనికి అర్థం అయ్యేదికాదు. ప్రపంచం అంతా బావురుమన్నట్లు కనుపించటంవల్ల మనస్సుని అటు పోనివ్వకుండా, దృష్టిని ఆమె పాదాల మీద కేంద్రీకరించి కూర్చునేవాడు.

అలా కూర్చోవటం అతనికి అలవాటైపోయింది. అతనిని ఆవిధంగా చూడటం ఆమెకు అలవాటైంది.

తండ్రినీ కొడుకునీ ఆవిధంగా చూచి శోభనాచలపతిగారు చాలా ఆశ్చర్యపడ్డారు. అదేదో అపూర్వమైన దృశ్యం అనిపించింది ఆయనకు. ఏ కవి భావనగానో, ఏ చిత్రకారుని ఊహగానో కనిపించి ఆయన మనస్సు ఆర్ద్రమయింది.

ఆయన ఇటీవల చెల్లెలను గురించి చాలా ఆలోచిస్తూవుండేవాడు. ఆమె డబ్బుకోసం వుత్తరం వ్రాసినప్పుడల్లా ఆయన మనస్సు వేదన పడుతూవుండేది. ఆ ఆవేదన ఆమెకు డబ్బు పంపవలసి వచ్చినందుకుకాదు. ఆమె కుటుంబ పరిస్థితులు పర్యాలోకనం చేసుకొని.

ఆయనకు అటువంటి పరిస్థితుల్లో తన చెల్లెలిని కృష్ణస్వామికి ఇచ్చి వివాహం చెయ్యటం వివేకవంతమైన పనిగా తోచేదికాదు. తాము ఆమెను ఇచ్చింది రెండవ వివాహానికి. పోనీ ఆయనకు సంపాదన ఏమన్నా వున్నదా అంటే, అదీలేదు. తాము ఈ చెల్లెలికి వివాహ సమయంలో ఇచ్చిన ఆస్తి అమ్ముకు తినేటట్లుగా కనుపిస్తున్నారు. పోనీ సంఘంలో ఏదన్నా ఉన్నత పదవిలోకి వొచ్చే అవకాశం ఆయనకు వున్నదా అంటే అదీ కనపడటంలేదు. ఈ పద్ధతిన ఈ సంబంధంవల్ల తన చెల్లెలు బావుకు తినేది ఏమిటో ఆయనకు అర్థం అయ్యేదికాదు. పైగా మారుటి పిల్లలు పెరిగిన వాళ్లు ఇద్దరున్నారు. కొడుకు ఇంట్లోనే వుంటున్నాడు. వాళ్లతోపాటు, వాళ్ల అమ్మమ్మ కూడా వుండటం మరీ అన్యాయంగా తోచేది శోభనా చలపతిగారికి. తన చెల్లెలు వొక పద్మవ్యూహంలో చిక్కుకున్నట్లు అనిపించి విపరీతంగా బాధ పడేవాడు.

తన చెల్లెలికి కూడా పిల్లలు కలుగుతున్నారు. వాళ్లేమయ్యేటట్టు. ఎప్పటికైనా వాళ్ళని తామే పెద్దవాళ్ళను చెయ్యవలసిన అవుసరం రావచ్చునిపించేది ఆయనకి.

ఈ విధంగా ఆలోచించుకొని చాలా విచారించేవాడాయన. ఇక ఇప్పుడు తాను చెయ్యగలిగింది మాత్రం ఏముంది? అక్కడికీ వొకటి రెండుసార్లు ఈ విషయాలు సూచాయగా చెల్లెలికి వ్రాసిన ఉత్తరాల్లో ఆయన ప్రస్తావించారు.

దానికి ఆమె తను తన ధర్మం నిర్వర్తిస్తున్నాను అనే వొకే వొక ముక్క సమాధానంగా వ్రాసి వూరుకుంది. ఆమెకు ఆ విషయం ప్రస్తావించటం ఇష్టం లేదని ఆమె ఉత్తరాల వల్ల తెలుసుకొని తానూ మెదలకుండా వూరుకున్నాడు శోభనాచలపతి.

అంతదూరాన వుండి తన చెల్లెలిని కృష్ణస్వామి గారు, రత్నమ్మగారూ, గోపాలం మొదలైన వారూ మాయ చేస్తున్నారని అనుకుంటూ వుండేవారాయన.

అటువంటి ఆయన చిత్తవృత్తి ఆ ఇంట్లో అడుగుపెట్టి నప్పటినుంచీ మారజొచ్చింది. తనచెల్లెలు ఆరోగ్యం కోసం ఆ ఇంట్లో వున్న ప్రతి వ్యక్తీపడే తహ తహకు ఆయన మనస్సు కరిగింది. ఈ తల్లీకొడుకుల దృశ్యం అతనికి భక్తిపారవశ్యాన్ని కలిగించింది. ఈఇంట్లో అడుగు పెట్టడం వల్ల తన చెల్లెలు జీవితం ధన్యత చెందిందని భావించి ఆనందాశ్రువులు రాల్చాడు.

'ఈ కుటుంబంలో వున్నవాళ్ళంతా ఎవ్వరి ధోరణిలో వాళ్లు వెర్రివాళ్లే కావచ్చు. ఈ వెర్రివాళ్ళందరూ కలిసి తన చెల్లెలిని వెర్రిదాన్ని చేసి వుండవచ్చు కాని ఈ వెర్రిలో ఎంత ఆకర్షణ వుంది! ఎంత ఆనందం వుంది!!' అనుకున్నారు శోభనాచలపతిగారు.

ఇంతకుముందు తనను కలవర పెట్టిన భావాలు తనలోఉప్పతిల్లినందుకు ఆయన అమితంగా సిగ్గు పడ్డారు. ఈ ప్రపంచంలో కొందరు భోగలాలసతకు పుడతారు. కొందరు విముక్తిని సంపాదించుకోటానికి పుడతారు. ఇందులో ఎవ్వరి ఆనందం వారిది. వీరిని వొకరితో వొకరిని పోల్చటం అంత అవివేకమైన పని ఇంకొకటి వుండదు.



రంగుల మామయ్యా

ఈ కుటుంబం విముక్తి సాధనకు పుట్టిన కుటుంబం. ఈ కుటుంబంలోని ప్రతివ్యక్తీ ఎవ్వరి ధోరణిలో వారు, తమకు తెలిసీ తెలియకుండా కూడా, అందుకే ప్రయత్నిస్తున్నారు. అటువంటి కుటుంబంలో కాలుపెట్టి ధన్యురాలైంది తన చెల్లెలు. నిజానికి తన చెల్లెలుకూడా మొదటినుంచీ వెర్రిదే. "ఇంత పిచ్చిది, ఇది ఎట్లా బ్రతుకుతుందిరా!" అని తమ తల్లి ఎప్పుడూ అంటూ వుండేది. ఆ వెర్రిది, ఈ వెర్రి ఇల్లు ప్రవేశించింది.

చూడగా చూడగా ఈ ప్రపంచం వొక క్రమ పద్ధతినే నడుస్తూ వున్నట్లు కనిపించింది శోభనాచలపతిగారికి. ఎక్కడకు జేరవలసినవారు, అక్కడకు జేరుతూవుంటారు. ఎవ్వరికి వారు, వారి ఆదర్శం చేరువకు నెమ్మది నెమ్మదిగా జేరుకుంటూనే వుంటారు. కాకపోతే మిగిలిన వాళ్లు తమ ఆదర్శంతో వాళ్లను కొలిచి, వెర్రివాళ్లనో, అసమర్థులనో, దురదృష్టవంతులనో అనుకుంటూ వుంటారు.

నెమ్మదిగా, తన చెల్లెలు మంచం దగ్గరకు వెళ్ళి "అమ్మా?" అని ఆమె చేతిని స్పృశించారు శోభనాచలపతిగారు.

దమయంతి, నెమ్మదిగా కండ్లు తెరచి చూచింది. "నీవు ధన్యురాలవు. పుట్టినింటికీ మెట్టిన ఇంటికీ కీర్తిని తెచ్చావు," అన్నారు.

ఆమె కండ్లు తళుక్కున మెరిసినై.

"నేను అర్థం చేసుకున్నానమ్మా నాకిప్పుడు అర్థమయింది," అన్నారు శోభనాచలపతిగారు.

ఆమె అన్నను ప్రీతి పూర్వకంగా చూచి, నిర్విచారంగా రెప్పలను ఆర్పి సంతోషంగా కండ్లను మూసుకుంది.

ఆరోజు సాయంకాలం ఆమె పడుకున్న గది నిశ్శబ్దంగా వుంది. ఆమె ఎంతసేపటినుంచి మగతలోవుందో, కన్నులు తెరిచి చూసేటప్పటికి గదిలో ఎవ్వరూలేరు. ఎక్కడకు వెళ్ళి వుంటారా అని ఆలోచించింది దమయంతి.

అంతలో పాదాల చెంత కూర్చొనివున్న గోపాలం కనుపించాడు ఆమెకు. అతను తల వంచుకొని కూర్చొని వున్నాడు. ప్రార్థన జరుపుతున్నాడా ? కన్నీటిని కప్పుకుంటున్నాడా ? ఆమెకు అకస్మాత్తుగా కొడుకుమీద అమిత జాలి కలిగింది. అతనిని విడిచి వెళ్లడం ఆ క్షణం ఆమెకు కష్టమే అనిపించింది.

'ఏనాటి అనుబంధమో ఇది !' అనుకున్నది. ఎంత ఆపుకుందామన్నా ఆగకుండా కన్నీరు ధారగా ప్రవహించి చెంపలనూ, పక్కనూ తడిపింది. గుండె దడదడ కొట్టుకుంది.

'ఇతనిని విడిచి వెళ్ళటం నా తరమా !' అనుకున్న దా తల్లి ఆ క్షణం.

ఆ భారం శరీరాన్ని కదిపి, పరవశతను కలిగించిం దామెకు !

"బాబూ ?"

ఆ పిలుపుకు తలవంచుకొని ఏదో ఆలోచిస్తూ కూర్చున్న గోపాలం ఉలిక్కిపడి, తల పైకెత్తి చూశాడు.

తన తల్లి అలా పిలిచి ఎన్నాళ్ళయింది.

"ఏమమ్మా ?"

"నువ్వలా విచారిస్తూ కూర్చొవటం నాకేం బాగా లేదయ్యా"

గోపాలం పొంగి పొర్లివస్తున్న శోకాన్ని ఆపుకోలేక "అమ్మా !" అని ఆమె పాదాలమీద పడి ఏడ్చాడు.

ఆమె కాదనలేదు. కాసేపు మెదలకుండా వూరుకొని అతని ఆక్రోశం తగ్గిం తరువాత "బయట వాళ్లు ఈ కుటుంబంలో వాళ్ళంతా మొండి వాళ్లు అమిత ధైర్యవంతులూ అని అనుకుంటూ వుంటారు. పట్టిన పట్టు విడువని సాహసులని కూడా అనుకుంటారు. నిజం వాళ్ళకేం తెలుసు ? ఈ ఇల్లు, వొట్టి పిరికి వాళ్ళ, బేలలపుట్ట. మీ అంత అమాయకులనూ పిరికి వాళ్లనూ ఇంతవరకు నేను ఎక్కడా చూడలేదు. నేర్పు అనేది వుండాలేగాని ఈ ఇంట్లో పుట్టిన వాళ్ళతో ఎవ్వరయినా ఏ పనయినా చేయించవచ్చు. మరి మిమ్మల్ని గడుసు వాళ్ళనీ, ధైర్యస్థులనీ అనుకుంటారెందుకో !! ఇతరులు అనుకోటానికీ, నిజానికీ ఎంత తేడా వుంది ! పిరికి వాళ్లు, ధైర్యస్థులం అనిపించుకోటానికి భీకరమైన ముఖాలు పెట్టుకు తిరిగితే ఇతరులు నమ్మి మోసపోతూ వుంటారనుకుంటాను. ఆ విధంగానేగదా మీ నాన్నగారు అత్యద్భుతమైన ధైర్య సాహసాలు గల వారని పేరు పొందింది!" అన్నది.

అప్పుడప్పుడు గోపాలానికి కూడా ఈ విధంగానే ఆలోచించ బుద్ధి అయ్యేది. నిజానికి తమకున్న ధైర్యం ఏమిటి ? ఇతరులకు లేనిది ఏమిటి ? ఈ కుటుంబంలో పుట్టిన ప్రతి వాడూ



ప్రతి చిన్న విషయానికీ హైరాన పడతాడు. రాత్రుళ్ళు నిద్రకు రోసి, పగలు అమ్మ అన్నట్లు భీకర ముఖాలు పెట్టుకు తిరుగుతున్నారు. ఇది ధైర్యం ఎట్లా అవుతుంది.

"ఏమయ్యా, నిజమేనా నే నన్నమాట?" అని అడిగింది దమయంతి అతని ఆలోచనలను చెదరగొట్టాలనే ఉద్దేశంతో.

"నిజమేనమ్మా."

"కాకపోతే మీకు మార్పుఅంటే, ఆ భయంవల్ల మారకుండా వుండగలందుకు, ఎటువంటి అపాయాన్ని ఎదుర్కోటానికయినా మీరు వెనుకంజ వెయ్యరు. అది ధైర్యం అని ఎవ్వరన్నా అనుకుంటే పాపం మీరు మాత్రం ఏం చేస్తారు?"

ఆమె మాటలకు అంత ప్రమాదకర స్థితిలోనూ నవ్వు వచ్చింది గోపాలానికి.

"నవ్వుతా వెందుకయ్యా?" అని అడిగింది దమయంతి.

"ఊరికినే?" అన్నాడు గోపాలం.

"నేను చెప్పింది నిజమంటావా, కాదా?"

"నిజమే నమ్మా. మేము పిరికి వాళ్ళం, తెలివి తక్కువ వాళ్ళం. సరా?" అన్నాడు గోపాలం.

"నువ్వు వొప్పుకుంటావు; నీకేం?"

"మరింకెవ్వరమ్మా వొప్పుకో వలసింది."

"మీ నాన్నగారు."

"నువ్వు వొప్పుకోమని చెపితే ఆయనా వొప్పుకుంటారు."

"నాతో చెప్పించుకుంటే ఆయనకు మాత్రం ఏం గౌరవం?" అని నవ్వింది దమయంతి.

ఆమెకు మళ్ళీ ఆయాసం ఎక్కువ అవుతూ వుందని గ్రహించాడు గోపాలం."

"కాసేపు మాట్లాడకుండా పడుకో అమ్మా. డాక్టరు ఎక్కువ మాట్లాడనీయ వద్దని మరీమరీ చెప్పాడు."

ఆమె కాసేపు నిజంగానే మాట్లాడకుండా పడుకుంది. ఆమె నిద్రపోతూ వుందేమో అనుకొని నెమ్మదిగా కాళ్ళు వొత్త నారంభించాడు గోపాలం.

ఆమె కండ్లు తెరచి గోపాలాన్ని వొక్క క్షణం సాదరంగా చూచి, "వొచ్చే జన్మలో నీ కడుపున పుట్టి నీ ఋణం తీర్చుకుంటా నయ్యా" అన్నది.

గోపాలం పెళ్ళగిలి వచ్చే శోకాన్ని ఆపుకోలేక, ఆమె ముందు ఏడ్వలేక, నెమ్మదిగా మంచం మీదనుంచి లేచి ఇంట్లోకి వెళ్ళటానికి ఉద్యుక్తుడయ్యాడు.

"ఇక అటువంటి మాటలు అననుగాని కూర్చో," అన్నది దమయంతి

అతను కూర్చున్నాడు. అంతలోకి కమల నిమ్మకాయ రసం తెచ్చి ఇచ్చింది. దమయంతి తాగి "అమ్మను వొకసారి ఇక్కడికి రమ్మని చెప్పమ్మా" అన్నది.

కమల ఇంట్లోకి వెళ్ళి చెపితే, రత్నమ్మగారు వచ్చారు. ఆమెతోపాటు కమల కూడా తిరిగి వచ్చింది.

"చూడమ్మా కాస్త కూర్చోవాలని వుంది. కొంచం కూర్చోబెట్టమ్మా" అన్నది దమయంతి.

"కూర్చోగలవా అమ్మా? నడుం నిలుస్తుందా!" అని ఆశ్చర్యపోతూ అడిగింది రత్నమ్మగారు.

"కూర్చోలేక నాకేం?" అన్నది దమయంతి. తనంతతానే నెమ్మదిగా లేవటానికి ప్రయత్నిస్తూ.

రత్నమ్మగారూ, కమలా సాయంపట్టి ఆమెను కూర్చోపెట్టారు.

"అమ్మా, నన్నొక్కసారి దేవుడి గదిలోకి తీసుకువెళ్ళమ్మా." అన్నది దమయంతి.

"డాక్టరు కదలనివ్వద్దన్నాడు తల్లీ, తేలిగ్గా వుంటే రేపు చేసుకోగూడదా దేవుని దర్శనం, పోనీ అబొమ్మను ఇక్కడకు తీసుకువస్తాను," అన్నది రత్నమ్మగారు.

"వొద్దమ్మా, ఆ గదిలోని వస్తువులను ఆ గదిలోనే చూడాలని అనిపిస్తూ వుందమ్మా. బాబూ, అమ్మ నన్ను ఆపలేదు, కాస్త చెయ్యి సాయం ఇవ్వు" అని గోపాలం చెయ్యి పట్టుకొని నెమ్మదిగా లేచింది. రత్నమ్మగారి భుజంమీదా కమల భుజంమీదా చేతులువేసి నెమ్మదిగా దేవుడి గదివైపు అడుగులు వేసింది.

గోపాలం వాళ్ళను అనుసరించాడు. ఆమె అంత తేలిగ్గా అడుగులు వెయ్యడం అతనికి చాలా ఆశ్చర్యం కలిగించింది. అంతకు ముందు వరకూ ఆమె పాదాలు మొద్దుబారి బహు కొద్ది స్పర్శజ్ఞానం మాత్రమే కలిగివున్నాయి. ఇప్పుడు అవి నడుస్తున్నయి. ఆమె భారాన్ని ఏ కొద్దిగానో మోయగలుగు తున్నయి.

ఆమెకు జబ్బు తగ్గుముఖం పట్టిందేమో అనిపించింది గోపాలానికి వొక్కక్షణం.

(సశేషం)

Printed and Published by A. Sudhakar Rao from Yuva Press, 5-9-88, Public Garden Road, Hyderabad-1. Controlling Editor Sri "CHAKRAPANI".


MOULIS




# అశోక్ డ్రెసెస్
## సుల్తాన్ బజార్, హైదరాబాద్.

---

## పుస్తక ప్రియులకు అపూర్వ అవకాశం!

| | | |
|---|---|---|
| ప్రతాపరుద్రమదేవి | కా. నారాయణరావు | 7-50 |
| రజనీప్రియ | నాగరాజు | 6-00 |
| మళ్ళీ వసంతం | సుదర్శన్ | 4-00 |
| దగాపడిన తమ్ముడు | బి. కాంతారావు | 5000 |
| రక్తసింధూరం | పి. రామమూర్తి | 6-00 |
| దత్తపుత్రుడు | ,, | 5-00 |
| ప్రాణదానం | ,, | 4-00 |
| వెలుగురేఖలు | శీలా వీర్రాజు | 4-00 |
| పెద్దపెద్ద కళ్లు | ఉపేంద్రనాథ్ అష్క్ | 4-00 |
| వల్లభమంత్రి | కవిసామ్రాట్ | 3-00 |
| గమ్యస్థానము | సూరిబాబు | 2-00 |
| కోనంగి | అడివి బాపిరాజు | 6-00 |
| వరలక్ష్మి | పి. వి. కృష్ణమూర్తి | 2-00 |
| సహచరులు | రాజేంద్ర | 1050 |
| పంకజం | రమాదేవి | 1-25 |
| నాగరిక | "సత్య" | 2-25 |

| | | |
|---|---|---|
| ఇదా నాగరికత? | రాంగేయరాఘవ | 1-25 |
| నరుడు | | 2-50 |
| జాజిమల్లి | | 2-50 |
| వల్లభమంత్రి | | 3-00 |
| చివరకు మిగిలేది | | 2-75 |
| సంధ్యారాగం | | 1-50 |
| మనుషులు-మనసులు | | 1-50 |
| పలాయితుడు | | 2-00 |
| ఆమ్రపాలి | | 2-00 |
| అజంతా | | 2-50 |
| మనోరమ | | 3-00 |
| వైకుంఠపాళి | | 1-00 |

రు. 101-ల ఆర్డరుకు పోస్టేజి ఫ్రీ. 20 రూ. ల ఆర్డరుకు మరో 5 రూ. ల పుస్తకాలు ఉచితం.

ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ-2

# యువ

## ఉగాది ప్రత్యేకసంచిక



**1962** ఏప్రియల్ నెల సంచికను తెలుగు సంవత్సరాది సందర్భంగా ప్రత్యేక సంచికగా మామూలు సైజులోనే రెట్టింపు పేజీలతో వెలువరిస్తున్నాము.



వెల రు. **1.00** మాత్రమే

జి. ఓ. మిసలేనియస్ నెం. 1647

ప్రకటన క్లాజు నెం. 8 అనుసరించి

| | |
|---|---|
| 1. ప్రకటన జరుగు స్థలము | యువ ప్రెస్, 5-9-88 పబ్లిక్ గార్డెన్ రోడ్, హైదరాబాద్. |
| 2. ప్రకటన కాలక్రమము : | ప్రతినెల ఒకటవ తేదీ. |
| 3. ముద్రణకర్త పేరు, జాతి, చిరునామా | ఎ. సుధాకరరావు, హిందువు, 5-9-88 పబ్లిక్ గార్డెన్ రోడ్, హైదరాబాద్. |
| 4. ప్రకటనకర్త పేరు, జాతి, చిరునామా | ఎ. సుధాకరరావు, for యువ ప్రెస్, హిందువు, 5-9-88 పబ్లిక్ గార్డెన్ రోడ్, హైదరాబాద్. |
| 5. సంపాదకుని పేరు, జాతి, చిరునామా | చక్రపాణి (ఎ. వి. సుబ్బారావు,) హిందువు, 5-9-88 పబ్లిక్ గార్డెన్ రోడ్, హైదరాబాద్. |
| యజమాని | చక్రపాణి (ఎ. వి. సుబ్బారావు) |

పైన యివ్వబడిన వివరము లన్నియు నా ఎరుక నమ్మకముల మేరకు సత్యములే అని ఇందుమూలముగా వక్కాణించుచున్నాను.

హైదరాబాద్
ది 1-3-1962

*(Sd.)* ఎ. సుధాకరరావు
ప్రకటనకర్త.